# భారతి

సాహిత్య మాసపత్రిక
ఏప్రిల్ 1978




ప్రథమ ముఖచిత్రము



వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

1

# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

ఏప్రిల్ 1978

సంపుటము : 55 సంచిక : 4

విడిపత్రిక వెల రూపాయిన్నర

2

# గిరిజనుల నవజీవనం

గిరిజనాభివృద్ధికి పటిష్ఠమైన సంస్థలను ఏర్పాటు చేయడంలో ఆంధ్రప్రదేశ్ మార్గదర్శకమయింది. ఇంతవరకూ ఆంధ్రప్రదేశ్ షెడ్యూల్డు తెగల ఆర్థిక సహాయ సంస్థ, గిరిజన సహకార కార్పొరేషను, గిరిజనాభివృద్ధి సంస్థ, సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థల స్థాపన జరిగింది.

రాష్ట్రంలోని గిరిజనులకు ఆర్థికంగా ఒక నూతన శకం ప్రారంభమయింది. మూడవ ప్రణాళికా కాలంలో గిరిజనాభివృద్ధి కోసం ప్రణాళికా కేటాయింపు **1.80** కోట్ల రూపాయలు మాత్రమే వుండగా, ఐదవ ప్రణాళికలో ఈ మొత్తం **49.65** కోట్ల రూపాయలకు పెరిగింది.

వ్యవసాయం, చిన్నతరహా సేద్యపు నీటివనరులు, పశుపోషణ, విద్యుచ్ఛక్తి, విద్యారంగాలకు సంబంధించిన ప్రణాళికా పథకాలు చురుకుగా అమలు జరపడంతో ప్రగతి శక్తులు విజృంభించాయి గిరిజనులను వారి పాత ప్రపంచంనుంచి వేరుపరచడానికి అవిరళ కృషి జరుగుతున్నది.

వారికి ఉజ్వల భవిష్యత్తు ఉంది.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.
37/77-78



# విషయానుక్రమణిక

## ఏప్రిల్ 1978



ముఖచిత్రం :

ముఖచిత్రము ( సం॥ 1923 )

# నిశ్శబ్దం పలకమీద

డా॥ సి. నారాయణ రెడ్డి

నీవు రాసిన అక్షరాలు
ఇంకా మెరుస్తున్నాయి
నిశ్శబ్దం పలకమీద.

అప్పుడప్పుడు మద్దెల లౌస్తాయి
మబ్బుల్ని అనువదిస్తూ
మాట్లాడులాయి.

అప్పుడప్పుడు గమకాలౌస్తాయి
మెరుపుల్ని అనుకరిస్తూ
వంకర్లు పోతాయి.

ఎంత నల్లనిది ఈ పలక?
పండు వెన్నెల్లో ఉతికేసినా
నలుపు విరిగి పోనిది.

ఏమి బీజాక్షరాలో ఇవి?
పట్ట పగటితో తుడిచేసినా
రాత్రికి పొడుచుకొస్తాయి.

అక్షరాలు లేని చోటేదీ?
ఎడారిలో ఒంటెలకాళ్లు
కడలలో తిమింగలాల నోళ్లు
ఆకాశంలో నక్షత్రాల కళ్లు
అన్నీ అక్షరాలే.

అందుకే నీవు రాశావు
విసుగంటని వేళ్లతో
అగుపించని పలకమీద
వినిపించని అక్షరాలు.

గుడ్డిగవ్వ కన్నెరజేసినప్పుడు
గడ్డిపోచ చురకత్తి దూసినప్పుడు
పలుకుతుంది నీవు రాసిన పలక
ప్రపంచమే గొంతుకగా.
వినిపిస్తాయి ఆ బీజాక్షరాలు
జన హృదయమే కర్ణికగా.



# ఏడవకు

## శ్రీ పజ్ఞల కాళిదాసు

ఎందుకే అంత గట్టిగా
ఏడుస్తున్నావు పాపా, పసిపాపా !

గుక్క తిప్పకుండా
గుడ్లు ఒప్పకుండా
ఏడుస్తున్నావలాగ
ఏమే ఓ పాపా, పురిటిపాపా !

భూమి మీద పడిన
మూడు నిముషాల వరకూ
మూతి ముడుచుకుని నువ్వుంటే
ముప్పతిప్పలూ పడ్డాం మేం —

—ముసలీ ముతకా
చిన్నా పెద్దా అందరం —
నిన్నేడిపించటానికి !

ఎలాగైతేనేం
ఏడిచేవులే ఆఖరికి !

గాఢాంధకారమయమైన
గర్భంలోంచి బయటపడ్డావుకదా
ఎంతో హాయిగా నవ్వక
ఏడుపెందుకే నీకు !

నీ రాకకోసం నీ తల్లీ తండ్రీ
ఇరుగూ పొరుగూ
ఎంతలా ఎదురు చూసేరు
ఎన్ని అంచనాలు వేసేరు !

నీ ఏడుపు విన్నంతనే
నిట్టూర్చేం అందరం —
ఇంకనుంచీ నువ్వుకూడా

ఈ మా అందరితో పాటు
జనాభా లెక్కల్లో
జమకట్టబడతావులే
బహుశా అందుక్కాదు కదా
నీ ఏడుపు !

నిబిడాంధకార గర్భంలోంచి
నిరాశా నీరంధ్రాంధ్ర జగతిలోకి
వచ్చినందుకా ... ?

మాయా పరివృత
కల్మష సరస్సుదాటి
నికృష్ట నీచ జీవిత విధానంలోకి
వచ్చినందుకా... ?

ఎందుకే
ఎవరేమన్నారనే ఈ ఏడుపు ? ...

అలిసిపోయి అలిసిపోయి
ఆఖరికి ఊరకున్నావు — తల్లీ
ఆకలి వేసిందంటే
లందుకుంటావులే మళ్లీ !
ఊరుకో ... ఊరుకోక ఏంచేస్తావు
అంతా క్షణభంగురం ...
...ఏడుపూ బ్రతుకూ కూడా !

ముందింకా ఎంత ఏడవాలో
—నవ్వాలో కూడా —
నవ్వుల్లో ఏడుపు, ఏడుపుల్లో నవ్వు
వెలుగులోనే నీడలు,
రగలని అగ్గికే పొగల జాడలు
మేఘంలో మెరుపు
చీకట్లో ఉల్కాపాతం !

# వెల్లువ

శ్రీ కలువకొలను సదానంద

అసుర గణాలకు జే కొడుతూ,
ఆశల్ని ప్రసవించి జో కొడుతూ
అంధకారంలో నిలబడ్డవాణ్ణి !

రేపటి విందుకోసం రోజులన్నీ గడిపేస్తూ,
ఈ పూట
ఆకలిని బుజ్జగిస్తున్నవాణ్ణి !

కాశ్మీరు రత్నకంబళాలను నేస్తూ
కటిక చలిలో కొంకర్లు పోతున్నవాణ్ణి !

తాజమహలు అందాన్ని
తాతలెక్కిన అందలాన్ని మెచ్చుకుంటూ,
అద్దాలమేడల మరుగుదొడ్ల నీడలో
అద్దెకుంటున్న వాణ్ణి !

ఎండిన రొమ్ముల్ని నములుతూ
అమ్మ ఒడిలో కూర్చున్న బందరామణ్ణి !

కన్నబిడ్డ కెవ్వుమన్నపుడు —
కరిగిన వెన్నలా కదిలివచ్చి
చీమ కుట్టిందో పాము ముట్టిందోనని
చెడ్డీ విప్పిచూచి చంకనేసుకోవల్సిన అమ్మ
అందం చెడి
ఆరోగ్యం చెడి
పక్షవాతం సోకిన 'అభయహస్తం' తో
ప్రతిమగా మారిపోతే —

ఒడ్డున పడదామన్న ఆశతో
గడ్డిపోచల్ని దొరకబుచ్చుకుంటూ
వెల్లువలో
దొర్లుకుపోతున్న వాణ్ణి !

అన్నలూ తమ్ముళ్ళూ అరవై కోట్లమంది;
ఎందుకూ ?
ఎవరికి వారే యమునాతీరే !
అందరికీ ఆశ్రయమివ్వగలది —

అదిగో,
అలసిపోయిన నదికి స్వాగతమిస్తోన్న
ఆనంద సాగరం !



# భయాన్మా అభయం గమయ

## డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

భయం, భయం, మహాభయం !
అడుగడుగున అమిత భయం !!
అంతు పొంతు లేని భయం !!

పెరుగుతున్న కొంది పెరుగు
పెనుభూతం, మహాభయం !
జీవితాన్ని నీడవోలె
వెన్నంటే వెడగు భయం !!

చిన్నప్పుడు కన్నవారి
తన్నులు పడలేక భయం !
చదువుచెప్పు పంతులంటె
మది నొదవు ననంత భయం !!

చదువుగాక పోదవు భయం
చదివి చదివి విసిగి భయం !!

యౌవనాన్ని కవ్వించే
జవ్వని వ్యామోహ భయం !
ముప్పదేండ్ల సేవనంలో
ఎప్పుడు అధికారి భయం !!

జరాక్రాంతమౌ వయసున
సంతత సంతాన భయం !
ఆడపిల్ల పెండ్లి భయం !
మగపిల్లల మాట భయం !!

ఇల్లులేక, ముల్లు మీది
అరటి యాకు పగిది భయం;
ఇల్లుకట్టి ఋణ బాధల
తల్లడిల్లు మనోభయం.

నిప్పుభయం ! నీళ్ల భయం !!
బూతు పాల బుడ్ల భయం !!

బస్సుభయం ! రైలు భయం !!
తుస్సుమను విమాన భయం !!

గాలి భయం, వాన భయం,
గరివాని తాకు భయం !!
దొంగభయం, దోరం భయం
దోపిడీల వార్త భయం !!

భగవంతుడు కలడటన్న
కలుగునెంతో పాపభయం !
భగవంతుడు లేడటన్న
కలుగు దిక్కులేమి భయం !!

ఆధి భయం ! వ్యాధి భయం !
సదా బిచ్చగాళ్ల భయం !!
తొంగిచూచు పొంచి పొంచి
సంగనాచి మిత్తి భయం !!

ఎప్పటికీ మానవాళి
కప్పిన భయ మంతరించు ?
ఎప్పు డితడు నిబ్బరంగ
చెప్పగలడు నిర్భయుడని ?

అంతదనుక ఈ ఆత్మకు
శాంతిలేక వాక్రుచ్చెద
భయంనుండి అభయానికి
ఆకాంక్షింతు గమింపగ.

భయాన్మా అభయం గమయ !
భయాన్మా అభయం గమయ !!
భయాన్మా అభయం గమయ !!!

కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు

# బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు కడప జాబుల సంకలనం

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము వారు సి.పి. బ్రౌను పరిశోధన ప్రణాళిక క్రింద నింతకు ముందు 1. బ్రౌన్‌లేఖలు 2. ఆంధ్ర గీర్వాణ ఛందము అను రెండు గ్రంథములు ప్రకటించినారు.[1] ప్రస్తుత గ్రంథము మూడవది.

ఈ గ్రంథమున 'అనుశీలన, ముందు మాటలు, ప్రవేశిక, బ్రౌన్ కడప జాబులు' అను నాలుగు భాగములున్నవి. వీనితో ప్రవేశికలో కడపతో బ్రౌను అనుబంధం, ఉయ్యాలవాడ నరసింహారెడ్డి తిరుగుబాటు, గుంటూరి కరువు, మాగ్డనల్డ్ హత్య, బ్రౌను సాహిత్య కార్ఖానా' అను అయిదు శీర్షిక యున్నవి. ఆ వెనుక కడప జాబులు 41 గలవు. దీనికి అముద్రిత గ్రంథ సూచి, అన్యదేశ్య పదసూచి అను రెండు అనుబంధములు గలవు. ఆ వెనుక ఉపయుక్త గ్రంథసూచి (బిబ్లియాగ్రఫీ) గలదు. గ్రంథ పర్యవేక్షణ జి యన్. రెడ్డి, గ్రంథ సంశోధన బంగోరె. పై గ్రంథములో ఒక్క 'అనుశీలన'అనునది మాత్రము జి. యన్. రెడ్డిది తక్కినయావత్ గ్రంథము సంశోధకుడైన బంగోరెది.

## జాబుల వివరణ సాహిత్య ప్రాధాన్యత

ఇందున్న జాబులు 41. వీని క్రమమును గ్రంథకర్తయే ఈ క్రింది రీతిగా నిర్దేశించినాడు.

| | | | |
|---|---|---|---|
| 1 | ఉయ్యాలవాడ నరసింహారెడ్డి, సాయుధ తిరుగుబాటు — జాబులు | 2 | |
| 2 | గుంటూరు కరువులో కడప కటకటలు | 5 | |
| 3 | మాగ్డనల్డ్ హత్య | 1 | |
| | | ——— | 8 |
| 4 | కడపలో బ్రౌన్ కాలేజి బంగళా, తోట కృష్ణారెడ్డి జాబులు | 18 | |
| | కృష్ణారెడ్డి అన్న జాబు | 1 | |
| | ములుపాక బుచ్చయ్యశాస్త్రి జాబు | 1 | |
| | పైడిపాటి వేంకట నర్సయ జాబు | 1 | |
| | ధర్మపురం సుబ్బన్న జాబులు | 3 | |
| | బ్రౌను జాబు | 1 | |
| | కంభం నరసింగాచారి జాబులు | 3 | |
| | ,, కొడుకు జాబు | 1 | |
| | వల్లా సుబ్బన్న | 1 | |
| | గరిమెళ్ల వెంకయ్య జాబు | 1 | |
| | అవధానం అప్పయ | 2 | |
| | | ——— | 33 |
| | | | 41 |

పై శీర్షికలో మొదటి 3 శీర్షికలు చరిత్రకు సంబంధించినవి. నాల్గవది బ్రౌను కాలేజీ సాహిత్యమునకు సంబంధించినది. అది బ్రౌను కవిపండితులు, వ్యాఖ్యాతలు పనిచేయు కార్యాలయము వారిలో 5గురు వ్రాసిన జాబు లున్నవి. ఈ నాల్గవ శీర్షికలో హెచ్చు జాబులు—23 జాబులు—అయోధ్యాపురం కృష్ణారెడ్డివి. ఇతడు బ్రౌను కాలేజీకి వ్యవహర్త, బ్రౌనుకు స్నేహితుడు, ఆప్తుడు. ఇవి యన్నియు సాహిత్యమునకు సంబంధించినవే.

పై శీర్షికలలో మొదటిమూడు 1. ఉయ్యాలవాడ నరసింహారెడ్డి . 2. గుంటూరు కరువు. 3. మాగ్డనల్డ్ హత్య అనునవి మాత్రమే చరిత్రకు సంబంధించినవి. ఈ రెండు శీర్షికలకు జెందిన జాబులు వింగడింపగా నిట్లున్నవి: ఈ విభజన గ్రంథకర్త చేసినదే.

| | |
|---|---|
| చరిత్రకు సంబంధించిన జాబులు | 8 |
| సాహిత్యమునకు సంబంధించిన జాబులు | 33 |
| | ——— |
| | 41 |

ఇట్లీ గ్రంథ సంకలనమున — 33 జాబులు సాహిత్య ప్రధానములు, 8 మాత్రమే చారిత్రక ప్రధానములు.

ఇది చారిత్రక ప్రాధాన్యతగలదియని తెలుపుటకు పై మూడు చారిత్రక విషయములను గూర్చి యిట్లు వివరణము వ్రాసినాడు:

1 బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు. కడప జాబుల సంకలనం — పుటలు 208. వెల 10—00. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రచురణము. తిరుపతి.

| | | |
|---|---|---|
| నరసింహారెడ్డి | 20 | పుటలు |
| గుంటూరు కరవు | 23 | పుటలు |
| మాగ్డనల్డ్ హత్య | 13 | పుటలు |
| | 56 | |

ఇందు విషయములు సంగ్రహింపవచ్చును.

## అముద్రిత గ్రంథ సూచి

ఈ జాబులలో ప్రసక్తములై బ్రౌను సేకరించిన సంస్కృతాంధ్ర గ్రంథములకారాదిగా పై శీర్షికలో సమకూర్చబడినవి. ఇవి 38 గ్రంథములు. వీనికి వివరణ మావశ్యకము. అయిననునట్టి వివరణ యిందు లేదు. కేవలము గ్రంథముల పేర్లు మాత్రమే గలవు. ఇందువలన బ్రౌను సేకరించిన తెలుగు గ్రంథముల విలువను గ్రహించుటకు వాని వివరణము నిచ్చుచున్నాను.

## గ్రంథముననున్న క్రమము

| | |
|---|---|
| అరణ్యపర్వం | బాల సరస్వతీయం |
| అహల్యా సంక్రందన విలాసము | భానుమ ద్విజయం |
| ఆంధ్ర కౌముది | భారతం (సంస్కృతం) |
| ఆంధ్ర భాషా భూషణం | మన్మథ నారద సంవాదం |
| ఆంధ్ర భాషార్ణవం | రత్నావళీ పరిణయం |
| ఆనంద తంత్రం | రసికజన మనోభిరామం |
| కల్యాణరాజు చరిత్ర | రాఘవ పాండవీయం |
| కవి శిరోభూషణం | రాధామాధవ సంవాదం |
| కావ్యాలంకార చూడామణి | లక్షణ దీపిక |
| కులార్ణవం | లొల్ల |
| చంద్రాంగద చరిత్ర | వసుచరిత్ర |
| చారు చంద్రోదయం | విక్రమార్క చరిత్ర |
| చిద్వల్లి | విష్ణు ఆంధ్రం |
| పండితారాధ్య చరిత్ర | వేమన పద్యాలు |
| పల్నాటి వీరచరిత్ర | శివాంధ్రం |
| ప్రబంధరాజీయం | శుక సప్తతి |
| ప్రభులింగ లీల | సులక్షణసారం |
| బసవకాలజ్ఞానం | సూర్యతనయా పరిణయం |
| బసవపురాణం | సౌందర్యలహరి |

## సంస్కృతము-తెలుగు విభజన

పై పట్టికలో సంస్కృత గ్రంథములు, తెలుగు గ్రంథములు వేఱు వేఱుగా చూపినచో బాగుండెడిది. 'భారతం సంస్కృతం' అని ఒక్కటే సంస్కృత గ్రంథముగా చూపబడినది. ఇందువలన తక్కినవన్నియు తెలుగు గ్రంథములనే భావనయే కలుగును. పై పట్టికలోనున్న గ్రంథములలో—

ఆంధ్రకౌముది, ఆనందతంత్రము, కవిశిరోభూషణము, కులార్ణవము, చిద్వల్లి, లొల్ల, సౌందర్యలహరి, అనునవి సంస్కృత గ్రంథములు.

గ్రంథకర్త పై వానిలో కొన్ని సంస్కృత గ్రంథములని గుర్తింపకపోలేదు—చూడుడు.

"ఇక యీ జాబుల్లో ప్రస్తావనకు వచ్చిన ఆనందతంత్రం; సౌందర్యలహరి, లొల్ల, చిద్వల్లి, కులార్ణవం వగైరా సంస్కృత గ్రంథాల విషయం గురించి చెప్పుకోవల్సింది చాలానే వున్నా" అని వివరము లీయబడినది (పుట 86–87)

సౌందర్య లహరి, లొల్ల, చిద్వల్లి మూడును మూడు ప్రత్యేక గ్రంథములుగా పేర్కొనబడినవి. పై పట్టిక యందును ప్రత్యేకము గానే యున్నవి. కాని, లొల్ల, చిద్వల్లి అనునవి రెండును సౌందర్య లహరికి వ్యాఖ్యానములు. చూడుడు: ఈ గ్రంథముననే కడప జాబులు, పుట 32. "సౌందర్యలహరి వ్యాఖానం లొల్ల, చిద్వల్లి" యీ రెండున్నూ యీ దేశంలో వ్రాయించేది అని ఆజ్ఞ అయి వుండెను". వ్యాఖ్యానములలోనే మూలము కూడ విధిగా నుండును గాన అకారాది సూచికలో నిట్లుండవలెను:

| | |
|---|---|
| సౌందర్యలహరి— | సౌందర్యలహరి ప్రత్యేక |
| వ్యాఖ్యానం—చిద్వల్లి | గ్రంథముకాదు |
| వ్యాఖ్యానం—లొల్ల | |

"చిద్వల్లి" అని నామముండరాదు అది "చిద్వల్లి". సంస్కృతమున "వల్ల" శబ్దమే కాని, "ల్లి" అనిలేదు. పుట 87 ఆనందతంత్రం. "ఇందులో ప్రథమాశ్వాసం చివర్న యిట్లు వ్రాసున్నది" కాని సంస్కృతమున "ఆనందతంత్ర గ్రంథే ప్రథమా ధ్యాయస్యటీకా"అని అధ్యాయమనియే యున్నది.

ఇక యీ సంస్కృత గ్రంథముల వివరణ కూడ ఆవశ్యకమే. పై సంస్కృత గ్రంథములలో—"ఆంధ్రకౌముది, కవిశిరో భూషణము" అనునవిరెండును తెలుగుభాషకుసంబంధించినవి. భాష సంస్కృతమైనను, అవి తెలుగు వ్యాకరణమునకు సంబంధించినవి. ఈ రెండింటిలో ఆంధ్రకౌముది ముద్రితముకాలేదు. కవి శిరో. భూషణము (దీనికే అహోబల పండితీయము అని నామాంతరము) ముద్రితమై వ్యాప్తిలో నున్నది.

## తెలుగు గ్రంథములు

బ్రౌను గ్రంథసేకరణలో తెలుగు గ్రంథములు ప్రధానములు కాబట్టి వాని వివరణ ఎంతగానో అవశ్యకము. ఏలననగా కొన్ని తెలుగు గ్రంథముల కానాడు వ్యవహారములోనున్న నామము లీయ

బడి యున్నవి. ఈ జాబులలో నట్లున్నవి గాన మార్పులేకుండ అకారాది క్రమమున గ్రంథసూచికలో చూపబడినవి.

| పద సూచితో నిచ్చినది | నేటిపేరు |
|---|---|
| ప్రబంధ రాజీయం | ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసము |
| విష్ణు ఆంధ్రం | వేంకటేశ నిఘంటువు |
| శివాంధ్రం | సాంబ నిఘంటువు |

పై మూడును ముద్రితములైనవే.

## ముద్రితాముద్రితములు

''అముద్రిత గ్రంథసూచి' అని శీర్షికయున్నను, నిందన్నియు నముద్రితములుగావు. కొన్ని బ్రౌను కాలమునాడు ముద్రితము లైనవి. కొన్ని నేటికిని ముద్రితము కాలేదు. ఈ క్రింది వివరణ వలన బ్రౌను ఆయా గ్రంథములను సేకరించుటయేగాక వాని విలువ యే రీతిగా గ్రహించినాడో తేటపడగలదు.

### అరణ్య పర్వం

ఇది బ్రౌను నాటికి రెండుముద్రణములందినది. 1. పువ్వాడ వేంకటరావు క్రీ. శ 1851లో ప్రకటించినది–2) నిళందురు సోమసుందరం పిళ్లై ప్రకటించినది క్రీ. శ 1853.

### అహల్యా సంక్రందన విలాసము

వేమనారాధ్యుల సంగమేశ్వర రచితమైన పై కృతి అముద్రితము

### ఆంధ్ర కౌముది

అముద్రితము.

### ఆంధ్ర భాషా భూషణము

ఇది కేతన రచితము. తెలుగుభాషలో మొదటి వ్యాకరణము. ముద్రితము.

### ఆంధ్ర భాషార్ణవము

నుదురుపాటి వేంకనార్యకృతము. ఇది పద్యమయ నిఘంటువు. తెలుగున పద్యనిఘంటువులలో కెల్ల పెద్దది. బ్రౌను దీనికి అకారాది అనుక్రమణిక వ్రాయించినాడు. నేడీ గ్రంథముద్రణములో బ్రౌను అనుక్రమణిక వేయనేలేదు. మూలము మాత్రమే ముద్రితమైనది.

### కావ్యాలంకార చూడామణి

విన్నకోట పెద్దనకర్త. ఇది ముద్రితము. ఇది లక్షణ గ్రంథము

### చంద్రాంగద చరిత్ర

పైడిమర్రి వేంకటపతి కృతి. పద్య కావ్యము. నెల్లూరిలో అముద్రిత గ్రంథ చింతామణి అధిపతులు దీనిని ముద్రించిరి. క్రీ. శ. 1895. ఆనాటినుండి నేటివఱకు దీనికి పునర్ముద్రణమే లేదు.

### చారు చంద్రోదయము

కర్త: చెన్నమరాజు చెన్నమరాజు. పద్యకావ్యము అముద్రితము.

### పండితారాధ్య చరిత్ర

పాల్కురికి సోమనాథునిది — ముద్రితము.

### పలనాటి వీర చరిత్ర

ముద్రితము.

### ప్రభులింగలీల

కర్త: పిడుపర్తి సోమనాథుడు. ఇది ద్విపద కావ్యము. ముద్రితము.

### బసవ పురాణము

పాల్కురికి సోమనాథుడు. ముద్రితము.

### బాల సరస్వతీయము

ఇది సంస్కృతమున ఆంధ్ర శబ్ద చింతామణికి తెలుగువచన వ్యాఖ్య. బ్రౌను కాలమున క్రీ. శ. 1848లో ముద్రితము.

### భానుమద్విజయము

వెలగపూడి కృష్ణయామాత్యుడు. నేటికి అముద్రితము.

### రత్నావళీ పరిణయము

ధూర్జటి వేంకట రాయకవి. నేటికిని అముద్రితము.

### రసికజన మనోభిరామము

కూచిమంచి తిమ్మకవి. ముద్రితము.

### రాఘవ పాండవీయము

పింగళి సూరన. 1857 తొలి ముద్రణ

### రాధా మాధవ సంవాదము

వెలిదండ్ల వెంకటపతి. ముద్రితము.

### లక్షణ దీపిక

కర్త: గౌరన. ఇది ఛందోలక్షణ గ్రంథము. అముద్రితము.

### విక్రమార్క చరిత్ర

జక్కన. కృతి — ముద్రితము.

### శుక సప్తతి

పాలవేకరి కదిరీపతి. ముద్రితము — పద్య కావ్యము.

### సులక్షణ సారము

కర్త: లింగమకుంట తిమ్మన. ఛందో లక్షణ గ్రంథము. ముద్రితము.

### సూర్యతనయా పరిణయము

కర్త: తక్కెళ్లపాటి లింగన. పద్య కృతి. నేటికిని అముద్రితము.

## తెలుగు గ్రంథములు

పై తెలుగు గ్రంథములలో "కడపలో బ్రౌన్ సాహిత్య కార్ఖానా బంగాళా తోట" అనే శీర్షికలో ఐయిదింటికి మాత్రమే వివరణమున్నది. అవి 1. మహాభారతము, 2 అహల్యా సంక్రందనము, 3. భానుమద్విజయము, 4. చంద్రాంగద చరిత్ర 5. వసుచరిత్ర– ప్రతిపదార్థటీక. ఈ జాబులలో ప్రసక్తము కాకపోయినను దశావతార చరిత్ర వివరము తీయబడినవి. ఇది 1849లో బ్రౌను కాలములోనే ముద్రితమైనది.

### వసుచరిత్ర - ప్రతిపదార్థటీక

ఈ టీకాకర్త ములుపాక బుచ్చయ్యశాస్త్రి. ఈతడే వ్యాఖ్యను బ్రౌనున కంకితమిచ్చుచూ కృత్యాదిని పద్యములు వ్రాసినాడు. ఆ పద్యములు 15. వానిలో అయిదు పద్యము లందీయబడినవి. బుచ్చయ్యశాస్త్రి బ్రౌనునకు దీనిని గూర్చి వ్రాసిన లేఖ కూడా ఈ గ్రంథములో నున్నది. (జాబు 28). ఈ బుచ్చయ్యశాస్త్రి జాబు వేఱే గ్రంథమున ప్రకటితమైనను అది యింతకుముందు ఇరువది మూడేండ్ల క్రిందట క్రీ. శ. 1954లో నా "ఆంధ్రదేశపు వాఙ్మయమున' నీయబడినది. ఆ గ్రంథము 1977లో పునర్ముద్రితమైనది (చూడుడు: పుటలు 142–143)[1]

బ్రౌనును గూర్చిన పద్యములు ప్రస్తుత గ్రంథమున నైదు మాత్రమే యీయబడినవి. ఈ పద్యములేగాక, ప్రతి ఆశ్వాసాంతమునను నొక గద్యకూడ వ్రాసియున్నాడు. దానినీ క్రిందనిచ్చుచున్నాను

"ఇది శ్రీ మన్నవ ఖండమండిత ధరామండలాఖండల కుంపిణీ సార్వభౌమ సమర్పిత సామ్రాజ్య రాజాధిరాజ పూజ్య ఇంగిలీషు వంశ పయః పారావార రాకాసుధాకర, వినయాది గుణరత్నాకర, దేవిడ్డు వసుంధరా-రమణ హృదయ కమల దివాకర, సకల భాషా విశేషాభిభాషణ విద్యా వినయ వితరణా భరణ పోషణ సకల కళానాధ ఛార్లెసు ఫిలిపు బ్రౌను విపులాధినాధ కరుణా కటాక్ష లబ్ధసమస్త విభవాతిశయ విద్వజ్జన విధేయ ములుపాకబుచ్చయ నామధేయ ప్రణీతంబైన వసుచరిత్ర ప్రతిపదార్థ ప్రకాశిక అను టీకయందు ప్రథమాశ్వాసము"

బుచ్చయశాస్త్రి బ్రౌను తండ్రిపేరుదాహరించుట విశేషము. అతడు డేవిడు బ్రౌను. ఈతనిని గూర్చి వివరములు నిన్న మొన్నటి వరకు తెలుగువారికి తెలియవు. మొదటిసారిగా నీతని జీవిత విశేషములను ఆంధ్రపత్రిక (10–11–1977) ఆదివారము అనుబంధములో ప్రకటించిరి. డేవిడు బ్రౌను ఛాయాచిత్రము గలదు. మఱియు బ్రౌను లండను నగరమున నివసించిన భవనము యొక్క ఛాయా చిత్రముకూడ నున్నది.

### "వేటూరి చోరుడు"

వేటూరి ప్రభాకరశాస్త్రి చేసిన తప్పుమూలంగా చాటువుగ ప్రచారంలోఉన్న 'నూర్లార్లు లెక్కచేయుక' అనే పద్యం బుచ్చయశాస్త్రి పీఠికా పద్యాలలోనిది. పుట 76, 77.

### చాటుధార పద్యాలు

"గీ. ఒంటిమిట్టను కాపురంబున్నయట్టి
సద్దిసానికి............

ఉ. రెడ్లమటంచు క్రొవ్వున చరించి వరాలు గడించి యూరకే
బుడ్లకొలందినించి కడు పుల్కడు బెంచి వివేకశూన్యులై
యెడ్లవలె జరించు గుణహీనుల కెక్కడి కీర్తులో డివి
ద్విడ్లయ కాలగోళ్ల చినతిమ్మ లనాథభవ తాలభూవరా.

## అ థో జ్ఞా పి క

1. ఈ రెండు చాటువులు బ్రౌన్ ప్రత్యేకంగా వ్రాయించి పెట్టిన ''చాటుధార పద్యములు'' అనే సంపుటం (డి 2884)లో కూడా వున్నాయి. ఈ సంపుటంలోనుంచే బ్రౌన్ పేరైనా చెప్ప కుండా వేటూరి చోరుడు కాపీకొట్టి తనచాటుపద్యమణి మంజరిలో ప్రకటించుకొన్నాడు. ఈ దగామూలంగా చాటుపద్యాలనగానే మనలో చాలామందికి నేడు వేటూరి గుర్తుకొస్తున్నట్టుగా బ్రౌన్ గుర్తు రావడంలేదు. ఇక్కడ 'Head farmer of Cuddapah' అని బ్రౌన్ వ్రాసుంటే వేటూరి దాన్ని బహువచనం చేసేసి రెడ్ల కందరికీ అంట గట్టారు. (చూ. వేటూరి చాటు పద్యమణి మంజరి, మద్రాసు 1961, పరిముద్రణ. పేజీ 174.) (పుట90).

ఈ సందర్భమున వేటూరివారి పాండిత్యమును గూడ శంకించి, ''వేటూరి దాన్ని బహువచనం చేసేసి కడప రెడ్లకందరికీ అంటగట్టాడు'' అన్నాడు గ్రంథకర్త. ఇచట 'వేటూరి బహువచనం చేయుటేమి? పద్యమే ''రెడ్లమటంచు'' అని బహువచన ప్రాసతో ప్రారంభము. తరువాతి రెండు పాదములలోను, ''బుడ్లు, ఎడ్లు'' అని బహువచనములే యున్నవి. రెడ్డి అని ఏకవచనమున్న పద్య ప్రారంభమే వేఱుగానుండును. ప్రాస వేఱగును.

## లే ఖా ప్ర క్రి య

అనుశీలనలో ''లేఖాప్రక్రియ'' అను శీర్షిక క్రింద యిట్లు గలదు:

''తెలుగులో లేఖా ప్రక్రియ పుట్టుపూర్వోత్తరాలు, స్వరూప సంప్రదాయాలు పరిశోధనార్హాలైన విషయాలు.''

తెలుగులో లేఖా ప్రక్రియను గూర్చి పరిశోధన యిప్పటి కిరువది నాల్గేండ్ల క్రిందటనే ప్రారంభమైనది. క్రీ.శ. 1954లో నా 'ఆంధ్రవచన వాఙ్మయమున', నేను దీని నొక ప్రత్యేకప్రక్రియగా నిరూపించి ఉదాహరణముల నిచ్చియున్నాను. ఈ గ్రంథము క్రిందటి యేడు విశేషాంశములతో పునర్ముద్రణము నందినది. అందలి విష యము లీనాటి వారికి పరిచితములు గకపోవుటచేత వానినుండి కొన్నింటిని తెలుపుచున్నాను.

1) సంస్కృత సాహిత్యమున లేఖారచన బహు ప్రాచీన కాలమునుండి యున్నట్లు 'కాళిదాసు కుమార సంభవము'నుండి తెలియుచున్నది.

''న్యస్తాక్షరా ధాతురసేన యత్ర
భూర్జత్వచః కుంజర బిందుశోణాః
వ్రజంతి విద్యాధరసుందరీణా''

మానంగ లేఖక్రియయోపయోగమే''. అనంగ లేఖలనగా ప్రేమలేఖలు. [1-7]

2) తెలుగున క్రీ. శ 1480 ప్రాంతమున నందిమల్లయ, ఘంటసింగయ కవులు తమ ప్రబోధ చంద్రోదయమున నొక లేఖను సీసపద్యములో వ్రాసియున్నారు.

సీ॥ శ్రీమతు వారాణసీ మహాపట్టణ
స్వామి రాజాధిరాజ పరమేశ్వ
రుః మహామాహేశ్వరుని దివ్యపాద ప
ద్మంబునకును మానమదులు సద్వి
నయ భక్తి దండ ప్రణామంబు భక్తిగా
వించి చేయంగల విన్నపంబు
తన తల్లి శ్రద్ధయు తాను శాంతి వివేక
భర్తకు నుపనిషద్భామినికిని

సీ॥ నడుపుచున్నది దైత్యంబు విడువ కెపుడు
కామసఖుడైన ధర్ముండు గలయమాట
లాడె వైరాగ్య ముఖ్యులోడనిది ని
బద్ధి తప్పదు దేవర పాదమాన (2 53)

3) ఆధునిక యుగమున లేఖావాఙ్మయమునకు మూల పురుషుడు బ్రౌను.

4) పండితులు, కవులు వ్రాసిన లేఖలను మొదట ప్రక టించిన కీర్తి ''అముద్రిత గ్రంథచింతామణి'' పత్రికది. ఇది 1885-1904 మధ్య ప్రచారమున నున్నది. ఈ లేఖలన్నియు సలక్షణమైన వచన రచనలోనున్నవి. పద్యలేఖలు నీ పత్రికలో గలవు. అవి పునర్ముద్రితమైన యెడల లేఖావాఙ్మయ పరిశోధనకు దోహదకారి కాగలవు.

శ్రీ అన్నపరెడ్డి కృష్ణారెడ్డి

# మన ఆర్థిక వ్యవస్థ-పబ్లిక్ రంగం

స్వాతంత్ర్యం వచ్చినప్పుడు దారిద్ర్యం, అజ్ఞానం, అనారోగ్యం, ఆర్థిక అసమానతలు మొదలగు సమస్యలను దేశం ఎదుర్కొ వలసి వచ్చింది. ఆర్థికాభివృద్ధి చురుకుగా సాగాలంటే దేశంలో పారిశ్రామికాభివృద్ధి అవసరం. 1947కు పూర్వం మన ఆర్థిక వ్యవస్థ ''వలస ఆర్థిక వ్యవస్థ''గా కొనసాగింది. అంచేత మన దేశంలో పరిశ్రమలు అభివృద్ధి చెందలేదు. 20వ శతాబ్దం తొలి రోజులలోనే భారత రాజకీయవేత్తలు, ఆర్థిక శాస్త్రవేత్తలు దేశ ఆర్థిక దుస్థితి పట్ల ఆందోళన వ్యక్తపరచారు. దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యలు, పారిశ్రామికాభివృద్ధితో తొలగగలవని వారు భావించారు. తరువాత కొద్ది రోజులకే స్వదేశీ ఉద్యమాన్ని ప్రారంభించారు. అవసర వస్తువుల ఉత్పత్తిలో దేశం స్వయంసమృద్ధి సాధించడమే ఉద్యమ లక్ష్యం. తరువాత కొద్ది రోజులకు గాంధీజి సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించి, స్వదేశ వస్తువులను వాడడమేగాక, విదేశ వస్తువులను నిరాకరించవలసినదిగా ప్రజలను కోరెను. ఈ ఉద్యమ ఫలితంగా బొంబాయిలో నూలు పరిశ్రమ కొంతవరకు అభివృద్ధి చెందినది. స్వాతంత్ర్యం పొందిన తరువాత భారత ప్రభుత్వం ప్రణాళికలద్వారా ఆర్థికాభివృద్ధిని సాధించడానికి ప్రయత్నిస్తున్నది.

## అభివృద్ధి-స్వేచ్ఛావ్యాపారం :

స్వేచ్ఛావ్యాపార సిద్ధాంతం ఆధారంగా మన దేశంలాంటి పేద దేశంలో ఆర్థికాభివృద్ధి జరిగినట్లయితే సాంఘిక న్యాయం చకూరదు. దేశంలో జాతీయ ఆదాయం కొద్దిమంది చేతులలో కేంద్రీకృతమయ్యే ధోరణులు పెరుగుతాయి. అంచేత భారత ప్రభుత్వం మన ఆర్థికవ్యవస్థను మిశ్రమ ఆర్థిక వ్యవస్థగా రూపొందించింది. మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో పబ్లిక్‌రంగం, ప్రయివేటు రంగం కలసిమెలసి దేశాభివృద్ధికి పాటుపడతాయి. ప్రస్తుతం దేశంలో పంచవర్ష ప్రణాళికలద్వారా పారిశ్రామికాభివృద్ధి జరుగుతున్నది.

## పారిశ్రామిక రంగంలో ప్రభుత్వ జోక్యం :

దేశంలో పారిశ్రామికాభివృద్ధి శీఘ్రగతిని జరగాలంటే అవస్థాపనా సౌకర్యాలు కల్పించడం అవసరం. పరిశ్రమలకు అవసరమయ్యే యంత్ర సామగ్రి, ఉత్పత్తి విషయంలో స్వయం సమృద్ధిని పొందాలంటే భారీ మౌలిక పరిశ్రమల స్థాపన అవసరం. అయితే యివి మూలధన సాంద్రత కలిగిన పరిశ్రమలు. అందువలన ప్రయివేటు రంగంలోని పారిశ్రామికవేత్తలు వీటి స్థాపనకు విముఖతను చూపుతారు. అలాగే ప్రజోపయోగ పరిశ్రమలను, అవస్థాపనా పరిశ్రమలను కూడా ప్రయివేటు వ్యక్తుల నెలకొల్పరు. దీనికి రెండు ముఖ్యకారణాలు కన్పిస్తున్నాయి—1. ప్రయివేటు వ్యక్తులు ఎక్కువ మూలధనాన్ని సమకూర్చలేకపోవడం; 2. భారీ మౌలిక పరిశ్రమల స్థాపనలో నిర్మాణకాలం అధికంగా వుండడం. అంచేత 1948 పారిశ్రామిక విధానంలో ప్రభుత్వం కొన్ని పరిశ్రమలను చేపట్టు తున్నట్లు ప్రకటించింది. వాటిలో ఆయుధాలనూ, ఆయుధ సామగ్రిని తయారుచేసే పరిశ్రమలూ, రైళ్ళూ, అణుశక్తి ఉత్పత్తి ముఖ్యమైనవి. 1954లో భారత పార్లమెంట్ సోషలిస్టు తరహా సమాజాన్ని స్థాపించడమే జాతీయ లక్ష్యంగా తీర్మానించింది.

1956లో పూర్వపు పారిశ్రామిక విధానాన్ని సంస్కరిస్తూ క్రొత్త తీర్మానం అమలులోకి వచ్చింది. క్రొత్త తీర్మానం ప్రకారం పరిశ్రమల మూడురకాలుగా విభజింపబడ్డాయి. మొదటి జాబితా ప్రకారం ఆయుధాలు, ఆయుధ సామగ్రి, రక్షణ పరికరాలు, అణుశక్తి, ఉక్కు, భారీ క్యాస్టింగ్, ఫోర్జింగ్, భారీ విద్యుత్ కర్మాగారాలు, నేలబొగ్గు, ఖనిజపు నూనెలు, ముఖ్యమైన లోహాలు, వాయురవాణా పరికరాలు, నౌకానిర్మాణం, రైల్వేరవాణా, టెలిఫోన్, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, సరఫరా మొ॥ పరిశ్రమలు ప్రభుత్వ యాజమాన్యంక్రింద స్థాపించబడతాయి-వాటిని అభివృద్ధిపరచే బాధ్యత కూడా ప్రభుత్వానిదే.

అల్యూమినియం, యంత్రపరికరాలు, మందులు, రసాయనిక ఎరువులు, సింథటిక్ రబ్బరు, రోడ్డు నౌకారవాణా మొదలగునవి రెండవ జాబితాలో చేర్చబడ్డాయి. వీటిని ప్రభుత్వం క్రమక్రమంగా జాతీయంచేసి అభివృద్ధి పరుస్తున్నది.

మిగిలిన పరిశ్రమలు మూడవ జాబితాలో చేర్చబడ్డాయి. ఈ పరిశ్రమలు ప్రయివేటు రంగానికి వదలివేయబడ్డాయి. అయితే ప్రయివేటురంగంలో పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలు పారిశ్రామిక రాజ్యాలుగా మారి, కొందరి చేతులలో ఆర్థికశక్తి కేంద్రీకృతమయ్యే అవకాశాలు వున్నాయి.కాబట్టి అవసర వస్తువుల ఉత్పత్తిని ఎక్కువ భాగం (సహకార రంగంలో) సహకార పారిశ్రామిక సంస్థలద్వారా జరపడానికి ప్రభుత్వం కృషి సల్పుతున్నది.

## పబ్లిక్‌రంగం సాధించిన ప్రగతి:

పబ్లిక్ రంగంలోని సంస్థలు గణనీయమైన అభివృద్ధిని సాధించాయనడంలో సందేహంలేదు.

## పెట్టుబడి :

మొదటి పంచవర్ష ప్రణాళికారంభంలో పబ్లిక్ రంగంలోని పెట్టుబడి (5 సంస్థలలో) 29 కోట్ల రూపాయలు కాగా మూడవ ప్రణాళికాంతానికి 2415 కోట్ల రూపాయలకు పెరిగింది 1971–72లో (101 సంస్థలలో) పెట్టుబడి మొత్తం 5,052 కోట్ల రూపాయలుండగా, 1972–73లో (113 సంస్థలు) 5,571 కోట్ల రూపాయలకు, 1973–74లో (122 సంస్థలలో) 6,237 కోట్ల రూపాయలకు, 1974–75లో (129 సంస్థలలో) 7261 కోట్ల రూపాయలకు పెరిగింది. అంటే మూలధనంలో సాంవత్సరికవృద్ధి 1971–72లో 8 శాతం, 1972–73లో 10 శాతం, 1973–74లో 12 శాతముగా వున్నది.

పెట్టుబడిలో పబ్లిక్ రంగానికీ–ప్రయివేటు రంగానికీ మధ్య నున్న దామాషా క్రిందివిధంగా వున్నది: మొదటి ప్రణాళికలో 46 : 54, ద్వితీయ ప్రణాళికలో 56 : 44, తృతీయ, చతుర్థ ప్రణాళికలలో 60 : 40, ఐదవ ప్రణాళికలో 66.34గా వుంటున్నది. పైన వివరించిన అంకెలనుబట్టి 1966 తరువాత పబ్లిక్ రంగంలో ప్రశంసనీయమైన అభివృద్ధి కానవస్తున్నది. అంచేత 1966 జనవరినుండి పబ్లిక్ రంగంలో "పురోభివృద్ధి దశకం" ప్రారంభమయినదనవచ్చును.

## ఆర్జించిన లాభాలు :

పబ్లిక్ రంగంలోని సంస్థలు 1970–71 లో 3 కోట్ల రూపాయలూ, 1971–72 లో 19కోట్ల రూపాయలూ నష్టం పొందినప్పటికీ 1972 – 73 సంవత్సరంలో లాభాలు స్థాయిని అందుకొన్నాయి. 1972–73లో 17 83 కోట్ల రూపాయలు, 1973–74లో 64. 42 కోట్ల రూపాయల లాభంగా సంపాదించగలిగాయి. 1974 – 75లో ప్రభుత్వ సంస్థలు పన్నులు మినహాయించగా 183.55 కోట్ల రూపాయల లాభాన్ని గడించాయి. ఈ లాభంలో స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ పొందిన సుమారు 134 కోట్ల రూపాయల మొత్తము కలియలేదు. ఈ సంస్థలు ఇంత అధికలాభాలు గడించడానికి కారణాలు:– 1. ధరలు పెరగడం 2. అధికమైన అమ్మకాలు 3. ఉత్పత్తి శక్తిని ఎక్కువగా ఉపయోగించడం.

## అమ్మకాల పెరుగుదల :

పబ్లిక్ రంగంలోని సంస్థలు అమ్మకం చేసిన వస్తువుల విలువలు కూడా బాగా పెరిగినవి. 1972–73లో అమ్మకాలవిలువ 5, 262 కోట్ల రూపాయలు కాగా 1973–74లో 6,777 కోట్ల రూపాయలకు పెరిగింది. అంటే పెరుగుదల శాతం 28. 1974–75లో ఈ విలువ 10,217 కోట్ల రూపాయలవరకు వున్నది.

## ఉద్యోగావకాశాలు :

ప్రభుత్వ రంగంలోని అనేక సంస్థలలో 1960–61 లో 1. 8 లక్షల మంది పనిచేసేవారు. 1971–72లో 7. 01 లక్షల మంది, 1972–73 లో 9. 32 లక్షలమంది, 1973–74 లో 13. 14 లక్షల మంది ఉద్యోగాలను పొందగలిగిరి. 1974–75 చివరకు 14. 08 లక్షల మంది (రైల్వేలు కాక) పని చేస్తున్నట్లు తెలుస్తున్నది. ఈ సంస్థలు 1972–73 లో 541 కోట్ల రూపాయలు (245 కోట్లు బోనసుతో సహా), 1973–74లో 786 కోట్ల రూపాయలు వేతనాలుగా చెల్లించాయి. ప్రయివేటు రంగంలో ఉద్యోగావకాశాలు ఎదుగూ బొదుగూ లేకుండా వుండగా పబ్లిక్ రంగంలో 8 నుండి 9 శాతం వరకు పెరిగాయి.

## ఉత్పత్తి శక్తి వినియోగం :

1972–73 లో 41 శాతం ఉత్పత్తిశక్తిని పబ్లిక్‌రంగంలోని పరిశ్రమలు ఉపయోగించుకొనగా 1973–74లో 54శాతం, 1974–75 లో 75 శాతం వరకు ఉపయోగించుకొన గలిగాయి. 75 శాతం మేరకు శక్తిని ఉపయోగించుకొనే సంస్థలు 1972–73 లో 41 వుండగా 1974–75 లో 54 కు పెరిగాయి.

## ప్రభుత్వానికి ఆదాయం :

ఈ రంగం నుండి ఎక్సైజ్ డ్యూటీలు, ఆదాయపు పన్ను, వడ్డీలు, డివిడెండ్ల రూపంలో 1974–75 లో 1130 కోట్ల రూపాయలు ప్రభుత్వానికి అందినవి. నాల్గవ ప్రణాళిక మొత్తం మీద ఈ విలువ 3120 కోట్ల రూపాయలు వున్నది.

## పొదుపులు:

ఈ సంస్థలు (రైల్వేలు, డిపార్ట్‌మెంటల్‌సంస్థలు, ఆర్థిక సంస్థలు మినహా) చేసిన పొదుపుల విలువ 1961–62లో 363 కోట్ల రూపాయలు కాగా 1972–73 లో 814 కోట్ల రూపాయలకు పెరిగింది. తరువాత రెండుసంవత్సరాలలో 40% పెరుగుదల కనిపించింది.

## విదేశ మారక ద్రవ్యం :

ఎగుమతుల ద్వారా ఈ రంగం విదేశ మారక ద్రవ్యం సంపాదిస్తున్నది. 1972–73 లో 520 కోట్ల రూపాయలు, 1973–74 లో 675 కోట్ల రూపాయలు, 1974–75 లో 1091 కోట్ల రూపాయల చొప్పున విదేశ మారక ద్రవ్యం లభించింది.

కొంతకాలం వరకు పబ్లిక్ రంగంలోని పరిశ్రమల నిర్వహణ సంతృప్తికరంగా లేదనే విమర్శ వుండేది. దానికి ముఖ్యకారణాలు :

1. పబ్లిక్ రంగంలో స్థాపింపబడే భారీమౌలిక పరిశ్రమలు మూల ధన సాంద్రత ఎక్కువగా కల్గియున్నవి. వీటి స్థాపనకు ఎక్కువ కాలం పట్టుతున్నది. అంటే ఫలనా కాలం ఎక్కువగా వు టున్నది. వెంటనే రాబడి వుండదు. కాబట్టి పరిశ్రమలు భరించవలసిన నిర్వాహక వ్యయాలు హెచ్చు గా వుంటాయి.

2. పబ్లిక్ రంగంలో పనిచేసే సంస్థలకు సామాజికబాధ్యత ఎక్కువగా వుంటుంది. ధరల విధానం రూపొందించడంలో, వస్తు నాణ్యతను పెంచడంలో సంస్థలు సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని నిర్ణయాలు తీసుకోవాలి. ప్రయివేటురంగంలోని సంస్థలు లాభార్జన దృష్టితో పని చేస్తాయి. పబ్లిక్ రంగంలో వినియోగదారులను దోచుకొనుటకు తావుండదు.

3. కొంతకాలం వరకు పబ్లిక్ సంస్థలలో నిర్వహణా సామర్థ్యంగల సిబ్బంది కొఱతగా వుండేది. అందుచేత వ్యాపారాభివృద్ధి కుంటుపడింది.

ఈ మధ్యకాలంలో అర్హత, అనుభవం కలిగిన వ్యక్తులను బాధ్యతగల నిర్వాహక పదవులలో నియమించడం జరిగింది. పరిపాలనా సంస్కరణలకు పీలుపడింది. ఇప్పుడు పబ్లిక్ రంగ నిర్వహణలో ప్రావీణ్యాలుగల వ్యక్తులు 5000 మంది వున్నారు. ఐదవ ప్రణాళి కాలానికి వీరి సంఖ్య 7000కు చేరగలదు.

అంతర్జాతీయ మార్కెట్‌లోవున్న పోటీకి తట్టుకోవాలంటే మన వస్తువుల నాణ్యతను పెంచే పరిశోధనలు జరగవలసిన అవసరం ఎంతయినా వున్నది. ఇప్పటి కంటె ఎక్కువగా దిగుమతి చేసుకుంటున్న వస్తువులకు ప్రత్యామ్నాయంగా పబ్లిక్ రంగంలో ఉత్పత్తి పెరగాలి. అప్పుడే దిగుమతులను తగ్గించుకోగలము. పారిశ్రామిక రంగంలో స్వయం సమృద్ధిని సాధించగలము.

పబ్లిక్ రంగ విస్తరణ దేశంలో ప్రాంతీయ సమానాభివృద్ధి జరగడానికి తోడ్పడుతున్నది. వీలైనంతవరకు కొత్త పారిశ్రామిక సంస్థలు వెనుకబడిన ప్రాంతాలలో స్థాపించబడుతున్నాయి. 1966—75 సం॥ల మధ్య 2400 కోట్లరూపాయల పెట్టుబడి వెనుకబడిన ప్రాంతాలలోనే వినియోగించడం జరిగింది. దేశంలో ఆర్థిక శక్తి కేంద్రీకరణ ధోరణులు బాగా తగ్గుతున్నాయి. పబ్లిక్ రంగంలోని సంస్థలు ఇక మీదట కూడా విశ్వాసంతో పని చేసినట్లయితే ఆర్థిక ప్రయోజనాలు యింతకన్న మిన్నగా పెరుగగలవు. పబ్లిక్ రంగం మరింతగా అభివృద్ధి పొందినప్పుడు సోషలిస్టు సమాజం రూపొందగలదు.

---

# వెల్తురు స్వప్నం

## 'రాగమాలిక రఘురూప'

నాలో ...
అస్పష్ట స్పృహలో ...
క్రమంలేని జ్ఞాపక స్పర్శలు —
ఊహల మత్తుపొరల్లో ...
ఆవిరైపోతూ హఠాత్తుగా ఆగిపోయిన ఆలోచనలు—

మస్తిష్కపు తలుపులు బార్లా తెరచి...
'అద్భుత సత్యస్వరూప దర్శనం'
— 'వస్తు ప్రపంచ స్పర్శ' తెగి ...

నా లోకి ...
... నే వెళ్ళి ...
దర్శించిన వెల్తురు స్వప్నం —
— ఊపిరి బంధించిన చైతన్యం
కొన్ని పురాతన ఉషస్సులు

మౌనంగా దాటి ...
చేరిన తీరంలో
దొరికిన ...
— మంత్రశబ్ద తరంగం
నిశ్చల ప్రభాత కిరణం

శ్రీ కె. ఏ. రాఘవాచార్య

# కవి సమయములు - క్రొత్త ప్రయోగములు

ప్రతిభ గాఢముగా గల కవి ప్రకృతి ధర్మమును అవగాహనము చేసికొని దానినొక రమణీయార్థమును సూచించుటకయి ప్రయోగించుట కవి సమయము. అది ప్రకృతి సహజముగను లేక ప్రకృతి విరుద్ధముగను ఉండవచ్చు. కాని అది సౌందర్యద్యోతకముగా ఉండవలెను. దానిని తరువాతి కవులు **పూర్వ**కవి ప్రయోగంగా శిరసా వహించి ప్రయోగిస్తుంటారు. ఇట్లు కవి సమయము రూఢ మగుచున్నది. కావ్యములో చారుత్వ సంపాదనకై కవి సమయమును ప్రయోగిస్తున్నారు కవులు. అది స్వయంగా అలంకారంగాదు. కాని అలంకారానికి జీవగఱ్ఱగా ఉంటున్నది.

కవి సమయమును రాజశేఖరుడు ఇట్లు నిర్వచించాడు:

"అశాస్త్రీయ మలౌకికంచ పరం పరా యాతం యమర్థ
ముపని బధ్నంతి కవయః స కవి సమయః"

— కావ్య మీమాంస, 14 అధ్యా.

"అశాస్త్రీయమును (అనగా శాస్త్రతః విహితము కానిదియును) అలౌకికమును (అనగా **లో**కానుభవమున నేర్పడినది కానిదియును) పరంపరా గతముగ వచ్చునదియు నగు నే యర్థమును కవులు తమ గ్రంథములలో నందఱు నొక్క రీతిగా గూర్తురో. అదియే కవి సమయము అని అనబడును."

— పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారి అనువాదము.
'రాజశేఖర కవి కావ్య మీమాంస', 273 పుట.

రాజశేఖరుని దృష్టిలో కవిసమయము అశాస్త్రీయమైనది, అలౌకికమైనది, పరంపరగా కవులు ప్రయోగించుచున్నట్టి కావ్యార్థము.

సమయము (convention) యొక్క స్వరూప స్వభావము లను గూర్చి జె. ఎల్. లూయిస్ ఇట్లు వివరించినాడు:

"Convention, so far art is concerned, represents concurrence in certain accepted methods of communication. And the fundamental conventions of every art grow out of the nature of its medium. conventions beger conventions, to be sure, and their ramifications and permutations are endless."

— 'Convention and Revolt in poetry'
By John Livingston Lowes,
Quoted in 'Current Literary Terms' By A. F. Scott.

ఈ నిర్వచనము, వివరణ కవిసమయమునకు (Poetic convention) గూడ సంపూర్తిగ అనువర్తిస్తుంది. లూయిస్ దృష్టిలో కవి సమయము రూఢిమైనది, స్వభావానుగుణమైనది, వికాస విస్తృతులు గల్గినట్టిది. లూయిస్ (కవి) సమయము పరిణామశీలమైనదనుట విశేషము !

కవి సమయమును గూర్చి ఆసక్తిదాయకమైన కథనొక దానిని ధూర్జటి "శ్రీ కాళహస్తి మాహాత్మ్యము"లో వర్ణించినాడు. అదే నత్కీరుని కథ !

ఒక భక్తుని బ్రతుకుదెరువునకై శివుడు రచించి యిచ్చిన పద్యంలోని "సింధుర రాజగమనా ధమ్మిల బంధంబు సహజ గంధంబు" [3-157] అను ప్రయోగమును నత్కీరుడు "తప్పిది చెప్పరాదు, కవితా సమయంబున కొప్పగాదు, నీ విప్పగిదిన్ రచింప దగునే ?" [3-159] అని ప్రశ్నించి. వేనలికి సహజ గంధము చెప్పుట కవి సమయ విరుద్ధమని కనుక అది దుష్ట ప్రయోగమని ఆక్షేపిస్తాడు. శివుడు ప్రత్యక్షమై "గిరితనయా ఘనకచ భారంబు, సహజ గంధంబు" [3-168] అని సాక్ష్యం చెప్పినా, దానిని గ్రహింపక, అవి మానవ స్త్రీల యెడ చెల్లదని కాన గగన ప్రసూన వాదమని కనుక [భూలోక] కవి సమయ విరుద్ధమని సిద్ధాంతం చేసినాడు !

ఈ నక్కీరుని కథ వలన "కవి సమయము ప్రత్యక్షమునకు విరుద్ధముగా నుండగూడదు. స్వభావ సిద్ధముగా, లౌకికముగా నుండవలెను" అనుట సంప్రదాయవాదుల మతమని తెలియుచున్నది. కాని నవ్యతా ప్రీతిగల కవులు తద్విరుద్ధమైన కవి సమయములను ఆదరంతో, పరంపరగా ప్రయోగిస్తున్నారు !

ప్రతిభావంతుడైన కవి ఒక అర్థంలో రూఢమయిన కవి సమయమును మరొక రమణీయార్థమును ప్రతిపాదించుటకు ప్రయోగిస్తాడు. అది నవ్యతగా, విలక్షణ ప్రయోగంగా మన్నింప బడుచున్నది. ఇట్లు కవి సమయం గూడ మార్పుకు లోనవుచున్నది వికాస విస్తృతుల నందుచున్నది !

పద్మ భ్రమరములకు ప్రేయసీప్రియుల సంబంధముచెప్పుట ప్రాచీన కవి సమయం. నవ్యకవి దానినే మాతాపుత్ర సంబంధమును సూచించుటకు స్వీకరించాడు !

శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు తమ సిద్ధాంతగ్రంథమగు 'రమ్యాలోకము' లో—

> తీవెమీద సుతారంపు తీవి నించి
> పగలబడి నవ్వు పువ్వుపై కెగయు లలిని,
> ప్రియుడు ప్రియురాలనట్లు చేర్చె నొక సుకవి
> బిడ్డతల్లని ఛాలి కల్పె మరొకండు!
>
> — రమ్యాలోకం, 8–2. [25 పుట]

> విప్రలంభ సంభోగముల్ విస్తరించి,
> సంగ్రహించిరి శృంగార శాఖలయిన
> స్నేహవత్సలాదులు; నతి స్నిగ్ధ హృదయు
> లగు కవుల కిపుడవి వరేణ్యంబు లయ్యె
>
> — రమ్యాలోకం, 11-11 [37 పుట]

అని నవ్యకవి యొక్క విలక్షణమగు దృష్టిని, స్నిగ్ధ హృదయాన్ని వివరించారు.

డాక్టరు సి. నారాయణరెడ్డిగారు 'ఆధునికాంధ్ర కవిత్వము. సంప్రదాయములు : ప్రయోగములు' అను సిద్ధాంత గ్రంధమును [1967] ప్రకటించారు. ఇందులో ఆధునికాంధ్ర కవిత్వము యొక్క ఆవిర్భావం, విశిష్టత, లక్షణ ప్రయోజనాలను సమగ్రంగా వివరించారు.

'ఇద్దరు యుగకర్తలు' అను ప్రకరణంలో శ్రీ రాయప్రోలు వారి యుగకర్తృత్వాన్ని నిర్ణయిస్తూ — నవ్య కవిత్వంలో వారు సాధించిన ప్రగతిని, విలక్షణతను వెల్లడించారు అందులో ప్రాచీన కవి సమయములను త్రోసిరాజని నూత్న కవి సమయములను భావ కవితా దృష్టితో సృష్టించుట ఒకటి!

శ్రీ నారాయణ రెడ్డి గారు రాయప్రోలు వారి 'స్వప్న కుమారము' ను పరిశీలిస్తూ ''పద్మభ్రమరముల కనాదిగా నున్న ప్రేయసీ ప్రియ సంబంధము తృణీకృతమై మాతృపుత్రసంబంధము [illegible]నది ఇది యొక అపూర్వ ప్రయోగము. కవి [illegible] కాలదోషము పట్టినదని నిరూపించి, సరి కొత్త [illegible]చిన అతినవ్య ప్రయోగము'' పుట [277] అని [illegible]ను ఉదాహరించారు.

> [illegible] చేరిన మిళింద తనయులకును
> [illegible] చీకట్లు పోవకుండ
> [illegible] కొనద పంకజము ప్రియుడ!
> [illegible]ర మేరి కెఱుక! ''
>
> —ఆధునికాంధ్ర కవిత్వం, 278 పుట.

[illegible] పద్మభ్రమరములకు ప్రేయసీ ప్రియ [illegible]రించి, మాతా పుత్ర సంబంధమును చెప్పుట [illegible]వ్య కవి సమయం. భావకవికి ప్రకృతి మాతృమూర్తిగ కనబడిన తీరు ఇందలి రమణీయకము. ఇది నవ్యకవికి స్త్రీపై గల పూజ్య భావానికి ప్రతీక!

మరొక చోట పై విషయమునే శ్రీ నారాయణరెడ్డి గారు ''ఈ విధముగా రాయప్రోలువారు స్త్రీలోని మాతృమూర్తిత్వ మును, దైవతాంశమును దర్శించి, స్వప్నకుమారాది కావ్యముల ద్వారా నిరూపించినారు. చివరికి అనాదిగా నున్న పద్మభ్రమరముల ప్రేయసీ ప్రియ సంబంధము త్రోసివేసి. దానిని వాత్సల్య సూత్రములో ముడివేసిరి.

> సందెలను దారి దప్పు మిళింద సుతుల
> తేనె పాలిచ్చి చీకట్ల దిరుగనీక
> ఉదయమగు దాక యొడిలోన నిదురబుచ్చు
> వేరదీసిన మమతరు దక్కినని.

(Foot note లో) స్వప్నకుమారము ఇది అపూర్వ విషయము. విలాక్షణికులను, కవులును ఈ సంబంధ మూహింపలేరు. అని నిష్కర్షగా సిద్ధాంతం చేసినారు.

—ఆధునికాంధ్ర కవిత్వం, 302 పుట.

శ్రీ నారాయణరెడ్డిగారు 'ఆధునికాంధ్ర కవిత్వము' లోని 278 పుటలోను, 302 పుటలోను ఉదాహరించిన పై రెండు పద్యములు 'స్వప్నకుమారము' లోనివిగానే పేర్కొన్నారు. ఆ రెండు పద్యములు ఒకే భావాన్ని వెల్లడిస్తూ బింబ ప్రతిబింబములవలె నున్నవి పాఠాంతరముగూడ శ్రీ సుబ్బారావుగారే రచించినారా? లేక మరొకరా?

రాయప్రోలు వారే ప్రకటించిన 'స్వప్నకుమారము' (1956)లో ఆ పద్యమిట్లున్నది:

> దప్పిగొని చేరిన మిళింద తనయులకును
> పూల పాలిచ్చి చీకట్లు పోవకుండ
> కడుపులో దాచు కొనెడ పంకజము ప్రియుడ!
> చేర దీసిన మమకార మేరి కెఱుక!
>
> — స్వప్నకుమారము—93 పద్య, 26వ పుట

కావున శ్రీ నారాయణరెడ్డిగారు 'ఆధునికాంధ్ర కవిత్వము' లోని 302వపుటలో 'స్వప్నకుమారము' లోనిదిగ ఉదాహరించిన పద్యము 'మూలము' లోనిదిగాదు! సిద్ధాంత గ్రంథములోగూడ ఇట్టి తభావతులుండుట విచారణీయము!

ఇంతకు పద్మభ్రమరములకు అనాదిగా నున్న ప్రేయసీ ప్రియ సంబంధమును త్రోసివేసి, మాతాపుత్ర సంబంధము కల్పించుట అపూర్వ విషయం గాదు. క్రీ. శ. 16వ శతాబ్దములో నున్న తెనాలి రామకృష్ణుడు 'పాండురంగ మాహాత్మ్యము'లో పుష్పభ్రమరములకు మాతా పుత్ర సంబంధమును ఊహించి నూతన కవి సమయమును ఉపజ్ఞాబలంతో రమ్యంగా ప్రయోగించినాడు!

''దామోదరుడు యశోదా స్తన్యమానెడు
నని మ్రొక్కు విరిగుత్తి నళిభ్రమింప !''

— పాండు, 5–299 పద్యం.

ఇట పూల గుత్తిలో భ్రమరము సంచరించుటను చూచిన కన్యా కుబ్జ రాజకుమార్తె వాత్సల్య స్ఫోరకంగా కృష్ణుడు యశోదాస్త న్యము గ్రోలుచున్నాడని తలంచుట నవ్యత ! అనంతమైన ప్రకృతి యందలి సహజమైన, సదమలమైన మాతృశిశుబంధ మధుర ధర్మమును సంగ్రహించిన రామకృష్ణుని ప్రయోగం మౌలికము; నవ్యాతి నవ్యము !

తెనాలి రామకృష్ణుడు ''ఉద్భటారాధ్య చరిత్ర'లో పార్వతీ పరమేశ్వరుల 'విహార వర్ణన'లో ఆది దంపతులకు, పద్మభ్రమరము లకు సాదృశ్యం చెప్పి ప్రాచీన కవి సంప్రదాయమును పాటించినాడు!

''సురలోక వాహినీ ధర షట్పదమునకు
ప్రాతరుద్బుద్ధ కంజాత మగుచు
.........అద్రినందన వొల్చె విహారవేళ !''

— ఉద్భట, 1–94 పద్యం.

శ్రీ నారాయణ రెడ్డిగారు 'ఆధునికాంధ్ర కవిత్వం' లో తెనాలి రామకృష్ణుని రెండుసార్లు, (23, 184 పుటలు) పాండు రంగ మాహాత్మ్యమును రెండుసార్లు (23,43పుటలు) పేర్కొని యున్నారు. పై అపూర్వ ప్రయోగమును వారు గ్రహించి, ఉదాహ రించక పోవుట రామకృష్ణుని దురదృష్టము !

అందరికి పరిచయమైన ఒక 'వినాయక స్తుతి'లో పార్వతీ వినాయకులకు గల మాతా పుత్ర సంబంధం ఉపమేయంగా, పద్మినీ సూర్యులకు గల సంబంధం ఉపమానంగా చెప్పబడింది! ఆ శ్లోకమిది:

''అగజానన పద్మార్కం గజానన మహర్నిశం
అనేక దం తం భక్తానాం ఏకదంత ముపాస్మహే॥''

ఇందులో కవిపద్మినీసూర్యులకు మాతాపుత్ర సంబంధమును వ్యంగ్యంగా సూచించినాడు. ఇంకను—

''మధు ద్విరేఫః కుసుమైక పాత్రే
పపౌ ప్రియాం స్వామను వర్తమానః''

—కుమార సంభవం, 3–36 శ్లోకం.

అని కవికుల గురువు కాళిదాసు పుష్పభ్రమరములకు గల ప్రేయసీ ప్రియ సంబంధమును పరిహరించి, పుష్పమును ఒక మధుపాత్రగా వర్ణించి, ప్రాచీన కవి సమయములకు దోహదక్రియ నారంభించి నాడు.

ఆదికవి నన్నయభట్టు భ్రమర సమీరణులకు సఖీ సఖి సంబంధము చెప్పి పువ్వుగుత్తులను ఉయ్యెలలుగ వర్ణించినాడు.

''దళిత నవీన కందళ కదంబ కదంబక కేతకీరజో
మిళిత సుగంధ బంధుర సమీరణుడు సఖు డూచు చుండగా
నలియుచు బువ్వుగుత్తులను నుయ్యెల లొప్పగ నెక్కి యూగెను
ల్లల దళినీ కులంబు మృదుల ధ్వని గీతము విస్తరించుచున్.''

—భారతము, అరణ్య 4–138 పద్యం.

వర్షాకాలంలో నేల యరటుల, కడిమిపూల, మొగలిపూల సుగంధ మును శరీరంనిండా పూసికొనిన సమీరణుడు అను మిత్రుడు పూల గుత్తులు అను ఉయలల నూపుచుండగా తుమ్మెద కాంతలు వానిపై గూర్చొని, ఊగుచూ కమ్మగా పాడుచున్నవి. ఇందలి మధుర మంజుల కోమల కాంతపదావళి వార్షా సుందర ప్రకృతిని దృశ్య మాన మొనర్చుచున్నది. ఇది నన్నయగారి గురు పద్య విద్యకు పరమోదాహరణము! అట్లతదియనాడు పల్లెటూళ్లలో ఎత్తైన చెట్లకు ఊయలలు గట్టి యువకులు ఊచుచుండగా, ఊగుచూ, పాటలు పాడుచున్న పల్లెపడతుల సోయగం ఈ రచనకు ప్రేరణ!

నన్నయ భట్టాది కవులు మారుతమును పురుషునిగ వర్ణిం చారు. ఆ కవి సంప్రదాయమును విడనాడి తెనాలి రామకృష్ణుడు మందానిలుని స్త్రీగ,—పరిచారికగా—వర్ణించినాడు.

''తెల లెం-ఆ నొయ్యనరుదెంచి, నిశాంత రతాంత తాంతలొ
చెలువుల కింపుగా మెలగి, చిక్కుల గూరిన చూర్ణకుంతలా
వళి సరళంబుగా జడిసి, వాడిన సెజ్జలమీది ప్రావిరుల్
దొలగ ప్రభాత వాయువులు దోచు బుతిం పరిచారికా కృతిన్.''

—పాం, 1–119 పద్యం.

ఇందు అనిలునకు స్త్రీత్వము ఘటించుట నవ్యత' దానిచే శృంగా రపు పరిచర్యనే చేయించినాడు రామకృష్ణుడు.

రాయప్రోలు వారి అపూర్వ ప్రయోగములలో సుందరి కపోల మును తమలపాకులతో పోల్చుట యొకటి.

''తమలపాకులవంటి సుందర కపోల''

—ఆధునికాంధ్ర కవిత్వం, 304 పుట

ఈ అపూర్వ విషయానికి మూలమనదగిన తెనాలి రామకృష్ణు పద్యమొకదానిని శ్రీ నారాయణరెడ్డిగారే 23వ పుటలో ఉదాహరి యున్నారు.

''పలుకుం బోయ్య మోవికాంతి కెనయౌ బాగాలు
క్కుల బోలుం దెలనాకు లయ్యువిద పల్కుల్వంటి
ల్కుంతో గూడిన నీడియం బొసగె''

—పాండు, 1

అని రామకృష్ణుడు సరస్వతి చెక్కిళ్లతో తమలపాకు పం'గా, గతాను గ కమైన రీతిలోగాక, నవంనవముగా

''కులంబు తరుణి ఫాలంబు చవితి చందురుడు''

– పాండు, 3–11

''ఆకు మరుంగు పిందెయయి యంతి పురంబునుబోలెన

—పాండు, 3–82 ప

అను రామకృష్ణుని ప్రయోగములకు

“సవితి నెంతెంత యయ్యె నా సఖియ చెలిమి”

—స్వప్నకుమారం 31 పద్యం 10వ పుట.

‘ఆకు మరుగు పుష్పము పొంక నందముగను”

—“ఆంధ్రావళి—జడకుచ్చులు”, ‘ఏమది?’ 135వ పుట.

అను రాయప్రోలువారి ప్రయోగములు సంవాదములుగ నున్నవి. రామకృష్ణుని ప్రభావము రాయప్రోలువారిపై ఈ మాత్రమందుట ఆశ్చర్యకరము!

కవిసార్వభౌముడు శ్రీనాథుడు ‘శృంగార నైషధము’ లో నలదమయంతుల రహఃకేళిలోనే నలుని శివారాధన తత్పరతను వర్ణించి, శృంగారాన్ని అధఃకరించి భక్తికి సింహాసనమెత్తినాడు.

“కంతుకసుసంగరరంగ మదకుంకుమ పర్వ వహించి సెలలో
హిత రుచులై స్వయంభులయి యూహిత సఖ్యనిధయులైన యా
ద్యుతివ పయోధరంబులకు నర్ధనిశా సమయంబున న్నమం
చిత నఖకింశుకార్చనము సేసె మహీపతి భక్తియేర్పడన్”.

శృంగారనైషధము. 7 128 పద్యం

ఇందు దమయంతి స్తనములను పూజనీయములుగ, భక్తికి ఆలవాలములుగ వర్ణించుట నవ్యత! శ్రీనాథునికి ముందే శివభక్తులు కొందరు శృంగార రసాలవాలములయిన తరుణీపయోధరములను శివలింగములుగ భావించి, భక్తితో పూజించుట శైవవాఙ్మయమున ప్రసిద్ధము. షట్కాల శివపూజా దురంధరులకు అర్ధరాత్రివేళ అతివల పయోధరములే శివలింగములై పూజార్హములయినవి. ఇట్టి సంఘటనను పాల్కురికి సోమనాథుడు ‘పండితారాధ్య చరిత్ర’ లోని “సుంగర సంచెన్న చరిత్ర”లో (మహిమ ప్రకరణం, 137–138 పుటలు) విపులంగా వర్ణించినాడు.

శ్రీ నారాయణరెడ్డిగారు మరొకచోట రాయప్రోలువారి [సంప్ర]దాయికతను పరిశీలిస్తూ—

“వీరెన్ని క్రొత్త రీతులను ప్రవేశపెట్టినను, స్వచ్ఛంద [ప్రయో]గములను చేసినను, పూసలలో దారమువలె వీరిని సాంప్ర[దాయ]త విడవలేదు .. ... అయితే కొన్ని సాంప్రదాయికములుగా [కన]బడినను, అత్యంత నవ్యములైన ప్రయోగములు. ‘నీరదసుత’ ప్రయోగ మట్టిదే. ‘నీరదసుత’ యనగా మేఘకుమారి యని అర్థము. మబ్బునకు ప్రాచీన కవులు స్త్రీత్వ మూహింపలేదు. మేఘుని పురుషుడుగా, విద్యుల్లతను స్త్రీగా చెప్పుటయే సంప్రదాయము. వీరు మేఘమునకు కుమారీత్వము కల్పించుట నవ్యత”

అని రాయప్రోలువారి ‘నీరదసుత’ ప్రయోగమును అపూర్వ ప్రయోగంగా భావించి ఉదాహరించినారు.

— ఆధునికాంధ్ర కవిత్వం, 311వ పుట.

మహాకవి కాళిదాసు ప్రభృతులు మేఘుని పురుషునిగ వర్ణించినారు. కాని ఆ సంప్రదాయమునకు స్వస్తి పలుకుచు మేఘునికి స్త్రీత్వము ఘటించిన తెలుగు కవులు ఉన్నారు.

ప్రకృతిని సంప్రదాయ సిద్ధమైన దృష్టితోగాక భావనా రమ్యంగా పరిశీలించుటలో శ్రీ కృష్ణదేవరాయలు అగ్రగణ్యుడు. రాయలు ‘ఆముక్తమాల్యద’లో వర్షర్తు వర్ణనలో మేఘ జాలమును దేవతామతల్లి కాళికాదేవిగా ఉత్ప్రేక్షించినాడు.

“గగన రంగ స్థలమున మిగుల ప్రౌఢి
మెరయు కాళిక నీలి కోలము నటింప
బొరి మొగంబున రాలు నిప్పుక లనంగ
సంపులై రాలె మహి నింద్రగోపకములు.”

— ఆముక్త, 4–98 పద్యం.

ఆకాశమనెడి రంగస్థలమున మేఘజాల మనెడి కాళికాదేవి పికట్టు క్రమ్ముట యను నీలవస్త్రము ధరించి నాట్యమొనర్చెనట! ఆమె ముఖము నుండి రాలెడు నిప్పు కణములో యను నట్లుగ ఇంద్రగోప కీటకములు నేలరాలినవి. కాళిక=మేఘజాల మనెడి కాళికాదేవి యని వేదం వారి ‘సంజీవని’ వ్యాఖ్య. “మేఘ జాలావలి కాళిక” అని అమరము.

శ్రీనారాయణరెడ్డిగారు ‘కృష్ణదేవరాయలు’ ను 395, 408, 433 పుటలలోను, ‘ఆముక్తమాల్యద’ను 209, 210, 433 పుటలలోను ఉదాహరించియున్నారు. కాని రాయల నవ్యప్రయోగం వారి దృష్టి నాకర్షించలేదు!

శ్రీనాథుడు ‘శివరాత్రి మాహాత్మ్యం’ లో ప్రావృట్కాల జలదమునకు స్త్రీత్వము ఘటించుటయేగాక, గర్భ భావంతో మాతృమూర్తిగ కూడ చిత్రించినాడు.

“అల్లి నల్లన మెలగు బద్మాయ తాక్షి
సముదితంబైన గర్భ భారము కతమున
సమ్యగాపీత జలరాశి సామ్యమైన
ప్రావృడారంభ నవ మేఘ పంక్తివోలె.”

— శివరాత్రి, 2–51 పద్యం.

ఇందు గర్భవతియగు సుశీలాదేవిని (యజ్ఞదత్తుని భార్య) వర్షాకాల మందలి క్రొత్త మబ్బులతో పోల్చుట అత్యంత విలక్షణమైన, సార్థకమైన ప్రయోగం. ఈ నిసర్గ రమణీయమైన సాదృశ్యం శ్రీనాథుని ప్రకృతి పరిశీలన శక్తినేగాక నవ్యతా ప్రీతిని గూడ ప్రకటించుచున్నది.

శ్రీకృష్ణ దేవరాయలు భావకవుల వలె ప్రకృతిని వాత్సల్య దృష్టితో వీక్షించినాడు. వర్షాకాలమందలి లేతమబ్బులు శిశువుల వలె రాయలకు కనిపించినవి.

''కృత పయః పాన నవ మేఘ పృథుకములకు
రాలె నొయ్యన వడగండ్లు పాలపండ్లు
మఱి బలాకా ద్విజాళి సంప్రాప్తి గలిగె
బెరుగ బెరుగంగ ధ్వనియు గంభీరమయ్యె.
— ఆముక్త. 4–82 పద్యం.

పాలు త్రాగుట మానిన పసిబిడ్డలకు క్రమ క్రమంగా పాలపండ్లు రాలునట్లు క్రొత్త మబ్బుల నుండి వడగండ్లు రాలుచుండెను. శిశువులకు మరల దంతములు వచ్చునట్లు క్రొత్త మబ్బులకుగూడ బెగ్గురు పక్షుల సంబంధము గలిగెను. శిశువులకు వయస్సు వచ్చు కొలది నోరు హెచ్చినట్లుగ, మబ్బులకు ఆకారము హెచ్చిన కొలది ఉఱుము బిగ్గర యగు చుండెను. (వేదంవారి వివరణ). క్రొత్త మబ్బులను పసిపాపలతో పోల్చుట నవ్యత!

ప్రాచీన కవులు ప్రకృతిని శృంగార భావముతోనే గాక భావ కవులవలె పూజ్య భావములో విలకించి, భక్తితో వర్ణించినారు. శ్రీకృష్ణదేవరాయలు 'ఆముక్త మాల్యద'లోని వర్షర్తు వర్ణనలో (4–105 పద్యం) మేఘుని వామనమూర్తిగ దర్శించి, భక్తితో పూజించినాడు. మరియు

''ఉదయ గ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి దరీ ధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీప ప్రభారాజికౌ
ముది తారా నివహంబు లర్పిత సుమంబుల్ గా దమోదూరసౌ
ఖ్య దమై శీతగభస్తిబింబ శివలింగం బొప్పె ప్రాచీదిశన్''

అని ''సాహిత్య శ్రీవరు''డైన ధూర్జటి అప్పుడే ఉదయించిన చంద్ర బింబమును దర్శించి, భక్తితో శివలింగముగా వర్ణించినాడు.
— శ్రీకాళహస్తి మాహాత్మ్యము, 2–133 పద్యం.

మానవుని సహజ ప్రవృత్తులలో నవ్యతా ప్రీతి యొకటి. ప్రతి కవి నవ్యతకై కృషి చేయువాడే! ఆ నవ్యతయే రమణీయము గనుక ప్రాచీన కవుల నవ్యతా గవేషణలో కవి సమయములు కొన్ని క్రొత్త రూపు దాల్చినవి. కొన్ని సరిక్రొత్త అందాలను సంతరించుకొన్నవి. తెనాలి రామకృష్ణుడు

''స్కంధ పురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోదయము నవ్య కవిత్వ కళా కలాపమున్
కుందనమున ఘటించి కడు గ్రొత్తగు సొమ్ముగ నొనరించి''
— పాండు. 1–26 పద్యం.

ఆంధ్ర భారతిని అలంకరించి దలంచి, కృతార్థుడైనవాడే! 'నవ్య కవిత్వ కళ' అను ప్రయోగం రామకృష్ణుని నవ్యతా ప్రీతిని ప్రకటించు చున్నది. నేన ఆధునిక కవిత్వంలోని నవ్యతను, అపూర్వ ప్రయోగాలను నిర్ణయించేముందు ప్రాచీన కవిత్వములోని నవ్యతను, విలక్షణ ప్రయోగములను సాకల్యంగా పరిశీలించవలసిన అగత్యం యెంతైనా వుంది!

## ఉపయుక్త గ్రంథములు :


1 ఆధునికాంధ్ర కవిత్వము. సంప్రదాయములు: ప్రయోగములు – డా॥ సి. నారాయణరెడ్డి.

2 ఆముక్తమాల్యద – శ్రీకృష్ణదేవరాయలు.

3 ఉద్భటారాధ్య చరిత్ర – తెనాలి రామకృష్ణుడు.

4 "Convention and Revolt in Poetry" By J. L. Lowes Quoted in 'Current Literary Terms' By A. F. Scott.

5 కావ్య మీమాంస — రాజశేఖరుడు.

6 కుమార సంభవము — కాళిదాసు

7 జడకుచ్చులు — రాయప్రోలు సుబ్బారావు.

8 పండితారాధ్య చరిత్ర — పాల్కురికి సోమనాథుడు.

9 పాండురంగ మాహాత్మ్యము — తెనాలి రామకృష్ణుడు.

10 భారతము ఆరణ్య పర్వము — నన్నయభట్టు.

11 రమ్యాలోకము — రాయప్రోలు సుబ్బారావు.

12 రాజశేఖరుని కావ్య మీమాంస — పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి

13 శివరాత్రి మాహాత్మ్యము — శ్రీనాథుడు.

14 శృంగార నైషధము — శ్రీనాథుడు.

15 శ్రీ కాళహస్తి మాహాత్మ్యము — ధూర్జటి.

16 స్వప్నకుమారము — రాయప్రోలు సుబ్బారావు.

శ్రీ ఎమ్. పార్థసారధి

# కౌగిలి

*(గత సంచిక తరువాయి)*

## కలకంఠి కలహం ...

కొత్త సంవత్సరం వుద్యోగుల కిచ్చే కానుకలు — పదిహేను రోజుల కాజువల్ లీవులూ, కొన్ని అడ్వాన్సులకు అర్హతలూ. ప్రతిసారీ సంవత్సరం మొదట్లోనే వీటిని వాడేసుకుని మళ్ళీ కొత్త సంవత్సరంకోసం ఎదురుచూసే అనేకమంది వుద్యోగుల్లో మనోరమ ఒకతె.

స్టాఫ్ సెక్షను కెళ్ళి అక్కడో గుమాస్తాను పట్టుకుని మనోరమ ఏవైనా అడ్వాన్సులకు అప్లై చేస్తే తనకు వెంటనే చెప్పాలని వాగ్దానం చేయించుకున్నాడు బాలూ. ఆ వాగ్దానం ప్రకారం వారం తిరక్కుండానే బాలూకు ఫోన్ వచ్చింది. 'మీ ఆవిడకు ఫెస్టివల్ అడ్వాన్సు కావాలట బాయ్' అన్నాడు వాళ్ళ ఫ్రెండు.

''కాస్త అది శాంక్షన్‌చెయ్యక పక్కనే పెట్టుగురూ. రేపు చెబుతాను'' అన్నాడు బాలూ.

ఆ రాత్రి సంగతేదో తేల్చుకోవాలనుకున్నాడు.

''ఇప్పటికి నువ్వు చేసిన అప్పులు చాలక కొత్త అప్పులకోసం అప్లై చేస్తున్నావా?'' అంటూ అడిగాడు.

''ఏమిటో.''

''ఫెస్టివల్ అడ్వాన్సు కావాలా ?''

''ఎవరు చెప్పారు నీకు ?''

''అంత రహస్యంగా చెయ్యాల్సిన అవసరం ఏమిటి?'' నాకు మాట మాత్రంగానైనా చెబితేనేం ?''

''ఓహో ! నువ్వు నామీద స్పైయింగ్ చేస్తున్నావన్న మాట.''

''అంటే నువ్వు నీ జీతాన్ని గురించీ, ఖర్చుల్ని గురించీ, అప్పులను గురించీ ఒక్కసారైనా చెప్పకపోవటం బాగానే వుంది. కాని నేనడిగితేనే కోపం వస్తుందన్న మాట.''

''సరే. నువ్వు నామీద నిఘా వేశావన్న మాట. ఆఫీసులో నువ్వు పి. ఏ. వి కావచ్చు. నీకు చాలామంది ఆఫీసర్లు తెలుసనీ, నీకు బోలెడు ఇన్ఫ్లుయెన్సు వుందని కూడా నాకు తెలుసు. కాని యిలా నామీద వాచ్‌పెట్టి నా మూమెంట్స్‌ని అవతలేస్తే.''

తన గురించి అలా చులకనగా మాట్లాడ్డం ఎంతైకీ కోపం తెప్పించింది

''అసలెందుకే వుద్యోగం చెయ్యటం? ఊరికే ఆఫీసుజనంతో కబుర్లు చెప్పి, సరదాగ తిరిగిరావటానికా లేక నాలుగురాళ్ళు సంపాదించుకొని, ఇద్దరం కష్ట సుఖాలు పంచుకొని బ్రతకటానికా? నీ సంపాదన నువ్వు—నా సంపాదన నేను అనుకుంటూ ఒకర్ని గురించి ఒకరం ఏమీ పట్టించుకోకుండా వుంటే యింక పెళ్ళెందుకు ? మనోరమా నువ్వు చాలా దారితప్పి నడుస్తున్నావు. నువ్వు నాకేమీ యివ్వకపోతే మానె, అసలు ఏం చేస్తున్నావో చెప్పు. ఇన్ని అప్పులు చెయ్యాల్సిన అవసరం నీకెందుకు వచ్చింది ?''

''సరే. అడిగావు గనక చెబుతున్నాను. ఇవన్నీ వెనకటి అప్పులు. మా చెల్లెలు వుద్యోగంలో చేరి యింకా ఆర్నెల్లు కాలేదు. ఇన్నాళ్ళ మా యింటి ఖర్చులు ఎవరు భరించారనుకున్నావు. అదీగాక మా యింట్లో ఎవరికీ పొదుపు తెలియదు. ఇంకింతకన్నా ఎక్కువ ఏం చెప్పలేను. నన్నడక్కు.''

''జరిగిందేదో జరిగింది. ఇప్పటికైనా జాగ్రత్తపడవచ్చు గదా.''

''ఏం చెయ్య మంటావు''

''నామాట విని అడ్వాన్సు అప్లికేషన్ వాపసు తీసేసుకో. ఇప్పటికి నీకున్న కట్స్ చాలు. డబ్బులు కావలిస్తే ఎందుకో చెప్పు. నేనిస్తాను ''

''అంత యిచ్చేవాడివి, నేను అడ్వాన్సు తీసుకుంటే నీకేమిటి నష్టం ?''

''అదే చెబుతున్నాను. అంతా బూటకం. కట్టు కథలు చెబుతున్నావు. నువ్వు తీసుకుంటే నాకేమిటి నష్టం ! నీకు జీతం రాకపోతే నాకేమిటి నష్టం? నీకు నేనేమికాకపోతే ఎందుకీ కాపురం? కమాన్, ఈ యింటి ఖర్చులో నీ వాటా ఎంతో చెప్పు.''

''ఇంతెందుకూ, నా జీతమంతా తెచ్చి నీ చేతిలో పొయ్యాలని చెప్పు. అదే గదా నీక్కావ సింది. కాని నేను పెళ్ళికి ముందర అలాంటిదేమీ వాగ్దానం చెయ్యలేదు. డబ్బులసంగతి తేల్చుకోవటానికి

నాకేమీ అభ్యంతరం లేదు. కాని ఆఫీసు విషయాలు యింట్లో మాట్లాడకు. అక్కడి నా పరిచయాల గురించీ, కబుర్ల గురించీ నీకు ఏ రకమైన సంజాయిషీ యిచ్చుకోవాల్సిన అవసరమూ నాకు లేదు. అది నా స్వంత విషయం...'' అంటూ మనోరమ చాలాసేపు ఏడుస్తూ కూర్చుంది. బాలూకు ఆమెను ఓదార్చాలనిపించలేదు.

## ... కోపం ...

''నేను ఈ రోజు ఆఫీసుకు రావటం లేదు.''

బాలూ 'ఏం?' అని అడుగుదామనుకునీ, మళ్ళీ ఆమె ఏం గొడవ చేస్తుందోననే భయంతో మాట్లాడలేదు. తను చేసిన తప్పేమిటి? ఆమె అకారణ కోపం తనకు చిరాకు కలిగిస్తున్నది. జీతం దుబారా చెయ్యొద్దంటే కోపం రావాలా? భార్య గురించిన విషయాలు కొలీగ్స్ ద్వారా తెలుసుకోవలసి రావటం యింకా అసహ్యంగా వుంది.

సాయంత్రం యింటికి వచ్చేసరికి ఫ్లాట్‌కు తాళం. తాళం చెవి పక్క ఫ్లాట్‌వాళ్ళ కిచ్చిపోయింది. పొద్దున్న వంట చేసిన సూచనలేమీ లేవు. ఆ రాత్రి విశాలమైన డబుల్ బెడ్ అతణ్ణి వెక్కిరించింది. 'ఛీ. ఛీ. బ్లాక్‌మెయిల్ చేస్తోంది' అనుకున్నాడు. ఎంత కోపం వచ్చినా, ఎమర్జెన్సీ వచ్చినా సరే, బాలూకు అన్నీ వేళ ప్రకారం జరగాలి. అతడు భోజనం మానెయ్యలేదు, కాఫీ మానెయ్యలేదు, ఆఫీసు మానెయ్యలేదు...ఇప్పుడు యిలా ఒంటరిగా...వెంటనే మారెడ్‌పల్లి పోవాలనుకున్నాడు. కాని ఎంత అవమానం! ఇన్ని సౌకర్యాలున్న ఈ యింటికన్నా ఆ యిరుగ్గదుల కొంపే బాగుందా ఆమెకు? తను వెళ్ళి బ్రతిమాలాల నుకుంటోందేమో కాబోలు. పొరబాటైందని చెప్పాలి. క్షమించమనాలి. నువ్వే నా దేవతవనాలి. నో. తనాపని చెయ్యలేదు...

కాని ఆమెమీది కోపంతో అతడు ఆమె లేని లోపాన్ని, అసౌకర్యాన్ని మరింత ఎక్కువగా అనుభవించాడు. ఆమెమీది కోపం బుసలు కొడుతుంటే, ఆ కోపం వెనకనుండి పక్కనపడుకొనే ఆమె సన్నటి, అందమైన శరీరం అతడికి మరీ మరీ పిచ్చెక్కించింది. ఛీ. ఒక్క రోజుకే యింత గొడవేమిటి, మొహం వాచిన వాడిలాగా. కాని... ఎందుకామెను పెళ్ళి చేసుకున్నాడు? ఇలా ఒంటరిగా పడుకోవటానికా? తనకు అర్హతవున్న, తను సంపాదించుకున్న వస్తువులను తనెందుకు వదులుకోవాలి? జీవితంలో తనకేదీ సులభంగా దొరకలేదు. ప్రతిదీ కష్టపడి, కాంపిటేషన్లో గెలిచి మరీ సాధించాడు. చివరికి మనోరమను కూడా. పెళ్ళికాకముందు ఆమె కెందరు అడ్మైరర్స్ వుండేవాళ్ళు! వాళ్ళెవర్నీ కాదని తననే ఎందుకు చేసుకుంది? తన వుద్యోగం చూసింది. జీతం చూసింది. ఒంటరిగాడని తెలుసుకుంది. అన్నీ తెలుసుకుని చేసుకున్న తర్వాత యిలా ఎందుకు చేస్తోంది? నెల జీతంలో ఓరోజు వొదులుకుంటే ఏమవుతుంది? ఓ సంవత్సరం యింక్రిమెంటు రాకపోతే ఏమవుతుంది? మనోరమతో ఓరోజు కలిసి పడుకోకపోతే ఏమవుతుంది? కాని నిష్కారణంగా ఏదైనా ఎందుకు వొదులుకోవాలి? జీతం గొడవైనా తను అడిగాడే గాని బలవంతం చెయ్యలేదే! ఇవ్వమనలేదే! ఇనది యింత సుకుమారమైన మనసా? కాదు. ఏమాత్రం కాదు. ఇది అహంకారం. తను లేకపోతే వొక్కడూ వుండలేడని తెలుసుకుని మరీ చేస్తున్నది... చుట్టూ తిప్పించుకోవాలని...కన్నింగ్...తను ఎత్తుకు పై ఎత్తు వెయ్యాలి. ఆమెను సాధించాలి. తప్పు తెలుసుకునేలా చెయ్యాలి. కాళ్ళమీద పడేసుకోవాలి. పెళ్ళి తర్వాత ఆమెతో కలిసివుండే హక్కు తనకుంది. తన హక్కులు తనకు చెందకుండా చేసిన ఆమెకు కూడా కొన్ని అవసరాలు తీరకుండా చూడాలి. కాని అపాలజీ చెబితే వదిలెయ్యాలి. ఈ అంతర్మథనం తర్వాత అతడి విరహబాధ మరీ ఎక్కువైంది.

ఓరోజు భోజనం మానేసినట్టుగా...తిరిగిరాని ఓరోజు వృథా చెయ్యాల్సివస్తోంది...

## ... కన్నీరు-కౌగిలి

రోజా ఆఫీసు పనిలో తన్మయుడైపోయే బాలూ ఆ మరునాడు మనోరమ అలిగిపోయిన విషయాన్ని మరవలేకపోయాడు. మధ్యాన్నం గంటలు గడుస్తున్నకొద్దీ మనోరమతో యింకాఎన్నాళ్ళు ఎడంగావుండాల్సి వస్తుందోనన్నభయం పెరుగుతూవచ్చింది. తీరా ఆఫీసు మెట్లుదిగి స్కూటర్ స్టాండ్‌వద్దకు వచ్చేసరికి—సడెన్‌గా—అప్పటిదాకా కోపం వెనక దాగిన కోరికలో—ఛ. ఛ. మొగుడూ పెళ్ళాలమధ్య పట్టింపు లేమిటి, ఏదోరకంగా ఆమెను దారికి తీసుకురావాలిగాని అనుకుని—ఆమె సాంగత్యంలోని తీపి తీపి క్షణాలను నెమరేసుకుంటూ మారెడ్‌పల్లికి ప్రయాణమయ్యాడు.

ఇంట్లో

తన వూహలకు విరుద్ధంగా మనోరమ చాల ఆత్రుతగా, ఆప్యాయంగా ఆహ్వానించింది.

''అదృష్టవంతురాల్ని. రెండో రోజునైనా జ్ఞాపకంవచ్చారు'' అంది.

బాలూ మాట్లాడలేదు. గదిలోకి వెళ్ళంగానే తలుపేసి ఆమెను గట్టిగా వాటేసుకుని,

''మరోసారి యిలా చేస్తేవూరుక్కునేదిలేదు. నీకంతగా కోపం వస్తే మరి కాసేపు అక్కడే కేకలెయ్యొచ్చు. గాని యిలా పుట్టింటికి వచ్చే పద్ధతులు మాత్రం ప్రయోగించొద్దు. నువ్వులేకుండా నేనొక్కరోజు గూడా వుండలేను. అలాగని అది అదనుగా నువ్వు కావాలని నన్ను యిబ్బంది పెట్టకూడదు'' అన్నాడు.

కట్టలు తెగిన అతని ఉద్రేకం తనను కితకితలు పెట్టగా,

''నువ్వెంత మంచివాడివి!'' అంది మనోరమ.

''మనూ, నీకు నన్ను చూస్తే అసహ్యమెయ్యొచ్చు. కాని చిన్నప్పుడు నేను చాలాకష్టాలుపడ్డాను. నా జీవితమంతా లెక్కల

మయం. అమ్మా నాన్నను చిన్నప్పుడే పోగొట్టుకున్నాను. మా బంధువులు నాకు సహాయం చెయ్యలేదనిగాదు గాని, వాళ్ళు చేసిన ప్రతి పావలా సహాయానికీ రూపాయి నానుంచి రాబట్టుకున్నారు. జీవితంలో ప్రేమ, అభిమానం, కృతజ్ఞత అంటే తెలియకుండా పెరిగాను. నేను లెక్కల మనిషిని. నా అనుభవం నన్నలా తయారు చేసింది. ఒక రాష్ట్రంలోపుట్టి, మరో రాష్ట్రంలో చదువుకుని, వుద్యోగాన్వేషణలో ఎన్నెన్నో వూళ్ళు తిరిగి చివరికీ వూళ్లో యిలా స్థిరపడ్డాను. మనూ, ఎడారిలాంటి నా జీవితంలో నిన్ను చూసి నప్పు మొదటిసారిగా ఆకర్షణ కలిగింది. నేను నిన్ను చేసుకున్నది లెక్కలడగటంకోసంకాదు. కలిసి హాయిగా బ్రతకటంకోసం. కావాలంటే యిద్దరి జీతాలూ కలిపి జాయింట్ అక్కౌంట్‌లో వేద్దాం. నీ యిష్టం వచ్చినప్పుడు నీక్కావలసింత తీసుకో. కాని ఖర్చుపెట్టే ముందు ఆలోచించు. ఖర్చుచెయ్యటం సులభం సంపాదించటం కష్టం..." అంటూ చెప్పుకుపోతున్న బాలూ మనోరమ కన్నీళ్లు తుడుచుకోవటం చూసి, "ఛ ఛ. వూరికే నా సొదచెప్పి నిన్నేడిపించానా డార్లింగ్" అంటూ ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

## రా. మెల్లెక్కుదాం

"ఓ అనౌన్స్‌మెంట్. నీకు పార్టీలంటే యిష్టంగదూ ?"

"విషయమేమిటో చెప్పు."

"నువ్వు అవుననాలి. 'వీలుపడదు. బావుండదు' అంటో అడ్డుచెప్పకూడదు."

"తమరి ఆజ్ఞ."

"చాఢాగారు మనకు పార్టీ యిస్తున్నారు."

"ఎవరా చాఢా ?"

"ఓహ్. వాటేషేమ్ ! మా బాస్, మా రీజినల్ మేనేజర్ చాఢాగారు"

"అయ్యబాబోయ్."

"యస్ మేడమ్, మిస్టర్ అండ్ మిసెస్ చాఢా మనన్ని ఈ శనివారం వాళ్లింటికి డిన్నర్‌కు ఆహ్వానించారు. అందువల్ల రెడీగా వుండండి."

మనోరమ నిట్టూర్చి కుర్చీలో వాలిపోయింది.

"ఇందులో సంతోషించాల్సిం దేముంది ? మన పైవాళ్లిచ్చే పార్టీల్లో సరదా ఏముంటుంది ? నీ సంగతి తెలియదుగాని నేను మాత్రం ఫ్రీగా వుండలేను. ఆయనకూ, ఆయన పెళ్లానికీ భయపడుతూ, ఏంచేస్తే ఏమంటారో ననుకుంటూ కూర్చుంటే నీకు సరదాగా వుంటుందన్న మాట."

"అరెరె. నీకు చాఢాగారంటే ఎంత దురభిప్రాయముంది ! అతను సీరియస్ మనిషని నీకెవరు చెప్పారోయ్ ! ఆఫీసులోని అతని పర్సనాలిటీ చూసి నువ్వు గాభరాపడకు."

... శనివారం వచ్చింది.

బాలూ మనోరమ ప్రెజెంట్ చేసిన స్ప్రైట్ షర్టు బ్లూ పాంట్‌లో టక్ చేశాడు. మనోరమ ఎంబ్రాయిడరీ చేసిన ప్రేంకలర్ నెట్టుచీర కట్టుకుని, ముత్యాలహారం వేసుకుని తయారైంది.

పాంటూ, బుష్ షర్టూ, చెప్పులు వేసుకున్న చాఢాగారూ, స్లీవ్‌లెస్ బ్లౌజు, కేర్‌లెస్‌గా చుట్టుకొన్న చీరావున్న మిసెస్ చాఢాగారూ వీళ్ళ నాహ్వానించారు.

"ఆఫీస్ విషయాలు కాసేపు మరిచి రిలాక్స్ అవండి" అన్నారు చాఢాగారు మనోరమ వైపు చూసి.

ఆ తర్వాత, విస్కీ బాటిలూ, సోడా సీసాలూ, నాలుగు గ్లాసులూవచ్చాయి. బాలూ అపాలజెటిక్‌గా 'మా ఆవిడ తీసుకోదు' అన్నాడు. మనోరమ కోసం ఆపిల్ జూస్ వచ్చింది.

చాఢాగారు జోక్స్‌లో బాలూను కడుపుబ్బ నవ్వించారు. మిసెస్ చాఢా మనోరమతో హిందీలో మాట్లాడాలని ప్రయత్నించింది గాని మనోరమకు హిందీ, ఇంగ్లీషు కూడా అంతంత మాత్రంగానే వచ్చును. మనోరమ కబుర్లలో ఎక్కడా వుత్సాహం చూపించక పోవటం చూసి, చాఢాగారు,

"మేం మీ యింటికి వచ్చినా నువ్విట్లాగే వుంటావన్న మాట" అన్నారు.

"లేదు. లేదు. మాట్లాడతాను. మాట్లాడుతూనే వున్నానుగా అంది మనోరమ.

"పెళ్లై ఐదు నెలలవుతోంది. ఇంకా ప్రోగ్రెస్ లేదేం?" అంది మిసెస్ చాఢాగారు.

మనోరమ మాట్లాడలేదు.

"దేఖో, త్వరత్వరగా కనేసి 'కట్' చేసేసుకో. ఇలా ఎన్నాళ్ళు వాయిదా వేసినా ఎప్పుడో అప్పుడు కనక తప్పదు. నేను పెళ్లైన నాలుగేళ్లలో వరసగా నలుగుర్ని కన్నాను. అంతే తర్వాత స్టాప్" అంది మిసెస్ చాఢా బిగ్గరగా నవ్వుతూ. ఆమె మొగుడు, బాలూ కూడా ఆమెతో కలిసి నవ్వేరు.

మనోరమ సిగ్గుతో ముడుచుకుపోయింది.

"మీ ఆవిణ్ణి యింకా సోషల్‌గా తయారు చెయ్యాలి" అన్నారు చాఢాగారు.

"ఈ అమాయకత్వం అంతా నటన. నన్ను లెట్‌డౌన్ చేస్తోంది అనుకున్నాడు బాలూ. పార్టీ తర్వాత మనోరమతో స్కూటర్‌మీద యింటికి వస్తూ.

## నిద్రరాని మరో రాత్రి

చీకటిలో సీలింగ్ ఫాన్ చప్పుడు చేస్తోంది. నిద్ర పోతున్నప్పుడు మనుషు లెంత అమాయకంగా వుంటారు ! మెళకువగా

వున్నప్పటి కోపాలూ, కార్పణ్యాలూ, పుల్లవిరుపు మాటలూ ఏవీ వుండవు. మొహం నిర్మలంగా వుంటుంది. ఇంత అమాయికంగా కనిపించే ఈ మనిషిని గురించి తనెన్ని కొత్త విషయాలు తెలుసుకున్నాడు! పక్కఫ్లాటు రేడియోలో సంగీత కచేరి వస్తున్నది. అదే అతడి ఆలోచనలకు నేపథ్య సంగీతమైంది. తను చిన్నప్పటి నుండీ ఏ స్త్రీతోనూ పరిచయం లేకుండా, ఒంటరిగా పెరగటం తన మనస్తత్వాన్ని పూర్తిగా మార్చివేసింది. కనీసం యవ్వనంలోవున్న స్నేహితురాళ్లు, అక్కలు, చెల్లెళ్లు ఎవరైనా వుంటే తను స్త్రీని చూసే పద్ధతి మారేదేమో! స్త్రీలో శారీరకమైన ఆకర్షణ తప్ప మరేమీ చూడలేదు తను. ఆ గుడ్డితనమే తనను మనోరమ వైపుకు లాగింది. మనోరమ! ఎంత జాలిగా చూస్తాయి ఆ కళ్లు. మగాళ్లు వస్తుంటే ఆఫీసు కారిడర్స్‌లో కూడా ఒదిగి ఒదిగి నడిచే బెరుకుదనం, పైట ఒంటి నిండా కప్పుకుని ఎప్పుడు ఏ కళ్లు తన వైపు చూస్తాయోనన్నట్టు జాగ్రత్తగా మసలుకునే ప్రవర్తన — ఎట్టి పరిస్థితుల్లో అంగుళంకూడా తొలగని పైట, భయంగా చూసే ఆ కళ్లలోని ఆకర్షణ — ఆహ్వానం — ఎవరికివాళ్లే ప్రతి మనిషీ తనామెను రక్షించకపోతే బ్రతకలేదేమో ననిపించేటట్టుగా బలహీనంగా మాట్లాడే గొంతు...

ఏదైనా అడిగితే మొదట నోరే మెదపలేనట్టుగా జవాబివ్వదు. రెండు మూడుసార్లు ప్రశ్నిస్తేగాని ఒక్కమాటైనా మాట్లాడదు. కాని అంతా తన భ్రమ. ఈ ఆర్నెల్లలో ఆమె నోటి దురుసూ, విశృంఖలమైన ఆమె ప్రవర్తనా తను మోతాదు కన్నా ఎక్కువే చూశాడు. మగాళ్లు మరోసారి వెనక్కుదిరిగి చూడగలిగే శరీరమే ఐనా మరీ సన్నగా వుంటుంది. అది షోకుల సన్నదనం కాదనీ, బీదరికంవల్ల వచ్చిన సన్నదనమనీ అనిపిస్తుంది. ముఖ్యంగా శుభ్రంగా, బాగా మేకప్ఐవచ్చే మిగతా వాళ్లతో పోల్చినపుడు చందరవందరజుత్తులో, చాలకేర్‌లెస్‌గా, హడావిడిగా నడిచివచ్చే మనోరమ విలక్షణంగా కనిపిస్తుంది. అందువల్లే మొదటి రోజు ఆమెతో పరిచయమైన సన్నివేశం తలచుకొని యింకా పశ్చాత్తాప పడుతున్నాడు ...

లంచ్ టైం తను ఆఫీసు పక్కనేవున్న హోటల్‌కెళ్లాడు. హోటల్లో సీట్లన్నీ నిండిపోయాయి. ఓ టేబుల్‌వద్ద మనోరమా, పద్మజ అనే మరో కొలీగ్ టిఫిన్ చేస్తున్నారు. ఓసారి లోపలంతా తిరిగొచ్చి,

"ఎక్స్‌క్యూజ్‌మి. నేనిక్కడ కూర్చుంటాను" అన్నాడు మనోరమ కన్నెత్తయినా చూడలేదు. ఎదురెదురుగా కూర్చున్నారు గనక — పద్మజ మనోరమ వైపు వెళ్లి కూర్చుంది. తను టిఫిన్ ఆర్డరిచ్చాడు. మనోరమ యింకా యిడ్లీలో స్పూన్ కుచ్చుతూ కూర్చుంది. తన టిఫినూ, కాఫీ ఐపోయింది. మనోరమ యిడ్లీ కదల్లేదు.

"మళ్లీ ఆఫీసుకొచ్చే వుద్దేశం లేదా ఏం?" అన్నాడు. మనోరమ నవ్వింది—ఆమె తల దించుకొని వుండటంవల్ల తనకలా అనిపించి వుంటుంది.

"ఇంత సిగ్గుపడే అమ్మాయిలు ఆఫీసులకెందుకొస్తారు? వుద్యోగా లెందుకు చేస్తారు?" అనుకున్నాడు. అదీ, ఆ పొరబాటు ఆలోచనతోనే ఆమెమీది కోరికపెంచుకున్నాడు. ఆమెతో మాట్లాడే అవకాశాలకోసం నిరీక్షించాడు. ప్లాన్లు వేశాడు. ఆఖరికోసారి లీవు అవసరమైంది. పదిహేను రోజుల తర్వాత వచ్చి వెనకటి లీవు రెగ్యులరైజ్ చెయ్యమని రీజినల్ మేనేజర్‌ను అర్థించటానికి వచ్చింది...అవును అప్పుడు లీవు ఎందుకు పెట్టిందో తెలియదు. ఆరోగ్యం బాగా లేదంది. కాని ఎందుకు ఆరోగ్యం చెడిపోయింది? అసలేమైంది?...కోపం పెరిగింది. అన్నీ రహస్యాలే ఆమె గురించిన ఎన్నో విషయాలు తనకింకా తెలియవు...తన అశాంతికి కారణమైన ఆమెను బాధించాలి. మానసికంగా ఏ సంబంధమూ పెట్టుకోగూడదు. ఆమెకు గాయంచేస్తే తన కోపం తాత్కాలికంగానైనా తీరుతుంది. ఇలా నిద్ర లేమితో గడపక...కనీసం నిద్రపోగలడు ...

## తలపిన్నులో జంధ్యం చిక్కుకున్న రోజు

"మనం ఒకరికొకరం బోర్ కొట్టకుండా చూసుకోవటం చాలా అవసరంగదూ!" అంది మనోరమ, ఒక ఆదివారం ఆలస్యంగా భోంచేసి చేసేదేమీలేక టేప్ రికార్డర్ సంగీతంవింటూ పక్కమీద చేరిన ఒక మధ్యాహ్నం.

మూడో అంతస్తు కిటికీలోంచి ఎండ ఆమెమీద పడుతుంటే, ఆమె శరీరాన్ని పరిశోధించటంలో నిమగ్నుడైన బాలూకు ఈ మాట వినిపించలేదు. మనోరమ కళ్లు మూసుకుని, చేతులు తల వెనక్కి పెట్టుకుని పడుకుని వుంది.

'మాట్లాడవేం?' అంటూ రెట్టించింది.

'ఎందుకు బోర్ కొడుతుంది?'' అన్నాడు బాలూ రొప్పుతూ.

పక్కిలిగింతలకు మనోరమ నవ్వింది. ఆ నవ్వు అతడికి ఎవహేళనగా కన్పించింది. ఈసారి ఆమె మూల్గింది. అది అతనికి దీనాలాపంగా విన్పించింది.

ఇద్దరూ నిద్రలేచేసరికి సాయింత్రం అయ్యింది

సౌందర్యారాధకుడైన బాలూ, సౌందర్యాధిదేవత ఐన మనోరమతో కలిసి స్కూటర్‌మీద ఓ రౌండ్ చుట్టివచ్చి, టౌన్‌లో కొన్ని కేక్స్, పేస్ట్రీ , ఒక ఆపిల్‌జ్యూస్ బాటిలూ, కాసిని పళ్లూ తీసుకుని, వాటితోనే రాత్రి భోజనం ముగించి మళ్లీ సౌందర్యారాధనలో మునిగిపోయాడు. ఈసారి అతడు అలసిపోలేదు. గొంతుదాకా భోంచెయ్యలేదు గనక తొప్పలేదు. మెర్క్యురీ లైట్‌కింద, రాత్రి నిశ్శబ్దంలో, మధ్య మధ్య మనోరమ కిలకిలతో మూడవజాముదాకా రెప్ప వాల్చకుండా గడిపాడు.

చెమట పట్టిన శరీరంతో, కళ్లద్దాలకు అలవాటైన మొహం అద్దాలులేక అతడి చిన్న చిన్న కళ్లు తమాషాగా కనిపించగా

పసిపిల్లవాడిలాగా తన మీదవాలి గుసగుసలుచెప్పే బాలూను చూస్తే ఆమెకు కూడా ఆ రోజు ఎంతో యిష్టం కలిగిన మాట వాస్తవం. ఎప్పుడూ డబ్బు యిబ్బందిలేని భర్త, ఇంటి పని గురించి ఆలోచించ అవసరంలేని సంసార జీవనమూ, తనకోసం పిచ్చెత్తిపోయే మగాడూ, ఎప్పుడుపడితే అప్పుడు ఆఫీసు ఎగ్గొట్టగలిగినన్ని సెలవులూ, బోలెడు సినిమాలూ, మసక చీకటిగావుండే పోష్ రెస్టారెంట్స్‌లో కూల్ డ్రింక్స్ సిప్ చేస్తూ, 'స్వీట్ నథింగ్స్' మాట్లాడుకోవటం ఆమెకిష్టం. ఆరాధకులు, భక్తులు, పూజార్లు మాత్రమే ఈ పనులు చెయ్యగలరు. బాలూ యిప్పుడామెకు ఆరాధకుడు. అతనికే మెచ్చిందో, ఎందుకింత నచ్చేక్కిందో కాని పెళ్లికి ముందర గూడా ఆమెనింత 'ముద్దు' చెయ్యలేదు. ఇంట్లో ఒక్కక్షణం ఆమెను విడువడు. ఆఫీసు కెడితే అక్కడా ఫోను పట్టుకుని కూర్చుంటాడు. లేదా తీరిగ్గావుంటే ఏకంగా ఈమె సీటువద్దకే వచ్చి కూర్చుంటాడు. లేదా లంచ్ టైమ్ దాకా కూడా ఆగకుండా యిద్దరూ కలిసి కాఫీకి వెళ్తాస్తారు. అసలే టాప్ బాస్‌గారి పి. ఎ. పైగాక ఆమె మొగుడు. అందువల్ల మనోరమ సెక్షన్‌వాళ్ళ గూడా ఏమనలేక పోయేవారు. ఎన్నాళ్లుంటుందో గాని ఇది స్వర్గం—అతనికి, ఆమెకూ గూడా.

## లోకల్ అనెస్తీషియా

బాలూకు సెలవులకు కొదవలేదు. అతడికి ఆర్నెల్ల అర్న్‌డ్ లీవ్ వుంది. అదిగాక సిక్‌లీవ్ వుంది. స్పెషల్‌లీవ్ వుంది. ఆఫీసు కొచ్చి అటూ యిటూ తిరిగినా ఎవరూ పట్టించుకోరు. 'పెళ్లి మోజింకా తీరనట్టుంది తిరగనీ' అనుకుంటారు. కాని మనోరమ సంగతివేరు. ఆమె సెలవులు చాలామట్టుకు 'యాంటిసిపేటరీ'—అంటే యికముందు ఆఫీసుకు సక్రమంగా రానటంవల్ల ఆమె సంపాదించుకోబోయే సెలవు యిప్పుడే తీసుకుంటోందన్నమాట. అలా ఎందుకూ అంటే అది కూడా లేకపోతే జీతంలో కోత పడుతుంది. అందువల్ల. ఇలాంటి సెలవు దొరకాలంటే బలమైన కారణాలుండాలి. కాని ఆమెకీ రకమైన లీవుకూడా ఆమె ప్రయత్నమేమీ లేకుండానే శాంక్షన్ ఐంది—బాలూకు ఆఫీసులో అలాంటి పలుకుబడి వుంది. అంతేకాదు. లీవుల సంగతి ఎలాగో చూసుకుందా మనుకుంటే మరో విషయం జరిగింది "'ఉగాది' వచ్చింది. ఆరోగ్యం కూడా బాగుండటంలేదు. నేనెట్లాగూ పని చెయ్యలేను" అనే మిష మీద మనోరమ, బాలూను కూడా మారెడ్‌పల్లికి బయల్దేరతీసింది.

"ఊరికే వాళ్లింట్లోపడి తినటమెందుకు" అన్నాడు బాలూ.

''ఊరికే ఎందుకు తింటాం. వాళ్ళకేమైనా ప్రెజెంట్స్ యిద్దాం లెండి'' అంది మనోరమ. అలా, పండక్కి, తల్లికి చీరా, తండ్రికి ధోవతులూ కావాలంటూ ఓ రెండువందల రూపాయలిచ్చేసింది. లకస్మాత్తుగా మనోరమకు పుట్టింటి వాళ్ళమీద కలిగిన ఈ అభిమానంతో బాలూకు వూపిరాడలేదు వాళ్ళిమధ్య కొంత డబ్బు జాయింట్ అక్కౌంట్‌లోవేశారు. ఆ అక్కౌంట్ ఓపెన్‌చేసిన మర్నాటినుండే యించుమించు రోజూ మనోరమ చెక్కులు రాస్తూనే వుంది. ఎప్పుడైనా కరెంటు లేకపోతే;'అబ్బబ్బ ఈ ఉక్క భరించలేను' అనే మనోరమ కిటికీ ఐనా లేని ఈ యిరుగ్గదిలో ఎలా పడుకో గలుగుతుందో బాలూకు అర్థంకాలేదు రాత్రిళ్ళు పదిన్నరదాకా తనవైపన్నాచూడదు. కూరగాయంకు, వెచ్చాలకు అంచ్యాప్రతిసారీ డబ్బు ఆమేయిస్తుంది. అసలు వాళ్ళింటి వాతావరణమే అతడిక్కాస్త వింతగా కనిపించింది. ఆడవాళ్ళు అంత ఫ్రీగా తనున్నాననే బిడియం కూడా లేకుండా తిరగటం--ముఖ్యంగా మధ్యవయస్సుదాటిన వాళ్ళతల్లి కూడా యింక బాగా అలంకరించుకొని అందంగా కనిపించటానికి ప్రయత్నించటం —అతడి కర్థంకాలేదు. కాని ఆ యింట్లో తనకు తెలియకుండానే తనమీద ఏదో నిషా పని చేస్తున్నట్టుగా తోచింది. తనుగాక ఆ యింట్లో వుండే మిగతా యిద్దరు మగాళ్ళు—మనోరమ తండ్రీ, తమ్ముడూ—యింట్లో వున్నట్టే వుండరు. వాళ్ళ వునికినే ఎవరూ గమనించరు. ఇంట్లోని హడావిడి, పెత్తనం అంతా వీళ్ళదే. తనమీద అపారమైన అభిమానం. పోటీపడి సపర్యలు చెయ్యటం.

అక్కడున్న నెలరోజుల్లోనూ తను కాపరానికి అయ్యే దాని కన్నా రెట్టింపు ఖర్చయ్యింది. అనారోగ్యం ఏమిటో మనోరమ చెప్ప లేదు. తను తెలుసుకోలేకపోయాడు. రొటీన్‌లో ఏమీ మార్పులేదు.

## ఆనంద రహస్యం

''మా చెల్లెలికి ఏదైనా సంబంధం చూడమంటున్నది అమ్మ'' అంది మనోరమ తల్లికి వినిపించేటట్టుగా కూతురి కోరిక కోరగానే తల్లికూడా వచ్చి అల్లుణ్ణి మరోసారి అడిగింది.

''ఉద్యోగం చేస్తున్న అమ్మాయికి నేను చూడటమేమిటీ, ఆవిడే ఎవర్నో 'లవ్ మారేజ్' చేసుకుంటుంది'' అంటో బాలూ మనోరమవైపు చూసి, 'మీ పెద్దమ్మాయి కెవరు చేశారు?' అన్నాడు.

''సరే. నిన్నిప్పుడెవరూ జోక్స్ వెయ్యమని అడగలేదు'' అంది మనోరమ.

పరీక్షలకోసం బండెడు పుస్తకాలు ముందరేసుకుని చదువు తున్న మనోరమ తమ్ముణ్ణిచూసి—

''ఇదిగో గురూజీ, ఈ రోజుల్లో చదువుకుని బాగుపడ్డ వాడు లేడు. ఎంత తొందరగా వుద్యోగం దొరికించుకుంటే అంత అదృష్టవంతుడివి. నువ్వు డిస్టింక్షన్ తెచ్చుకుని, తర్వాత డాక్టరేట్ చేసినప్పటికీ, వుద్యోగం దొరక్కపోతే అప్పుడు మళ్ళీ ఏ ఆఫీసులోనో ఎల్డీసీగా చేరాల్సిందే. మా ఆఫీసులో బోలెడుమంది పోస్ట్ గ్రాడ్యు యేట్లు జూనియర్ అసిస్టెంట్లుగా పని చేస్తున్నారు'' అంటో హితవు చెప్పాడు.

''నీ ఇన్ఫ్లుయెన్సు వుపయోగించి మన ఆఫీసులో వాడి కేదైనా చూడకూడదా?'' అంది మనోరమ.

''చూద్దాం'' అన్నాడు బాలూ కళ్ళద్దాలు సవరించు కుంటూ.

... ... ... ... ...

ఒక ఆదివారంనాడు మనోరమా, ఆమె తమ్ముడూ ఏదో మార్నింగ్ షోకు పోగా, మేను వాడ్చిన బాలూ, అవకాశాన్ని వుణికి పుచ్చుకుని మనోరమ తండ్రితో సంభాషణ నివృత్తి చేసుకోవాలను కున్నాడు

''ఎన్నప్పటినుండీ మీరు మీ పిల్లల్ని యిలా పెంచారేమి టండీ, ఎవ్వరూ జీవితంలో ఓ బాధ్యత ఫీల్‌కారు. ఎంతసేపూ పైపైన తిరుగుళ్ళు, సరదాలు, షికార్లేతప్ప కష్టపడి పైకొద్దాం, పట్టుగా సంసారం చేసుకుందామనే లక్షణాలే కనిపించవు'' అన్నాడు బాలూ.

మనోరమ తండ్రి నవ్వేడు.

ఈ ప్రాపంచిక సమస్యల్ని అధికమించినవాళ్ళూ, సన్యాసులూ, పిచ్చివాళ్ళూ, జీవితంలో ఓడిపోయినవాళ్ళూ నవ్వే నవ్వు అది.

''ఈ యింటి యజమాని నేను కాదు, మా ఆవిడ. నేను యిల్లరికపు టల్లుణ్ణి. ఈ యిల్లు మా ఆవిడది. ఇంట్లో సామాను ఆవిడవి. నా ప్రవర్తనకు ఆవిడా, ఆవిడ ప్రవర్తనకు నేనూ అడ్డు రాకూడదని చాలాకాలం క్రితమే నిర్ణయించుకున్నాం. ఇప్పటికీ ఆ మాట నిలబెట్టుకుంటున్నాం. మీకు విచిత్రంగా కనపడవచ్చు గాని ఈ అరేంజిమెంటు బలే పనిచేస్తుంది అనవసరమైన బాధ్య తల్ని నెత్తిమీద వేసుకోకుండా వుండటంవల్ల నేను ఎక్కువ సంతోషంగా వుండగలుగుతున్నాను'' అంటో మళ్ళీ నవ్వేడు మనోరమ తండ్రి.

బాలూ నవ్వలేకపోయేడు—మర్యాదకూడా. అతడికి తలకాయ బరువెక్కింది. శరీరం తేలికైంది.

## వార్నింగ్ నెం. 1.

''వాళ్ళు నీకు కావలసిన వాళ్ళయ్యారా?'' అంది మనోరమ.

''ఏమిటో?'' అన్నాడు బాలూ.

''ఇదివరకుగూడా ఒకసారి నువ్వు శాలరీ సెక్షన్‌లో నా జీతం గురించి అడిగావు. నిన్న మా నాన్నను గూడా నా గురించి అడిగా వుట. నీకు అంత అనుమానంగావుంటే నన్నేఅడగొచ్చు. చూడూ,

పెళ్ళికి ముందర నేను నీకు చిలక్కి చెప్పినట్టు చెప్పాను. నన్ను చేసుకోవటం వల్ల నీకు ఇబ్బందులు రావచ్చనీ, నేనేమీ యింట్లో అణిగి మణిగి వుండే పాతకాలం పతివ్రతను కాననీ, ఫ్రీగా, సోషల్‌గా తిరగటం అలవాటైన దాన్ననీ. అప్పుడేమో నువ్వే కావాలి నాకు. నువ్వు లేకపోతే బతకలేను అన్నావు. ఇప్పుడేమో నామీద స్పైయింగ్ చేస్తున్నావు. కాని నాకు నిన్ను చూస్తుంటే జాలి వేస్తున్నది. నా గురించిన సమాచారం కోసం నువ్వెంత కష్టపడుతున్నావని. మూవాళ్లు నీకేం చెబుతారు? వాళ్లకు చాలా మొహమాటాలు, భయాలు. సిగ్గు, ఓడియం. నువ్వు నన్ను పూర్తిగా నమ్ము. అనుమానించకు. అప్పుడు నేను నీకు, నీ భార్య చెయ్యకూడని పనులేవీ చెయ్యనని హామీ యిస్తాను. అంతేకాని, ఇలా నువ్వు వుదయం ఏం చేశావు? మధ్యాహ్నం ఎక్కడున్నావు? సాయంత్రం ఎవరితో మాట్లాడావు? అంటూ అనుమానిస్తూ కూర్చుంటే నీకు నామీద అపోహ పడటానికి కావలసినన్ని సాక్ష్యాలు కనిపిస్తాయి. అందులో ఏవి నిజమో, ఏవి అబద్ధమో నీకే తెలియదు. పైగా అలా అనుమానించే మనుషులకు నిజం అబద్ధంలాగా, అబద్ధం నిజంలాగా కనిపిస్తుంది.''

''నాకు తెలియని వ్యవహారాలు నీకెందుకుండాలి?'' అన్నాడు బాలూ.

''చూడూ, నా ప్రవర్తనలో రహస్య మేమీలేదు. నేనేమీ రంకు చెయ్యటంలేదు కాని ఫ్రీగా మాట్లాడే ఆడదాన్ని అర్థం చేసుకోగలిగే సంస్కారం నీకులేదు. నీకు సినిమాలిష్టం వుండవు. నాకిష్టం. అందువల్ల నువ్వురాకపోయినా నేను సినిమాలకు పోతాను. నువ్వు ఆఫీసులో బిజీగా వుంటావు. నాకు సీట్లోఆట్టే పని వుండదు. అందువల్ల పక్కవాళ్లతో కబుర్లు చెబుతూ కూర్చుంటాను. మామూలేగిదా, మగాళ్లు ఆడాళ్లను చూడగానే కాస్త వెకిలిగా వుంటారు. జోక్సువేస్తారు. నేను నవ్వుతాను. ఒద్దంటే కాఫీ తెప్పిస్తారు. ఒకటి రెండుసార్లు వద్దన్నా చివరికి తీసుకోక తప్పదు. ఆనాడు నువ్వు మాటినీకి రాలేదు చూడు, నేనొక్కదాన్నే వెళ్లాను. మన ఆఫీసు వాడొకడువచ్చి నా వెనకసీట్లో కూర్చున్నాడు. సినిమా హాలు నాది కాదు. నేనెలా వద్దంటాను. మాటలు కలిపాడు. బలవంతంగా మాట్లాడాను. అంతే. కాని ఆ వార్త నీకెలా చేరిందంటే నేనూ, అతడూ కలసి సినిమా కెళ్లామని నువ్వనుకున్నావు. ఇప్పుడు నేను చెప్పినా నమ్మవు''

ఇది విన్న బాలూకు మనోరమమీద పిచ్చికోపం వచ్చింది—చల్లారింది. అసహ్యంవేసింది—అది కూడా క్రమంగా తగ్గిపోయింది. అసూయ కలిగింది—కాని అదీ ఎక్కువసేపుండలేదు. భయం వేసినట్లైంది—ఛీ, భయమెందుకు? అనుకున్నాడు. చివరికి ఆమెకూ తనకూ ఏమీ సంబంధం లేనట్టుగా, ఆమె ఎవరో కొత్త వ్యక్తిగా, అపరిచితురాలిగా కనిపించింది. ఆమె పక్కన తనెందుకు పడుకోవాలో, తామెందుకు కలిసి వుంటున్నారో అతడికి తెలియలేదు. తెలుసుకోవాలనీ అనిపించలేదు. సడెన్‌గా మనోరమ తండ్రి జ్ఞాపకం వచ్చాడు.

## జెలసీలేదు. జాలీగా వుందాం.

ఉదయం పాలమనిషి వస్తే బాలూయే స్వయంగా వెళ్లి తలుపు తీశాడు. ఆ తర్వాత తన పనులన్నీ పూర్తి చేసుకుని, కాఫీవేసి, ఫ్లాస్కులో పోసిపెట్టి, కూరగాయలూ, బియ్యమూ కుక్కర్‌లో పెట్టి స్టౌమీద పెట్టాడు. కుక్కర్ వేసిన ఈలకు మెలకువ వచ్చింది మనోరమకు.

''ఏమిటీ ఈరోజు కొత్తగా?'' అంది.

అది బాలూకు వినిపించిందో లేదో కాని అతడు పేపర్లోంచి తలెత్తలేదు. ఆమె వెళ్లి పేపర్ లాగేసింది. ''గుడ్‌మార్నింగ్'' అన్నాడు బాలూ.

అతని చిర్నవ్వు పొలైట్‌గా వుంది.

''బాగా నిద్ర పట్టిందా?'' అన్నాడు.

''వంటెందుకు చేశావు?''

''ఐదు నిమిషాల పని ఎవరుచేస్తే ఏమిటి? వెళ్ళు మొహం కడుక్కునిరా. క్విక్. కాఫీ ఫ్లాస్కులో వుంది'' అన్నాడు.

ఆమె కాఫీ తాగి, స్నానంచేసి వచ్చేసరికి అతడు డైనింగ్ టేబుల్‌మీద కంచాలు, జగ్‌తో నీళ్లు, గ్లాసులు అన్నీ రెడీగా వుంచాడు. అప్పటికే అతడు డ్రెస్ చేసుకుని వున్నాడు.

మనోరమకు వాతావరణం మారినట్టుగా అనిపించింది. మాట్లాడకుండా భోంచేసింది.

''చూడు డార్లింగ్, నువ్వు త్వరగా డ్రెస్ చేసుకోవాలి. నేను ఆఫీసుకు కాస్త త్వరగా వెళ్లాలి'' అన్నాడు.

''మరీ ఏమిటా తొందర. తొమ్మిదిప్పుడే అయింది. ఆఫీసు పదింటికి. నాకు డ్రెసింగ్‌కు కనీసం అరగంట పడుతుంది'' అంది మనోరమ.

''ఓకె. నువ్వు ఆటోలోనో, బస్‌లోనో వచ్చెయ్యి. నేను వెడుతున్నాను'' అంటూ దగ్గరగావచ్చి ఆమె తలపైకెత్తి ముద్దు పెట్టుకుని గబగబా వెళ్ళిపోయాడు. అతడి నడకలోని అవిహారం, అతడి 'మొక్కుబడి' ముద్దూ చూసి ఆమె బిత్తరపోయింది. అతడు వెళ్లగానే బిగ్గరగా ఏడ్చింది. మొదట ఆఫీసుకు వెళ్లొద్దనుకుంది. కాని వెంటనే ఈ యిల్లు తనదికాదనీ, తనకిక్కడ వుండే అధికారం లేదనీ అనిపించింది. తను కూడా ఆఫీసుకు బయల్దేరింది.

మధ్యాహ్నం దాకా చూసి అతడికి ఫోన్ చేసింది. (వెళ్లి చూడాలంటే భయం.)

''హల్లో మనూ, హౌ ఆర్ యూ?'' అన్నాడు.

''కిందికి రా. లంచికి వెడదాం' అంది.

''సారీ డార్లింగ్. ఆర్. ఎం. దగ్గర పనుంది. నీకు వేరే ఎంగేజ్‌మెంట్ ఏమీ లేకపోతే సాయంత్రం ఐదింటికి స్కూటర్ స్టాండ్ దగ్గర కలుసుకొందాం.'' అంటో ఫోన్‌పెట్టేశాడు.

మనోరమకు గుండె గతుక్కుమంది.

''సాధిస్తున్నాడు'' అనుకుంది.

సాయంత్రం తను స్కూటర్ స్టాండుకు వచ్చి నించున్న పదిహేను నిమిషాలకు కాని అతడు కిందికి దిగిరాలేదు. స్కూటర్ స్టార్ట్ చేస్తూ,

''ఇంటికేనా?'' అన్నాడు.

''లేదు. నన్ను హుసేన్ సాగర్‌లో పారేసిపో'' అంది.

''కలిసే పడదాం పద. నిజంగా వావాళ్ళు వచ్చినా నాకైతే ఎవరూ లేరు. నీకన్నా ఇంకా నీవాళ్ళు, నీ పేరెంట్స్, తమ్ముడు, చెల్లెలు, అభిమానులు ఎందరో వున్నారు'' అన్నాడు.

మనోరమ ఏడుపు ఆపుకోలేక అతణ్ణి చుట్టేసుకుని ''వద్దు బాలూ, అలా అనకు. నీకు కోపంవస్తే నన్ను తిట్టు, కొట్టు, చంపు ఇలా నేనంటే అశ్రద్ధ చూపించకు'' అంది.

బాలూ, ''లేదు డార్లింగ్. కోపం లేదు, అశ్రద్ధ లేదు, జెలసీ లేదు. సరదాగా వుండటమే మనలక్ష్యం గదూ'' అన్నాడు. ఇంటికివెళ్ళగానే తన మాటల్ని రుజువు చేశాడు.

## మనసులోనే మన్మధరాజ్యం

సరే. ఆమె ప్రవర్తన నాకు నచ్చదు. బహుశా నేనంటే ఆమెకు చులకన కావచ్చు. ఇష్టం లేకపోయి వుండవచ్చు. ఆమెను నేను కంట్రోల్ చెయ్యలేను. జరిగేదేదో జరుగుతుంది. ఇలాంటి విషయాలలో కాలమే తన తీర్పు చెబుతుంది. అప్పటిదాకా మేం కలిసివుండక తప్పదు. అదీ సంగతి. మేం కలిసి వుంటున్నప్పుడు, వుండవలసి వచ్చినప్పుడు, వుండక తప్పనప్పుడు నేను ఒకరోజు మాత్రం ఆమెతో ఎందుకు వృథాచెయ్యాలి? మా యిద్దరిమధ్య ఏ సంబంధమూ లేకపోయినా, ఒకరి గురించి మరొకరి కెలాంటి అభిప్రాయమున్నా, నేను ఆమెను పోషించినన్నాళ్ళు, ఈయింట్లో ఆమె వుండగలిగినన్నాళ్ళు ఆమెను నేను వృథాచెయ్యను...మనుషులు పరస్పరం వాడుకుంటారు.

... ... ... ... ...

''మనూ, ఒకర్నొకరు అర్థం చేసుకోవటమంటే ఏమిటి? ఒకరి బలహీనతల్ని ఒకరు ఉపేక్షించెయ్యటం, పరస్పరం సుఖాన్నీ, సంతోషాన్నీ యివ్వగలగటం, యిబ్బంది పెట్టకపోవటం. అంతే కదూ! నీకు వంట చెయ్యటం యిష్టం లేకపోతే నేను చేస్తాను. అలాగే చీటికీ మాటికీ సెలవు పెట్టమని నువ్వు నన్నడగొద్దు. నువ్వు పర్మిషనిస్తే నేను నీకు పిప్పు రుద్దుతాను, జడవేస్తాను.''

మనోరమ నవ్వింది

''అవును. రోజంతా స్ట్రేంజర్స్‌గా గడిపి రాత్రికి మాత్రం పక్కమీద కలుసుకోవాలి.''

''యస్. దట్స్ ది థ్రిల్'' అన్నాడు బాలూ. వెంటనే ఆ మాట పైకన్నందుకు నాలిక్కరచుకున్నాడు ''స్ట్రేంజర్స్‌లో గడపటమే ఎక్కువ ఎక్సైటింగ్‌గా వుంటుంది'' అనుకున్నాడు.

అప్పుడు సాయంత్రం మాత్రమే కావటంతో, ఇటీవల తను అశ్రద్ధ చేసిన విషయాలను, జవాబులు రాయకుండా వదిలేసిన ఉత్తరాలను—అడసు కాగితం కూడా చింపని పత్రికలను ముందు రేసుకుని కూర్చున్నాడు. గత ఆర్నెల్లుగా ఒక్క షేర్‌కూడా కొన నందుకు వరుసగా పడున్న ''ఇన్‌వెస్ట్‌మెంట్ మ్యాన్'' పత్రిక వెక్కిరించింది. పెళ్ళి చేసుకోవటానికి అమెరికానుండి తన కజిన్ బ్రదర్ త్వరలోనే వస్తాట్ట, 'ఇండస్ట్రీలో రేషనలైజేషన్' అనే విషయంమీద తను రాయాలనుకున్న వ్యాసాన్ని గురించి యింకా ఇన్ఫర్మేషన్ సేకరించనేలేదు. తమ హెడ్డాఫీసులో మూడు పి. ఎ. గ్రేడ్ 'బి' పోస్టులు ఖాళీ ఐనాయని తెలిసి అప్లికేషనైతే పడేశాడు గాని తర్వాత ఆర్. ఎమ్.తో ఆ విషయమే 'పర్స్యూ' చెయ్యలేదు. మరిన్నాళ్ళూ తనేం చేశాడు?

అనుభవాలు—ఆనందం—క్షణికమైన అనుభవాలు—అదికూడా తనకై తను అనుభవించగలిగే ఆనందంకాదు. మరొకరితో కలిసి, మరో మనిషి సహకారంతో మాత్రమే పొందగలిగే ఆనందం. ఇందులో తను సాధించిందంటూ ఏం మిగిలింది? మరచిపోగలిగే అనుభవాలు—దాచుకోలేని అనుభవాలు ఎందుకు? నెమరేసుకునే జ్ఞాపకాలు తనకొద్దు. మెరిట్ సర్టిఫికేట్లలో, షేర్లలో, కరెన్సీ కాగితాల్లో దాచుకో గలిగిన సంతోషమే తనక్కావాలి. 'నీ డబ్బు వల్ల వచ్చే సరదాలు కావాలిగాని, నీ డబ్బు సంపాదించే గుణం చెడ్డది' అనే మనుషులు తన కక్కర్లేదు. తన స్టేటస్, బాంక్ అక్కౌంట్ పెరిగితే, ప్రమోషన్లొస్తే రాత్రి ఆనందాలకు మాత్రం కొదవేముంటుంది? కాలం వృథాచెయ్యకూడదు. టైం టేబుల్ తయారుచేసుకోవాలి. కోరికలు తగ్గించుకోవాలి—లేదు, పెంచుకోవాలి.

(ఇంకా వుంది)

శ్రీ ముక్తేవి శ్రీరంగాచార్యులు

# సుబ్రహ్మణ్యకవి విరచిత అధ్యాత్మ రామాయణ కావ్యవిశిష్టత

భారతీయ సాహిత్యానికి బిక్షపెట్టిన ఆదికవి వాల్మీకి స్వతంత్ర కావ్యంగా రామాయణాన్ని రచించిన పిమ్మట వ్యాసుడు బ్రహ్మాండపురాణ అంతర్గతంగా 'అధ్యాత్మ రామాయణం' అను మరొక రామాయణం వ్రాశాడు. వాల్మీకి వ్యాసకృతమైన ఈ రెండు రామాయణాల ఇతివృత్తాలలోనూ పలుమార్పులు ఉన్నాయి వీటిలో 'అధ్యాత్మ రామాయణా'న్నిగూర్చి విపులీకరిస్తాను.

## అధ్యాత్మం అంటే ఏమిటి

వాల్మీకి రామాయణంలోని రాముడు తాను అవతారమూర్తి నని ఎచ్చటా చెప్పుకొనలేదు. సామాన్య మానవునివలే భార్య వియోగానికి దుఃఖించి శత్రువుపై యుద్ధం ప్రకటించాడు. అధ్యాత్మ రామాయణంలోని, రామావతార తత్వమును గూర్చి మానవునకు కలిగే శంకలను నివారించమని పార్వతి మాహేశ్వరుని కోరగా, ఆధ్యాత్మిక తత్వంతో, ఆయా ఘట్టాలను విపులీకరించాడు మాహేశ్వరుడు. ఇందులోని రాముడు సామాన్య మానవునివలెగాక ఆత్మజ్ఞానం పొంది తాను పరమాత్మగానే సంచరించాడు. సృష్టికి ప్రకృతిలేక మహామాయ వికార స్వరూపంగాన సీత 'యోగమాయగా' వివరించబడింది.ఇందులోరామునిగాథంతా లీలానటన.జీవునకు మాయ ఆవరించినపుడు జీవాత్మలు విభిన్నంగా గోచరిoచుననియు, మాయ తొలగగానే ఆత్మజ్ఞానం కలుగుననియు బోధించేజ్ఞానాన్ని'అధ్యాత్మం' అంటారు. ఈ జ్ఞానం లభించుటకు పరబ్రహ్మమైన శ్రీరాముని మీద భక్తికల్గి యుండాలని ఉపదేశించాడు మాహేశ్వరుడు.

## ఇందలి ఇతివృత్తం

బ్రహ్మదు. కోరికపై రావణ సంహారం నిమిత్తం పరబ్రహ్మ రామచంద్రమూర్తిగా భూలోకంలో అవతరించాడు. తన వివాహం జరిగిన పిమ్మట రామచంద్రమూర్తి ఆత్మ స్వరూపాన్ని మరచి అంతఃపురంలో విలాస విహారాలతో గడుపుచుండగా విహార వీథిని నారదుడేతెంచి, తన కర్తవ్యమైన 'రావణ సంహారం' అనే దైవకార్యం గూర్చి హెచ్చరించగా, తోడనే రామునకు ఆత్మజ్ఞానం కలిగి వనవాసం చేయ నిశ్చయించుకొన్నాడు. ఆ తరుణంలోనే సరస్వతి మందరలో ప్రవేశించి పట్టాభిషేకం భంగం చేయుటకు కైకకు దుర్బోధనలు చేసి, ఆమెచేత రామవనవాసం, భరతుని పట్టాభిషేకం జరుగునట్లు చేయించింది. సీతాపహరణ గూర్చి ముందే దివ్యదృష్టితో తెలుసుకొన్న రాముడు పర్ణశాలలో మాయ సీతను ఉంచగా రావణుడు ఆమెనే నిజ సీతగా భావించి అపహరించాడు. లోకవ్యవహారంకోసం అన్నట్లుగా రామచంద్రమూర్తి యుద్ధంచేసి తన కర్తవ్యమైన 'రావణవధను'నెరవేర్చాడు. యుద్ధం ముగిసిన పిమ్మట మాయసీత అగ్నిలో ప్రవేశించగా నిజ సీత అగ్ని నుండి వెలువడుతుంది.

వ్యాస విరచితమైన ఈ గ్రంథాన్ని తెలుగులో 'అధ్యాత్మ రామాయణ కీర్తనలు' అను పేరుతో అనువదించిన సుబ్రహ్మణ్య కవి తన గ్రంథాన్ని 'బాలకాండ'లో రామావతార తత్వమును గూర్చి 'సీతారామాంజనేయ సంవాదం' అనే వేదాంత చర్చతో ఆరంభించి మంగళాంతంలో సమాప్తి చేయదలచి సంస్కృత గ్రంథంలోని ఉత్తర కాండను మినహాయించి రాముడు లక్ష్మణునకు ఉపదేశించిన ఉత్తర కాండలోని 'రామగీత' అనే తత్వమసి సిద్ధాంతంలో నిమిడి యున్న అద్వైత సిద్ధాంత ప్రతిపాదితమైన పరతత్వ నిర్ణయం విపులీకరించటంతో గ్రంథం ముగింపుచేశాడు.

## గేయరచన ఎన్నికలోని ఔచిత్యం

ఆదికవి వాల్మీకి గేయప్రాముఖ్యమును గమనించి తన రామాయణాన్ని కుశలవులచేత గేయరూపంలోనే గానం చేయించి ప్రదర్శింప చేయించినట్లు స్పష్టంగా 'బాలకాండ'లో పేర్కొన్నాడు. కాని నేటి వాల్మీకి రామాయణం అంతా పాఠ్యరూపంలోనే ఉందిగాని గేయరూపంలో ఛాయామాత్రమైనాలేదు. గాన వాల్మీకి గేయ రూపంలో అధ్యాత్మ రామాయణం రచించినాడేమోనని కూడా మనం పరిశీలించవలసి ఉన్నది. ఈ గేయ రూపరామాయణ కొరత నివారణకై కాబోలు మన సుబ్రహ్మణ్యకవి తన అనువాదంలో గేయాన్నే ఎంచుకొని తన కావ్యమును మార్గ విధాన సంపదలో పరిపుష్టి కల్పించాడు.

సంగీత విద్వాంసుల పరిభాషలో గేయమును ధాతువు అనియు మాటలు కూర్పు లేక వాక్కును మాతువు అనియు ఈ ధాతు మాతువులు అనగా సంగీత సాహిత్యాలు చేయగలవాడే వాగ్గేయకారు

డనియు లంటారు. అలాంటి విద్వాంసుడు సంగీతాది కళలయందే గాక చతుష్షష్టి కళలలోనూ నేర్పరి అయి శబ్దాను శాసన అలంకార శాస్త్రములలో పరిజ్ఞానం ఉండాలని శార్ఙ్గదేవుడు తన "సంగీత రత్నాకరం"లో పేర్కొనగా గోవింద దీక్షితుడు ఇంకొక మెట్టు పైకి వెళ్లి, ఆతనికి సంస్కృతమందేగాక దేశ భాషలన్నింటిలోనూ పరిజ్ఞానం ఉండాలని "సంగీతసుధ" అను తన గ్రంథంలో వివరించాడు. ఇంతటి పరిజ్ఞానాన్ని ఘన మునిపల్లె సుబ్రహ్మణ్య కవి కీర్తనల రూపంలో సంగీతాత్మకమైన రచనద్వారా తన 'అధ్యాత్మ రామాయణ గ్రంథం"లో నిక్షిప్తంచేసి ప్రముఖ వాగ్గేయకారుడుగా యశస్సును ఆర్జించుకొన్నాడు. ఈ కవికి సంగీత సాహిత్యాలతోపాటు వ్యాకరణ, తర్క, వేదాంత, వైద్యశాస్త్రములలాంటి పలు విద్యలలో కూడా అపార పాండిత్యగరిమ ఉంది. ఈ బహుముఖ ప్రజ్ఞను కవి తన గ్రంథంలో ప్రదర్శించినందున తెలుగు సాహితీ సుందరవనంలో ఈ గ్రంథం మణిపూసగా వినుతి కెక్కింది. ఈ కావ్యవిశిష్టతను కీ. శే. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ప్రశంసిస్తూ "తెలుగులో పద్య కవిత్వంలో భారతానికి ఉన్నంత విలువ పద కవిత్వంలో అధ్యాత్మ రామాయణానికి ఉన్నదంటే కాదని ఏ విజ్ఞులు అనగలరు? అంత్యనియమాలతో లయపిక్కట్టుగా ఉండే ఈ కీర్తనలు వేదం లాగువ చెప్పుకొనేవారు నా చిన్నతనంలో. ఆ సంప్రదాయం క్రమేణా అంతరించినట్లు కనబడుతుంది" అని తన ఆవేదన వెల్లడించారు. కాండలన్నింటిలో సుందరకాండయు, కీర్తనలలో అహల్యాస్తవం, విభీషణ శరణాగతి సందర్భంలోని విన్నీ; ఇందువదనా, చేరి వినవె; రామాభిరామ; అళినీల కుటిలాల; లాంటి కీర్తనలు ప్రజల మనస్సులో హత్తుకొనిపోయినందున పల్లెలలో వీటిలో కొన్నింటినైనా అప్పుటప్పుట నేటికిన్నీ వింటున్నాము. ఇలాంటి ఉత్తమ కావ్యంలోని విజ్ఞాన పరిమళాన్ని ఒకమారు ఆఘ్రాణిద్దాం.

## గానకళా పారిజాతం

గానమునకు, నాట్యమునకు ప్రథమాచార్యుడు శివుడు గాన ఇందుకు సముచితంగా శివస్తోత్రంతో కవి గ్రంథాన్ని ఆరంభించాడు. మధ్యమకాల సాహిత్య పద్ధతి తొలిగా ఈ కవి తన కీర్తనలలో ప్రవేశపెట్టి దీక్షితాది వాగ్గేయకారులకు మార్గదర్శి అయ్యాడు. ఈ రామాయణ కీర్తనలు అన్నింటినీ ఆఖ్యానాత్మకమైన శైలిలో — అనగా కథ చెప్పుచున్న శైలిలో — రచించి అందుకు అనుగుణమైన అట, త్రిపుట, జంపె, రూపక తాళాలువాడి ఆయా రసాలకు తగిన ధాతుకల్పన చేశాడు. నారాయణ తీర్థులు తన 'కృష్ణలీలా తరంగిణి'లో 153 కీర్తనలకు 37 రాగాలున్నూ లభించిన క్షేత్రయ్య పదాలలో 39 రాగాలున్నూ, ఇలాగే లభ్యమైన త్యాగయ్య కీర్తనలలో 72 రాగాలును ఈ కవులు మేళవించగా ఈ కవి, వీరందరినీ మించి తన 104 కీర్తనలకు 58 రాగాలు వాడాడు. అందులో బాలకాండలోని 17 కీర్తనలకు 17 వేరు వేరు రాగాలు కూర్చాడు. ఒక్కొక్క కృతి ఒక్కొక్క రాగంలో పాడాలంటే ధాతువులో ఎంత అసమాన ప్రజ్ఞ ఉండాలో గాయకు లెల్లరికి విదితమే."

ఇలాగే 'శ్రీరామావతార ఘట్టం'లో కళ్యాణిరాగాన్ని సుందరకాండలో హనుమంతుడు సీతకు రామస్వరూపాన్ని వర్ణించునపుడు ఆర్తిగల యదుకుల కాంభోజి, మాయలేడిని తెమ్మని కోరినపుడు నాయకి, అరణ్యకాండ ప్రారంభంలో దండకవనస్థితి రాములను అగస్త్యాది ఋషులు స్తుతించునపుడు దేవగాంధారి లాంటి రాగములు, సందర్భానికి, కాలానికి తగువిధంగా కూర్చాడు. కవి, లయ, స్వరజ్ఞానానికి యుద్ధకాండలో "తాంకిట తకతకిటరిమరిసరీ, తహత ఝంరిమపథత కుందఝంతారి తథపథమప, తాహతకిటతక, ఝంతారి స్వరి మరీ సనిసరీ సనిధ, తాంతకిట పథమపనిథ పమథళాంగు ధిమితక దధిగిణతోం" అనునవియున్నూ కళ్యాణంలో అప్సరసలు ఆడినసమయంలో "తద్దిన్నాం — తకిటతక, తా॥ థైథైయ" అను జతుల రచనయున్నూ మచ్చుతునకలుగా పేర్కొనబడదగినవై ఉన్నాయి.

కవి, రాముద్రను ప్రయోగించాడు అనగా ఒక పదమే పల్లవి, అనుపల్లవిలో 2,3 సారులు ప్రయోగించుట. ఇలా కల్యాణ సందర్భంలో కళ్యాణిరాగంలో రచించిన కీర్తనలో "కళ్యాణము వినవే, నేడు సీతా కళ్యాణము వినవే" అని పల్లవిలో రెండుసారులున్నూ "కళ్యాణమయమైన, కళ్యాణ నిలయమున కళ్యాణప్రదుడౌ ఆహల్యావరదుని" అని, అనుపల్లవిలో మూడుసారులున్నూ ప్రయోగించాడు. గాయకుడు చరణములుపాడి పల్లవిని ఎత్తుకొనునప్పుడు తన ప్రజ్ఞను కనపర్చుటకు వీలుగా చరణమునకు, పల్లవికిన్నీ వైవిధ్యం కనపరుస్తూ "రజతాచల సదనా, పరిహసిత వినిందితార వింద చంద్రవదనా, కుంద బృంద సుందరరదనా..." మొదలగు శబ్దాలతో శబ్దాలంకారాలు పలుచోట్ల ఇమిడ్చి ప్రయోగించాడు. సంగీతములో వారిచ్చిన విషమగతులు గురువుచే గ్రహింపతగ్గవేగాని తమంతట తాము నేర్చుకొనుటకు అసాధ్యమైనవి. ఈ కవి వాడిన అపూర్వ రాగాలలో లలిత పంచమి, యమునలాంటివి పేర్కొనదగినవి. సంగీత గురువుల సంప్రదాయాన్ని పాటించి యుద్ధకాండలో 'నాట, అరభి, శ్రీ, గౌళ, వరాళి' అను ఘనరాగ పంచకములో వరాళిని విసర్జించి మిగిలినవాటినే వరుసగా కీర్తనలలో రచించాడు. నేను కూడా ఏ గురువు వరుసగా ఈ ఐదు రాగాలు చెప్పడు. త్యాగయ్య సన్యసించినందున ఈ నియమంవీడి వరాళిలో పంచరత్నాలు చెప్పాడు.

## సకల ఉపనిషత్ సారసంగ్రహం

కవికి ఆంధ్ర సంస్కృత భాషలలో గల అపార పాండిత్య ప్రతిభను ఆధారంగా తీసుకొని ఆధ్యాత్మిక జ్ఞాన గాంభీర్యం, భక్త్యావేశం ఉట్టిపడచేసే సమాసాలను గుదిగుచ్చి రచన కొనసాగించాడు. తద్భవదేశ్య శబ్దాలతో నిర్దుష్టమైన భాషలో, చక్కటి జాతీయాలతో ఎన్నయ్య పికిలనను అనుసరించాడు. గ్రంథంలోని తొలి కీర్తన "నమశ్శివాయ తే, నమో భవాయ" లోని అను పల్లవి

పిమ్మట చరణాలలోనూ ఆంధ్ర భాషకు విశిష్టమైన అక్షర మైత్రి రూపమున యతిప్రాసాదులు ద్వితీయ అక్షర ప్రాస, యమకము, అను ప్రాసలు, అంత్యప్రాసలు ఏలా తీర్చి దిద్దాడో చూడండి.

అను పల్లవి "సమానాధి — కరహతీయ శాంతయ, స్వప్రకాశాయ ప్రమోద పూర్ణాయ, భక్తౌఘ, పాలనాయ"
నమశ్శివాయ॥

4 వ చరణము :— నిరుపమానందఘన ।
నిశ్చితాయ శాశ్వతాయ।
వరదా భయంకరణాయ, గిరిశాయ । తరుణేందు, శేఖరాయ, పరమపురుషాయభవ హరణాయ శ్రీ కాళహస్తీశ్వరాయ ॥

5 వ చరణము :— గంగా భంగతరంగ, సఙ్గతజటా జూటాయ, సంగీతలోలాయ శుభ, సఙ్గతాయ । అంగజాంత రంగ— మద, భంగాయ స్ఫటిక కోమలాంగాయ శేషశైలాధీశ మిత్రాయ నమ॥

కవి వ్యాకరణ ప్రయోగాలు కూడా ఇలా తీర్చిదిద్దాడు: కవికి, అలరులములికి, చిలుకలకొలికి, వీనుల సుధజిలికి...మొదలైన శబ్దాలతో శబ్దాలంకారాలను ఇలాగే అంత్య ప్రాసనియమం "బెండు వంటి విల్లు నడిమికి, రెండు చేసి, పెల్లు" అని ప్రారంభించి చివరకు "నా విల్లు దండి వైరులకు ముల్లు" అని ముగించి అంతటితో లోక మహిత దురితాన్ని ఉపక్రమించి చరణాన్ని పూర్తి చేశాడు. ఈ మాదిరి రచనకు దక్షపణం సామాగ్రి ఉండాలనేది పండితులెల్లరకూ విదితమే.

గ్రంథం మొత్తం మీద 5, 6 సన్నివేశాలలో చరా ప్రవాహంగా సమాసాలు నడిపించి సంస్కృత భాషలో గల తన సమాస ప్రజ్ఞను నిరూపించుకొన్నాడు. ఉదాయువు శ్రీరామచంద్రుని స్తవం చేసిన చూర్ణిక చూడండి "శ్రీ మదగణిత — గుణ, మణి గణాలంకృత, రుచి రచిరతర, శుభ స్వరూపం । సకలజన భయావహ మహదజ్ఞాన జనిత కవి కలుషాంధతామిస్ర — నివారక భవ తారక దీపం......" ఇలాగే యుద్ధకాండలో దేవ మునివరు "శ్రీ జగన్నాథ" అను కీర్తనలో "నాది గచ్ఛంలిబుధాః శ్రుతి వాదినస్త్వత్ప్రసాదః వినావిరోధాద్భ్వేలి కాద్దేవ నిశ్చయం॥" శ్రీరామ పట్టాభిషేకంలో బ్రహ్మాది దేవతలు "నమో స్తు శ్రీరామయ" అను కీర్తనలో "శీలాంవిధత్తే గుణైర్యుతం, శ్రిత హతార్థదానాయు, శ్రీలసన్నా నావతారేత్వం, శ్రీ మద్భర్వ ప్రశ్యతే".

ఇలాగే సీత అగ్ని శుద్ధి కాగానే బ్రహ్మ "వందే విష్ణుం విష్ణుమశేషస్థితి హేతుం, త్వామథ్యాత్మజ్ఞానిభి, రంతర్హృది భావ్యం । హేయా హేయద్వంద విహీనం పరమేకంసత్తామాత్రం సర్వహృదిస్థం దృశిరూపం" అను పల్లవితో ప్రారంభించిన కీర్తనలో "నానా శాస్త్రైర్వేద పురాణైః ప్రతిపాద్యం,

నిత్యానందం నిర్విషయం జ్ఞానమనాదిం । మత్వేనార్థం మానుష భావం ప్రతి పన్నం వందేరామం మరకతవర్ణం మధురేశం'' లాంటి చరణములతోనున్నా కూర్చిన స్తుతులు కవికి సంస్కృతములో గల పాండిత్య ప్రతిభను తెలియజేస్తున్నాయి. అయా ఘట్టాలలో భక్తి రసం కూడా పరమావధి పొందించాడు కవి. యుద్ధ కాండలో బల్లెములన్న గేయాలు వ్రాశాడు.

ఇక తెలుగు భాషలో కవికి గల ప్రాజ్ఞతను పరిశీలిస్తే, శ్రీరామచంద్రమూర్తి జననం, శైశవ లీలను, కౌసల్యా దశరథుల లాలింపులు కమ్మటి తేట తెలుగు నుడిగారంతో 'ముద్దులొలుకు మాటలతో' అతి రమణీయంగా ఇలా వివరించాడు:

జననము ''అంనల్ల కలువఱేకుల చాయమేనిచే ।
జెలగు వాని పసిడి, చేలగట్టిన వాని ।
వెలయు నాల్గు భుజ, ముల వాని కనుగొల్కుల నరుణ
రేఖల, కలవాని స్వర్ణకుం ।
డల లసిత గండమండలముల వానియు, స్ఫురితరవి కోటి
ప్రకాశుని రత్నా ।
జ్వల కిరీటము వాని, నళినీల కుటిల కుండలములచే
ముద్దు, గులుకు చుండెడివాని ॥ శ్రీరాముని॥
శైశవము.''చిన్నారి బొజ్జలో నన్ను, గన్నవాడా నా పాలిటి
పెన్నిధాన మరారా, ఓరి నా చిన్ని ।
యన్న, బూచి వచ్చేరారా, పరుగెత్తవల ।
దన్న నాతో నలుగమేరా, పాట బాడుచు ।
నిన్ను లాలీయూచేరారా లాలబోసేనూ ।
మన్ను చేతనంట వద్దు వెన్న బెట్టేననుచు చాలా ।
మన్నించి పలుకు కౌసల్యకు, మరులు రెట్టింపజేయు
శ్రీరాముని''.

ఇలాగే కథా ఘట్టమును, పాత్రలను సూటిగా వర్ణించుటకు సీతను స్వయంవరం సందర్భంలో అలంకరించి జనకుని కొలువు కూటము ప్రవేశమునకై తోడి తెచ్చినప్పుడు వాడినశైలి ఇలా అస మానంగా నడిచింది:

''పట్టుచీరె గటిగట్టి రవికె పనుకట్టు
దిట్టముగగట్టి మృగమదము, బొట్టు నుదుట
నువిచి కనుల కాటుక, బెట్టి కురులుదువ్వి దట్టముగా
కీల్మ్మడివైచి మణిన్, మట్టుమీర వేడుకచే సరములు ।
జొట్టి స్వర్ణభూషణములు మేనను, దట్టముగా బగాని
యొక్కచెలికేల్ బట్టి, జనకునిపట్టి శౌరికి పట్టంపు
రాణినౌదువేనని, బాలితోడ గందనపు బొమ్మవలె ।
నెట్టనరాజ—మరాళకరిగతుల, నెరా నిరాకరింపుచు
నడిచెను ॥వినీల॥

అధ్యాత్మ తత్వమును గూర్చి పేర్కొనాల్సివస్తే, బాల కాండలోని 'సీతారామ మారుతీ సంవాదం'లో రాముడు అంజనేయునకు ఆత్మానాత్మ పరమాత్మ తత్వములుగూర్చి ''నమతను ఆత్మా నాత్మ పరమాత్మల జాడలు త్రివిధములు । పవనజ మమతాహం కార కర్తృత్వముల, మరిన యది యాత్మ । రమణ వస్తుతజడ దుఃఖములనునీ, రసమయినది యనాత్మ, నిత్యము । వినులను సత్యజ్ఞానానందాత్మక మిదియె పరాత్మ, మహాత్మా॥

అకాశము త్రివిధంబయినట్లుప, రాత్మ
త్రివిధమాయె. తెలియంగ । నైకముగాను పరాకాశ్రము
ఐ, లాశయ బింబితమైన । చేకొని తదవచ్ఛిన్నాకాశము.
వెలిగి భిత్తియందు, నేతయు । ప్రాకటముగ
నిటు ప్రతిబింబితమై ప్రబలినదీవాయు । శ్రీరామాంజనేయు॥

లని ప్రారంభించి ఆ పిమ్మట చరణములలో ఇంకా విపులీకరించాడు ఇలాగే శ్రీరామ తత్వాన్ని హనుమంతుడు రావణునకు వేదాంత పరంగా తెలియజేసిన ఘట్టాలుకూడా పేర్కొనతగినవై ఉన్నాయి విభీషణుని కృతులు, విశ్వామిత్ర కృతులలోని పాటలు శుద్ధాద్వైత ప్రతిపాదితమైన శ్రుతివాక్యాలు అట్లు ఉన్నాయి. సుతీక్ష్ణుడు శ్రీరాముని పరబ్రహ్మగా నుతించే సమయంలోనూ, అహల్యా, జటాయువుల స్తవములలోనూ భక్తిరసం పరిపుష్టి చెందింది ఈ రచనలు గమనిస్తే కవి కేవలం వేదాంత విద్వాంసుడేగాక ఆత్మ నిష్ఠగల యోగి అనికూడా రూఢి అగుచున్నది ఇలా భక్తి వేదాంత ప్రబోధిత గ్రంధమైనా ''ఇంతి, చెంగల్వబంతి, వినవే, శార్వాణి, అలివేణి, కామలీలా, కార్ముక విజయభ్రూలతా'' మొదలగు శృంగార రసాత్మికమైన మోహన పదజాలాన్ని పలు కీర్తనల పల్లవులలోనూ, చరణములలోనూ పోతనాదుల ననుసరించి ప్రయోగించాడు. కిష్కింధా కాండలోని పిండోత్పత్తి విధానం గమనిస్తే ఈ కవికి వైద్యశాస్త్రంలోకూడ పరిజ్ఞానమున్నట్లు బోధపడగలదు. గ్రంథాన్ని ఇలా ఆదినుంచి తుదివరకు పరిశీలిస్తే కవి బాలకాండలో చెప్పుకొన్నట్లు ఈ గ్రంథం అఖిల వేదాంతసార సంగ్రహం అనుటలో ఎట్టి సందేహమూ లేదు.

## ము గిం పు

ఇట్టి అమూల్య సంపదతో విరాజిల్లుతూఉన్న ఈ కవి విరచిత అధ్యాత్మ రామాయణ కీర్తనలు కూచిపూడి భామా కలాపమువలె భావానుగుణ్యంగా నృత్యప్రదర్శనద్వారా అభినయిస్తే అత్యంత శోభాయమానంగా ఉంటాయి. సంగీత శాస్త్రములో బహుముఖ ప్రజ్ఞనార్జించి ఈ కీర్తనల ప్రదర్శన భావానుగుణ్యంగా, ప్రాచీన భణితిని, నిర్వహింపగలిగిన నాట్యశాస్త్ర కోవిదులు బహుకొద్దిమందే. నేటికిన్నీ సజీవులై, వార్ధక్యంలో ఉన్నారు. వారితోనే ఈ శాస్త్రం అంతరించకముందు రాష్ట్ర ప్రభుత్వం వెంటనే ఈలాంటి నాట్యకోవిదుల సహకారంతో నాట్యవిభాగపు సిలబస్సుకు తుదిరూపు ఇచ్చి రాష్ట్రప్రభుత్వ కళాశాలతో ఈ కీర్తనలకు శిక్షణ తరగతులను నిర్వహించుటకు పూనుకోవాలి. రాష్ట్ర సంగీత నాటక అకాడమీ, ఆల్ ఇండియా రేడియో లాంటి సంస్థలుకూడా ఈ కార్యక్రమాలు కూచిపూడి యక్షగానాలువలె నిర్వహించి ప్రచారంలోనికి గొనితెస్తే సుబ్రహ్మణ్యకవి ఆశయ, ఆదర్శాలను సఫలీకృతంచేసిన వారను అయ్యెద మని మనవి చేస్తున్నాను.

భవిష్యత్తులో ఆర్థికాభివృద్ధి, ఆర్థిక సాంఘికమార్పుకు దారి తీయవలెను. హెచ్చు ఆర్థికాభివృద్ధిని సాధించుటయే గాక, అన్ని రంగాల అభివృద్ధి ద్వారా, ప్రజలు అభివృద్ధి కార్యక్రమాలలో ఎక్కువగా పాల్గొనుట ద్వారా దారిద్ర్యాన్ని రూపుమాపవలెను. ఈ లక్ష్యాలను సాధించాలంటే ప్రణాళికా వికేంద్రీకరణ (డిసెంట్రలయిసేషన్ ఆఫ్ ది ప్లానింగ్ ప్రాసెస్) ప్రజలలో 70 శాతం ఆధారపడే వ్యవసాయ రంగానికి అన్నిరంగాల కంటే ఎక్కువ ప్రాధాన్యత, ప్రజావసరాలను దృష్టిలో వుంచుకొని పారిశ్రామికీకరణ అవసరమని జనతా ఆర్థిక విధానము తెలిపినది.

గతంలో అభివృద్ధి దారిద్ర్యాన్ని నిర్మూలించలేకపోవుటకు ముఖ్య కారణం అభివృద్ధిరేటు తక్కువగా వుండుటే. గతంలో సగటు అభివృద్ధిరేటు 3.5 శాతం, సగటు ఆదాయం పెరుగుదల 1 శాతం మాత్రమే. ఈ కారణంగా అభివృద్ధి రేటును 7 శాతంకు పెంచుటకు ప్రభుత్వం నిశ్చయించినది. పొదుపు శాతం పెంచి, వివిధ రంగాలలో చెప్పకోదగిన రీతిలో పెట్టుబడిని పెంచుట ద్వారా మాత్రమే ఇది సాధ్యము. దేశంలో అనవసరపు వినియోగము తగ్గించనిదే, దారిద్ర్య నిర్మూలనా పథకం విజయవంతంకాదు. ప్రణాళిక అభివృద్ధికి, మార్పుకు అవసరమే. అయితే, వికేంద్రీకరణ లేనిచో ఆశించిన ఫలితాలను సాధించలేము. ప్రణాళిక అభివృద్ధిలో ఈ కారణంగా గ్రామ పంచాయితీలు, జిల్లా పంచాయితీలు ఎక్కువగా పాల్గొనాలి. అంతేకాదు, ప్రణాళికా లక్ష్యాలకు తగినట్లుగా కృషి వుండాలి గాని, కృషికి తగినట్లుగా ప్రణాళికా లక్ష్యాలను మార్చరాదని నూతన ఆర్థిక విధానం గట్టిగా చెప్పచున్నది.

నూతన ఆర్థిక విధానంలో హర్షించదగిన మార్పు వ్యవసాయ రంగానికి అత్యధిక ప్రాధాన్యత ఇచ్చుట. దీనికి కారణం, గతంలో వ్యవసాయరంగం అభివృద్ధి ప్రోత్సాహకరంగా లేకపోవుటయే గాక, ప్రజలలో ఎక్కువ శాతం ఆ రంగంపై ఆధారపడుట. వ్యవసాయ రంగం అభివృద్ధి చేయనిదే గ్రామీణ దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని నిర్మూలించలేము. గ్రామీణ రంగానికి ప్రభుత్వ రంగ పెట్టుబడి వనరులలో 40 శాతం (పూర్వం 30 శాతం మాత్రమే) కేటాయించుట జరిగినది. ముందు ముందు ఈ శాతాన్ని పెంచుట జరుగును. గ్రామీణ బ్యాంకులు లాంటి సంస్థలను స్థాపించినప్పటికి సంస్థల ద్వారా లభించే ఋణాలు మొత్తం పరపతి అవసరాలలో (క్రెడిట్ రిక్వయిర్‌మెంట్స్) 35 శాతం మాత్రమే. ఈ కారణంగా సంస్థల ద్వారా ఋణాలను పెంచడమే కాకుండా, గ్రామీణ ప్రాంతాలలో సేకరించిన డిపాజిట్లను గ్రామీణాభివృద్ధికే వినియోగించవలసిన అవసరం వున్నది. మొత్తం భూమిలో 25 శాతానికి మాత్రమే నీటి పారుదల వసతులు గలవు. విద్యుచ్ఛక్తికి, హెచ్చు దిగుబడినిచ్చే విత్తనాలకు అత్యధిక ప్రాధాన్యత ఇచ్చుట జరిగినది

వ్యవసాయ రంగంలో ఉత్పత్తి వ్యయం తగ్గించి రైతుకు తగిన ప్రోత్సాహం కల్పించాలి. వ్యవసాయ రంగంలో వుపయోగించే ఎరువులు లాంటి ఉత్పాదకాలు (ఇన్‌పుట్స్) పై ఎక్సైజు పన్ను తగ్గించాలని, మూడు సంవత్సరాలలో పూర్తిగా నిర్మూలించాలని నూతన ఆర్థిక విధానం సంకల్పించినది. రైతులు తాము పొందే ధరలకు, తాము ఇచ్చే ధరలకు సమన్వయం వుండాలి. అంటే వ్యవసాయ వస్తువుల ధరలు బాగా తక్కువగా వుండి, ఇతర వస్తువుల ధరలు పెరిగే పరిస్థితి వుండరాదు. అంతేకాదు, వ్యవసాయ రంగంలో వ్యవస్థా పూర్వకమైన మార్పులు (ఇన్‌స్టిట్యూషనల్ చేంజెస్) అవసరం ఎంతైనా వుంది. భూసంస్కరణలు ఇప్పటి వరకు రాజకీయ కారణాలుగా అమలుపరచలేదు. ఈ కారణంగా గ్రామీణ పేదలకు వ్యవసాయంపై ఉత్సాహం సన్నగిల్లుచున్నది. కేవలం భూమే అందరికి ఉపాధి కల్పించలేదు. కాబట్టి, గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయేతర రంగాల అభివృద్ధి ముఖ్యంగా పారిశ్రామికీకరణ ఆవశ్యకత ఎంతైనా వుంది. పని పూర్తిగా లేని శ్రామికులను గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో వినియోగించాలి. భవిష్యత్తులో వీరిని వ్యవసాయేతర రంగాలకి తరలించాలి.

ప్రస్తుత అభివృద్ధి దశలో ప్రభుత్వరంగ ప్రాధాన్యత బాగా వున్నది. ఈ కారణంగా, ఈ రంగం సమర్థవంతంగా పనిచేసి వ్యవసాయ, చిన్న తరహా, కుటీర పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడాలి ఆర్థిక వ్యవస్థలో పెట్టుబడిస్థాయిని పెంచవలసిన అవసరం వుండుటచే ప్రభుత్వ రంగం మిగులును (సర్‌ప్లస్) సంపాదించుటలో ప్రత్యేక కృషి చేయాలి. ఇందుకు తగిన ధరల, ఉత్పత్తి విధానాలను అది అవలంబించాలి

నూతన ఆర్థిక విధానంలో ప్రశంసనీయమైన వేరొక విషయం చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధిలో ప్రత్యేక శ్రద్ధ. నిరుద్యోగ సమస్యను నిర్మూలించుటలోను, అభివృద్ధి, సంపద వికేంద్రీకరణలోను చిన్న తరహా రంగానికి ప్రత్యేకత వుండుటచే వాటికి అన్ని విధల ప్రోత్సాహం కల్పించాలి. అయితే, ఈ చిన్న తరహా రంగం అనేక సంస్థలపై ఆధారపడుటకంటె, ఒకే ఒక సంస్థ (సెంట్రల్ ఏజెన్సీ) ద్వారా సహకారం (గయిడెన్స్)పొందుట అవసరం. చిన్న తరహా పరిశ్రమలపై కొన్ని బాధ్యతలు కూడా వున్నవి: వస్తు నాణ్యతను మెరుగుపరచి, ఉత్పత్తి ఖర్చులను తగ్గించుటయేగాక, సామాన్య ప్రజలు వినియోగించే వస్తువులను అత్యధికంగా ఉత్పత్తి చేయాలి. చిన్న తరహా పరిశ్రమ ఉత్పత్తి చేయగలిగినది పెద్ద తరహా పరిశ్రమకు ఇచ్చుట జరుగదు. అలాగే, కుటీర పరిశ్రమ ఉత్పత్తి చేయగలిగినది, చిన్నతరహా పరిశ్రమకు ఇచ్చుట జరుగదు. ఇది జనతా పారిశ్రామిక విధానం యొక్క ముఖ్య లక్ష్యము. గత అనుభవం తెలిపేదేమిటంటే, కొన్ని వస్తువుల ఉత్పత్తి పూర్తిగా చిన్నతరహా పరిశ్రమలకు (పెద్దతరహా పరిశ్రమలకు కాకుండా) ఇవ్వనిదే అవి అభివృద్ధి చెందే అవకాశాలు వుండవు. కొన్ని వస్తువుల ఉత్పత్తి చిన్న పరిశ్రమలకు అప్పజెప్పి, వాటికి అధునాతన యంత్ర పరికరాలు, ఉత్పత్తి పద్ధతులు, పరపతి సౌకర్యాలు, ముడి పదార్థాల, మార్కెటు సౌకర్యాలు కల్పించవలెను.

గతంలో లైసెన్స్ పద్ధతి పారిశ్రామిక వికేంద్రీకరణకు **తోడ్పడలేదు.** ఈ కారణంగా ఆర్థిక విధానం, పట్టణ ప్రాంతాలలో పరిశ్రమల స్థాపన నిలిపివేసి, గ్రామీణ ప్రాంతాలలో పెట్టుబడిని ఆకర్షణీయం చేయదలచినది. రైల్వే లైనుల నిర్మాణం, నీటిపారుదల ప్రాజెక్టులు, రోడ్లు వేయుట, ఇండ్లు కట్టుట వీటికి ప్రాధాన్యత ఇవ్వాలి. ఉద్యోగావకాశాలు పెరుగుటయేగాక ఉక్కు మొదలగు వస్తువులకు ఇవి గిరాకి కల్పించగలవు. అయితే, ఆడంబరములకు భవనాలను నిర్మించుట మానుకొనవలెను.

ఎగుమతుల అభివృద్ధికి ప్రోత్సాహం కల్పించినప్పటికీ, అత్యవసర వస్తువుల కొరత ఏర్పడకుండా చూడవలెను. ఆర్థికాభివృద్ధి వ్యూహమునకు తగినట్లుగా ఎగుమతి–దిగుమతి విధానము వుండాలి. వ్యవసాయ ప్రాధాన్యత, ఉద్యోగావకాశాలు కల్పించేపారిశ్రామికీకరణను దృష్టిలో వుంచుకొనవలెను. అత్యవసర పరిస్థితులలోనే విదేశీ పారిశ్రామిక వేత్తలతో చేతులు కలుపుట (ఫారిన్ కొలాబరేషన్) జరుగును. అటువంటి సహకారం మన పరిశ్రమల అభివృద్ధికి ఆటంకంగా వుండరాదు. మన అవసరాలకు తగిన ఉత్పత్తి పద్ధతులను అవలంభించవలెను. అందుకు సంబంధించిన పరిశోధనను ప్రోత్సహించవలెను. ఈ విధంగా విదేశీ మూలధనం, ఉత్పత్తి పద్ధతులపై ఆధారపడటాన్ని తగ్గించవచ్చును.

ప్రణాళికలు, లైసెన్సు పద్ధతి వున్నప్పటికి మన దేశంలో పారిశ్రామిక ఉత్పత్తి 20 పెద్ద సంస్థల చేతులలో కేంద్రీకరించబడినది. ఈ సంస్థలకు గత ప్రభుత్వంలో సన్నిహిత సంబంధం వుండుట కూడా ఈ పరిస్థితికి కారణము. ఇకముందు ఈ సంస్థల విస్తరణకు అవకాశములు కల్పించరాదు. కొత్త వస్తువులను కొత్త పద్ధతుల ద్వారా వెనుకబడిన ప్రాంతాలలో స్థాపించే కొత్త వారికి ప్రభుత్వం మంచి ప్రోత్సాహం భవిష్యత్తులో కల్పించగలదు.

అత్యవసర వస్తువుల ధరలు కూడా విపరీతంగా పెరుగుట వలన సామాన్యులు అనేక ఇబ్బందులకు గురి అగుచున్నారు. ఈ వస్తువుల ఉత్పత్తి విషయంలో ప్రత్యేకశ్రద్ధ తీసికొనినచో ధరలను అదుపులో వుంచుట సాధ్యపడును. ప్రభుత్వ పంపిణీ వ్యవస్థ(పబ్లిక్ డిస్ట్రిబ్యూషన్ సిస్టమ్) ను విస్తృత పరచవలసిన అవసరం వున్నది. ధరలను తగ్గించుటకు కొన్ని చర్యలు అవసరం. ఇవి: (1) ద్రవ్యసప్లయిని అదుపులో వుంచుట; (2) అత్యవసర వస్తువులు ఉత్పత్తిచేసే వారికి తగినప్రోత్సాహం కల్పించుట (3) బాగా కొరత ఏర్పడిన వస్తువులను సకాలంలో దిగుమతి చేసికొనుట. (4) గ్రామీణ ప్రాంతాలకు కూడా ప్రభుత్వ పంపిణీ వ్యవస్థను విస్తృతము చేయుట. (5) అక్రమ లాభాలు పొందే వర్తకులపై కఠిన చర్యలు తీసికొనుట.

మనలాంటి అభివృద్ధి చెందుచున్న దేశంలో పన్నుల విధానంనకు అదనపు వనరులను సమకూర్చుటలో ప్రత్యేక స్థానం వుంది. ఇందుకు తీసికొనవలసిన చర్యలు (1) ప్రభుత్వ పెట్టుబడి పెరిగినపుడల్లా ప్రభుత్వానికి వచ్చే ఆదాయము పెరగవలెను. ఈ విషయంలో అదనపు పన్నుల భారాన్ని మోయుటకు ప్రజలు సిద్ధంగా వుండవలెను. (2) అన్ని వర్గాలమీద పన్నుల భారం సమానంగా వుండాలి. అంతేకాకుండా పన్నుల విధానం ఆదాయ వ్యత్యాసాలను తగ్గించాలి. (3) పన్నులను వసూలుచేయు పద్ధతిని సులభతరం చేయవలెను. (4) పన్నులవిధానము అభివృద్ధికి, పొదుపుకు సహాయపడాలి.

జనతా ఆర్థిక విధానంలో కొన్ని మంచి లక్షణాలు (వ్యవసాయ, చిన్న తరహా పరిశ్రమల ప్రాధాన్యత) వున్నప్పటికీ, మన అత్యవసర సమస్యల పరిష్కారానికి ఈ విధానం ఎంతవరకు తోడ్పడగలదో అనుమానమే. ఇంతకుముందు చెప్పినట్లు మన ముఖ్యమైన సమస్యలు దారిద్ర్యము, నిరుద్యోగము ఆర్థిక అసమానతలు. ఆర్థిక విధానం పూర్తిగా అమలు జరుపుటలో ఇబ్బందులున్నప్పటికీ, ఈ అత్యవసర సమస్యల పరిష్కారం గురించి తీవ్రమైన పరిశీలన అవసరం. ప్రణాళికా వికేంద్రీకరణ అవసరమే. ప్రణాళికా ఫలితాలు గ్రామాలకు కూడా చేరాలి. అయితే, ఈ లక్ష్యాన్ని సాధించుటలో పరిపాలన నిర్వహణలో రావలసిన మార్పులు, స్థానిక సంస్థల బాధ్యతలు ప్రాధాన్యత ముఖ్యమైనవి. ఈ విషయంలో నూతన ఆర్థిక విధానం తగిన శ్రద్ధ చూపలేదు. గతంలో కూడా భూసంస్కరణలు మొదలగు ఆర్థిక సంస్కరణలు విఫలమగుటకు కారణం, వాటిని అమలు పరచుటలో వున్నలోపమే. సహకారసంఘాలు, పంచాయితీలు ఎంతవరకు క్రొత్త పరిస్థితులను, సమస్యలను, అవగాహన చేసికొని పరిష్కరించ గలవు అనునది అనుమానమే. రైతులకు కావలసిన ఉత్పాదకాలను సమకూర్చుటకు నూతన ఆర్థిక విధానం గ్రామీణాభివృద్ధి కేంద్రాలను (రూరల్ డెవలప్‌మెంట్ సెంటర్స్) స్థాపించదలచినది. అయితే, ప్రస్తుతంకూడా వాణిజ్య బ్యాంకులు, గ్రామీణ బ్యాంకులు, సహకార సంఘాలు మరి ఇతర సంస్థలు ఈబాధ్యతను నెరవేర్చుచున్నవి. వీటి కార్యకలాపాలను సమన్వయ పరచవలసిన అవసరం వున్నది.

ఆర్థిక విధానంలో ముఖ్యమైన దేమిటంటే, వ్యవసాయదారులకు, చిన్న తరహా పరిశ్రమలకు సమకూర్చే ప్రత్యేక సౌకర్యాలు ఆశించిన ఫలితాలు సాధించాలి. గతంలో ఇలా జరుగలేదు. ఉదాహరణకు, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి పారిశ్రామిక క్షేత్రాలు (ఇండస్ట్రియల్ ఎస్టేట్స్) ఏర్పరచినప్పటికి అవి మంచి ఫలితాలు సాధించలేదు. (భారతి, డిశంబరు 1977 చూడండి) దారిద్ర్య నిర్మూలన జరగాలంటె మన ఉత్పత్తి విధానంలో తీవ్రమైన మార్పు రావాలి. ఇందుకు ప్రభుత్వం తీసికొనే చర్యలు విపులీకరించలేదు. అందువలన, అనవసరపు వస్తువుల ఉత్పత్తి పెరిగి, అత్యవసర వస్తువుల ఉత్పత్తిలో మార్పులేని ప్రమాదం ఉండవచ్చు. గ్రామీణ ప్రాంతంలో నిరుద్యోగులకు శాశ్వతంగా ఉద్యోగావకాశాలు కల్పించుటయేగాక వారు వస్తూత్పత్తిని పెంచుటకు తోడ్పడవలెను. అంటే, గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఉత్పాదకతను పెంచవలెను. ఈ విషయంలో కూడా ప్రభుత్వం సరియైన వ్యూహాన్ని (స్ట్రాటజీ) చూపించలేక పోయినది.

నూతన ఆర్థిక విధానం 7 శాతం అభివృద్ధి రేటును సాధించుటకు కృషి చేస్తారట. గతంలో ఈ శాతం 3.5 మాత్రమే. 7 శాతం అభివృద్ధి రేటు సాధించుటకు ప్రభుత్వం ఏవిధంగా ఆర్థిక వనరులు సమకూర్చుకోగలదో వివరించలేదు. గ్రామీణ రంగంలో మిగులును (రూరల్ సర్‌ప్లస్) ఉపయోగించుటలో గత ప్రభుత్వం విఫలమయినది. ప్రస్తుత ప్రభుత్వం కూడా రాజకీయ పరిస్థితుల వల్లనైనా అలా ప్రవర్తిస్తే 7 శాతం అభివృద్ధి రేటు సాధించుట జరుగదు. అంతే కాదు, అభివృద్ధి రేటు హెచ్చుస్థాయిలో వుండుటకంటె, ఆ అభివృద్ధి ఎలా సాధించాము అన్నది ముఖ్యము. అభివృద్ధి రేటు ఎక్కువగా వున్నా, అనవసరపు వస్తువులు ఎక్కువగా ఉత్పత్తి చేసినా, అభివృద్ధి ఫలితాలు కొంతమందికే దక్కినా ప్రయోజనం ఏమున్నది? అదేవిధంగా గ్రామీణరంగాన్ని ప్రభుత్వ పెట్టుబడి వనరులలో 40 శాతం కేటాయించుట మంచిదే. అయితే, పెట్టుబడి తీరు ఈ రంగంలో ఎలా వుండాలో కూడా నిర్ణయించాలి లేకపోతే అధిక పెట్టుబడి ప్రయోజనాలు సన్నకారు రైతులకు, వ్యవసాయ కార్మికులకు గతంలోలాగే చేరక పోవచ్చును. బ్యాంకు పరపతి కూడా పెద్ద భూస్వాములే ఎక్కువగా ఉపయోగించుట గతంలో జరిగింది.

నూతన ఆర్థిక విధానం భూ సంస్కరణల విషయంలోను, మిగులు భూమి పంపకంలోను తగు శ్రద్ధ చూపిస్తున్నట్లు కన పడదు. ఈ రెండు సమస్యలను అతి త్వరగా పరిష్కరించనిదే గ్రామీణ బీద ప్రజల ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచే అవకాశం లేదు. వ్యవసాయ కార్మికుల విషయంలో కనిష్ఠ వేతనాలను (మినిమమ్ వేజెస్) చిత్తశుద్ధితో అమలు పరచవలసిన అవసరం వున్నది. గ్రామీణ పేదల కొనుగోలుశక్తి (పర్చేసింగ్ పవర్) పెంచుట అత్యవసరం.

ప్రైవేటు రంగంలో పెట్టుబడి వనరులు తక్కువగావున్న సమయంలో కేవలం డివిడెండ్లు, బోనసు, ఇతర పారితోషికాలు పెంచుకొనుటకు అనుమతించుట ఈ రంగపు సమస్యలను ప్రభుత్వం పరిష్కరించినట్లు కాదు, ఇదే కాకుండా పారిశ్రామిక ఉత్పాదకశక్తిని తగ్గించే ప్రయత్నం కూడా జాగ్రత్తగా జరగవలెను. నూతన ఆర్థిక విధానం ప్రభుత్వ రంగానికి ప్రాధాన్యత ఇచ్చినా ఈ రంగము మిగులును (సర్‌ప్లస్) ఏర్పరచుకోనవలెనని అందుకు తగిన ధరలు, ఉత్పత్తి విధానాన్ని ఏర్పరచుకోవలెననుటలో ప్రమాదం లేకపోలేదు. ఎందు కంటె, ప్రస్తుత అభివృద్ధిస్థాయిని దృష్టిలో వుంచుకుంటే ప్రభుత్వరంగం లాభాలు పొందుట కాకుండా, ఇతర సాంఘిక, ఆర్థిక ప్రయోజనాలు సాధించవలసి వున్నది. అదనపు ఆర్థిక వనరులకు ఇతర మార్గాలు అన్వేషించవలెనేగాని ప్రభుత్వరంగంపై ఆధార పడుట వాంఛనీయము కాదు. గుప్తధనము పెరుగుదలను అరికట్టుట ద్వారా అదనపు వనరులు సమకూర్చుకొనవచ్చునే. మన విదేశీమారక ద్రవ్యము 4000 కోట్ల రూపాయలు దాటినది. దీనిని ఏ విధంగా ఉపయోగించేది నూతన ఆర్థిక విధానము తెలుపలేదు. అదేవిధంగా మిగులు ఆహార ధాన్యాలను వినియోగించుటకు కూడా ఒక పథకం అవసరం.

నూతన ఆర్థిక విధానం అనుకున్న ప్రయోజనాలు సాధించ వలెనంటే ఉత్పత్తి తీరు సామాన్య ప్రజలకు అనుగుణంగామార్చాలి; వ్యవసాయరంగంలో వ్యవస్థాపూర్వకమైన మార్పులు (భూసంస్క రణ లాంటివి) రావాలి; సన్నకారు రైతులకు వ్యవసాయపు ఉత్పాద కాలను ఎక్కువగా సమకూర్చాలి; ఎక్కువగా ఉపాధి కల్పించే అభివృద్ధి పథకాలకు అత్యధిక ప్రాధాన్యత ఇవ్వాలి; అన్ని రంగాలపై తగురీతిలోను పన్నులువేసి ప్రభుత్వ ఆర్థిక వనరులు పెంచాలి; గుప్తధనం పెరుగుదలను అరికట్టాలి; ఆదాయ, సంపద వ్యత్యాసా లను తగ్గించాలి. ఇందుకు జీతవేతనా–ఆదాయ విధానం కూడా అవసరం. ఒకమాటలో చెప్పాలంటే, దారిద్ర్యముపై ప్రత్యక్షదాడి అవసరం.



శ్రీ ఖండవల్లి లక్ష్మీ రంజనం
శ్రీ చొప్పకట్ల సత్యనారాయణ

# శబ్ద పల్లవ క్రియలు

'ఆంధ్ర ధాతు కథా సాగరము' అను సర్వస్వానికి ధాతువులు సేకరించే సందర్భంలో శబ్ద పల్లవ ధాతువులు విస్తారంగా కనిపించాయి. శబ్ద పల్లవాల తత్వం ఏమిటి ? అవి యెట్లా నిర్మాణం అవుతున్నాయి? ఎందుకు నిర్మితమవుతన్నాయి ? వాటి ప్రయోజనమేమి ? ఇతర భాషల్లో ఈ ప్రక్రియ గలదా ? ఏ ప్రయోజనం కోసం శబ్ద పల్లవ క్రియలు తెలుగులో ప్రవృత్తం అవుతున్నాయో, ఆ ప్రయోజనాన్ని ఇతర భాషలు ఏ మార్గమున సాధిస్తున్నాయి ? మనకు ఎక్కువగా ప్రసక్తమైనది సంస్కృత భాష, సోదర ద్రావిడ భాషలలో ప్రధానమైన తమిళ, కన్నడ భాషలు, కొంత వరకూ ఆంగ్లము, ఈ భాషల్లో శబ్ద పల్లవ క్రియా విధానము ఉన్నదా? ఉంటే ఎట్లా పని చేస్తుంది ? మొదలైన ప్రశ్నలు మనల్ని ఎదుర్కొంటున్నాయి.

శబ్ద పల్లవ క్రియ అంటే ఏమిటి. సంగ్రహంగా చెప్పాలంటే — ఒక ధాతువు, లేక ధాతు భిన్నపదము, ధాతువుతో చేరి— ఈ రెండును కలసి ఒక నూతనార్థమును సృష్టించు విధానము. శబ్ద పల్లవంలో పూర్వావయవము ధాతువు కాని, నామము కాని, విశేషణం కాని, అవ్యయం కాని, ఏదో ఒకటి కావచ్చును. అయితే దాని ఉత్తరావయవము ధాతువే కావాలనే నియమం ఉంది. ఎందుచేతనంటే ఇది వ్యాపార బోధకమైన కూర్పు. ఇది ఒక పనిని నిర్దేశిస్తుంది. శబ్ద పల్లవంలో రెండు పదాలు కలుస్తున్నాయి కదా ఈ జంటను సమాసమని పిలువరాదా ? దీనికొక క్రొత్త పేరు ఎందుకు? అనే ప్రశ్నరావచ్చు. నిజమే. సమాసమందు ఒకటికి మించిన పదాలు కలసి ఒక మాట ఏర్పడుతూంది. అవి పూర్వ పదార్థప్రధానమనీ, ఉత్తర పదార్థ, ఉభయపదార్థ, అన్యపదార్థ— ప్రధానములని భేదాలు చెప్పుతారు. అయితే సమాసాలకు, శబ్ద పల్లవాలకూ భేదం ఎక్కడ వస్తూందంటే సమాసములు సత్వ ప్రధానములు. శబ్దపల్లవాలు భావ ప్రధానములు. ''సత్వప్రధానాని నామాని—భావ ప్రధానమాఖ్యాతమ్'' అని చెప్పినారు గనుక సమాసాలు నామకోటిలోనికి, శబ్దపల్లవాలు ఆఖ్యాత కోటిలోనికి వస్తాయని చెప్పాలి. ఈ రకం క్రియలకు శబ్దపల్లవమనే ప్రత్యేక సంజ్ఞ తెలుగులోనే కనబడుతూంది. శబ్ద పల్లవ క్రియల వ్యవహారం ఉండీ, ఆ సంజ్ఞలేని భాషలు ఉన్నాయి. ఉదాహరణకు కన్నడంలో వీటిని 'క్రియా సమాసములు' అని వ్యవహరిస్తారట. ఇదీ బాగానే ఉంది. సమాసమునందువలె సంపుటీకరణము పొంది క్రియావ్యాపారం నిర్వహించేవాటిని 'క్రియా సమాసాలు' అనడం కూడా అర్థవంతంగానే ఉంది. అయితే మన తెలుగు వైయాకరణులు ఒక అడుగు ముందుకు వెళ్ళి ఈ విధమైన పదబంధము నకు 'శబ్దపల్లవము' అనే వ్యాకరణ వ్యవహారం కల్పించుకున్నారు. శబ్దపల్లవ సంజ్ఞ సంస్కృత వ్యాకరణంలో లేదని తెలుస్తూంది. శబ్దపల్లవములవంటి కూర్పుకూడా సంస్కృతంలో విరళ విరళము గానే కనబడుతుంది. కతిపయ నిర్మాణము లటువంటివి సంస్కృతంలో ఉన్నాయని శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు తమ 'బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశికలో' (పుట -12) శబ్ద పల్లవ వివరణ సందర్భమున పేర్కొన్నారు. ఏతాదృశములు — బ్రహ్మీభవతి; స్వీకరోతి; సత్యాపయతి, పుత్రయతి, దుఃఖీకరోతి; ఉపవీణయతి, అనుతూలయతి, ఉపశ్లోకయతి; సంస్మరయతి, విరజీకరోతి — వంటివి. శబ్ద పల్లవ వ్యవహారం సంస్కృత భాషలో లేదనియే వారును చెప్పియున్నారు. వీటిల్లోకూడా కొన్ని సంస్కృతభాషా మర్యాదకు అనుకూలంగా ఉన్నాయి. ధాతువు ముందర ఉపసర్గలుచేర్చి నూతనార్థములు, విశేషార్థాలు, చెప్పించడం సంస్కృతంలో ఉండనే ఉంది. ఉపవీణయతి; అనుతూలయతి, ఉపశ్లోకయతి, సంస్మరయతి, అనేవి ఉపసర్గ పూర్వకములుగా కనబడుతూనే ఉన్నాయి. ఇవి నామ ధాతువులు. 'ణిచ్' ప్రత్యయాంతములు. తెలుగు శబ్ద పల్లవ పదాల్లో ముఖ్య లక్షణమైన రెండు పదాల కలయిక వీటిల్లో ఉన్నదా అని సందేహము. సత్యాపయతి, పుత్రాయతి, అను పదాల్లో, ఉపసర్గ పూర్వకత్వంకూడా లేదు. ఇవి కూడా నామధాతువులే. మొదటిది ''ణిచ్'' ప్రత్యయాంతము. రెండవది ''క్యచ్'' ప్రత్యయాంతము.

బ్రహ్మీభవతి, స్వీకరోతి, విరజీకరోతి అనే పదాల్లో రెండు భిన్నశబ్దాలు భాసిస్తూ నూతనార్థ కల్పనం చేస్తున్నాయి, ఇవి ''చ్విప్'' ప్రత్యయాంతములు. అభూత తద్భావార్థమున ఏర్పడినవి. అయినా శబ్దపల్లవ విధానం సంస్కృతానికి అవసరం కాదు.

తెలుగులో అయినా, ఇతర భాషల్లో అయినా శబ్దపల్లవ నిర్మాణం ఎందుకు జరుగుతూందో పరిశీలిస్తే ఏతాదృశ కల్పన ఏ భాషకు అత్యంత సహజమో, స్వాభావికమో తెలుస్తుంది. శబ్ద పల్లవం అంటే ఏమిటో మళ్ళీ జ్ఞాపకం తెచ్చుకుందాము. తెలుగు వ్యాకరణ చరిత్రలో శబ్దపల్లవ సంజ్ఞను మొట్టమొదట ప్రవేశపెట్టినవాడు అథర్వణాచార్యుడు. ఈ యాచార్యుడు తిక్కన సోమయాజి కాలమువాడనీ, కొంచెము ముందైన కావచ్చునని చెప్పుతున్నారు. వికృతి వివేకము లేక అథర్వణ కారికావళి అని చెప్పబడే ఈయన గ్రంథంలో క్రియా పరిచ్ఛేదము నందు 29 వ కారికలో శబ్ద పల్లవ ప్రశంస తొలు దొల్త కనబడుతూంది. నన్నయ కృతమని చెప్పబడుతూన్న 'ఆంధ్ర శబ్ద చింతామణి'లో మాత్రము శబ్ద పల్లవ ప్రసక్తి రాలేదు. శబ్ద పల్లవ సంజ్ఞను

అధర్వణుడు రాన్నై కల్పించాడో లేక తన పూర్వమే పండిత లోకంలో ప్రచారమునందున్న దానిని గ్రహించి వివరణ చేశాడో తెలియదు. నన్నయ భారతంలో చెప్పబడినట్లు ''సత్సభాంతర సరసీవనంబులు'' అనగా విద్వత్పరిషత్తులు ఆ కాలంలో ఉండేవనీ, వాటిల్లో వ్యాకరణం, అలంకారం, మొదలగు సారస్వత విషయాలు చర్చింపబడేవనీ మనము అనుకోవడంలో విప్రతిపత్తి ఉండక పోవచ్చును. అటు వంటి పండిత పరిషత్తుల్లో చెలామణీ అవుతూండే వ్యాకరణ సంకేతాన్ని పుచ్చుకొని ''క్రియాః ప్రసిద్ధాః బహవశ్శబ్ద పల్లవ సంజ్ఞికాః'' అనే కారిక చేసి ఉంటాడు. నూతనార్థములు లేక విలక్షణార్థములు కల్పించడంలో సంస్కృత పద్ధతికి, తెలుగు పద్ధతికీ భేదం కనబడడం చేతనే అధర్వణుడు అట్టి ధాతువులను గుర్తించి శబ్ద పల్లవ సంకేతం వాటికి రూఢి చేశాడు. శబ్ద పల్లవాలు అధర్వణుని నాడు క్రొత్తగా తెలుగు భాషలో ఉవతరించ లేదు. అవి నన్నయ నాటి నుండీ ఉన్నాయి. ఆంధ్ర శబ్ద చింతామణి ప్రధానంగా తత్సమ భాషా ప్రవణము అవడం చేత కాబోలు వాటిపై దృష్టిని ప్రసరింప చేయలేదు. అంతవరకెందుకు. అధర్వణుని సమకాలికుడగు కేతన కవి తన 'ఆంధ్ర భాషా భూషణము' నందు శబ్ద పల్లవ ప్రశంస చేయ లేదు. తెంచు ధాతువు అను ప్రయుక్తములుగాగల రూపములు కొన్నింటిని ఇతడు పఠించినాడు.

''ఏం చఁగనేగు పదము తుదఁ
దెంచుట యగుఁ గ్రియల నరుగుదెంచుట పైఁ దే
తెంచుట, చనుదెంచుటనడ
తెంచుట, తోతెంచుటనఁ గదెల్లంబగుచున్.''

ఏతెంచు, అరుగుదెంచు, చనుదెంచు, నడతెంచు, తోతెంచు అను మిశ్ర రూపములనీతడు గుర్తించినవాడయ్యెను. తెంచు ధాతువు అను ప్రయుక్తమైన రూపములు శబ్దపల్లవములా, లేక 'ద్వ్యవయవక్రియ'లా అను విషయమును మత భేద ముండ వచ్చును. వాటిని ముందుముందు చర్చింతము.

శబ్దపల్లవ నిర్వచన విషయమును అధర్వణుడు ఏమియు చెప్పలేదు. మూకీభావమునే వహించాడు. ''క్రియాః ప్రసిద్ధాః బహవః శబ్ద పల్లవ సంజ్ఞికాః'' అనుటచేత అవి సుప్రసిద్ధములు. వేరే వివరణము అనవసరము అని భావించినట్లు కనబడును. శబ్ద పల్లవ అవయవాలను గురించి మాత్రం అతడు ప్రసంగించాడు. అవి ముందు ప్రదర్శిస్తాము. కవిశిరోభూషణమందు అహోబల పండితుడు కూడ శబ్దపల్లవ నిర్వచనం జోలికిపోలేదు. అతని దృష్టిలోకూడా ఇది ప్రసిద్ధవిషయముగానే ఉంది. శబ్దపల్లవ అవయవాలను గురించి కారికాకర్త చెప్పినదానిని అహోబలుడు కొంత వ్యాఖ్యానించి కొన్ని సందేహాలను తొలగించడానికి ప్రయత్నించాడు. శబ్దపల్లవం అంటే ఏమిటో మొట్టమొదట తెలియ జేయుటకు యత్నించినవాడు వికృతి వివేక టీకాకర్తయైన ద్వితిం త్రిణిసీతారామకవి. ఈయనటీకకు 'కవిజనమండనమని' పేరు 'క్రియాః ప్రసిద్ధాః బహవః శబ్ద పల్లవ సంజ్ఞికాః' అనే కారికకు టీక వ్రాస్తూ తాత్పర్యార్థంగా ఇట్లా వ్రాశాడు: ''ధాత్వాదుల కుప్రయుక్తంబులై విలక్షణార్థాభిధాయకంబులగు ననేక ధాతువులు శబ్ద పల్లవములనిపించుకొనును.'' ఆధునిక వైయాకరణులలో పరవస్తు చిన్నయసూరి గారు దీనిని చూచి పర్యాలోచన చేసియే కావచ్చును ఇప్పుడు మనకు సుపరిచితమైన శబ్ద పల్లవ నిర్వచనాన్ని సూత్రబద్ధం చేశాడు. ''ధాత్వాదులకు ధాతువులను ప్రయుక్తంబులయి విలక్షణార్థాభి ధాయకంబులగు నీయని శబ్ద పల్లవంబులు నాబడు.'' (బాల. క్రియ. 118 సూ) విలక్షణార్థాభిధాయకత్వమును ద్వితింత్రిణి సీతరామ కవి గారు గుర్తించి యుండగా ఈయన దృఢపరచినాడు. తరువాతి విద్వాంసులు ఈ వరవడిలోనే చెప్పుకుంటూపోయారు చర్ల నారాయణ శాస్త్రిగారి నారాయణీ యాంధ్ర 'వ్యాకరణము' గూడ ఈ మార్గాన్నే నడిచింది. దీని మీద వెడల్పన గాణాపత వివరణము నందు ఇట్లు కలదు: ''పల్లవ శబ్దమున కిట లక్షణచే నంత్యార్థ కత్వము. శబ్ద పల్లవములనగా క్రియలా నామ పదములు గాడి చెట్లకు పల్లవముల వంటివి అని వ్యుత్పత్యర్థము''. కల్లూరి వెంకట్రామ శాస్త్రిగారు 'గుప్తార్థ ప్రకాశికా వ్యాఖ్యానము' నందును ఇట్లే వ్రాసిరి ''ధాత్వాదులకు = క్రియలు మొదలైన వానికి, (ఆది శబ్దము చేత నామ వాచకములు గ్రహింపబడును) ధాతువులు=క్రియలు జరపబడి చో శబ్ద ద్వయ మేళనంబునకు పూర్వ మందున్న యర్థము కంటె విలక్షణార్థము బోధించుచున్న వైయయ్యి వ్యాకరణ పరిభాషం చేసి శబ్ద పల్లవముల నంబడు అనగా అనేక శబ్దముల నుండి చిగిర్చినవి (అంకురించినవి) గాని భావము''. విద్వాన్ దూసి రామమూర్తి శాస్త్రి గారు తమ బాల వ్యాకరణ సారస్య సర్వస్వ పీటిక యను టీకా గ్రంథము నందును ఇదే రీతిని వ్రాశారు. ''ఒక ధాతువునకు వేరొక ధాతువును గాని, యొక నామవాచకము నొక్క ధాతువును గాని చేరుటంజేసి పూర్వపరపదములకుఁ జెందనియొక విలక్షణమగు నర్థము సంభవించునో విలక్షణార్థము జెప్పుటచే నేక పదముగా నేర్పడిన యా పదద్వయము శబ్దపల్లవమను సంజ్ఞనందును. సూత్రార్థము. శబ్దపల్లవమనగా శబ్దముల మేళనమును గలిగినదని యర్థము. శాఖలు కాండము మున్నగువానితో డి చెట్టున కపూర్వముగఁ జిగురుగలుగునట్లే నను ప్రయుక్తములగు ధాతువుల మేళనముం జేసి యేకపదత్వము భాసించుటయు నపూర్వార్థ ప్రకాశనము జరుగుటయుఁ గలుగుం గాన శబ్దపల్లవ సంజ్ఞ సార్థకము''.

శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు తమ 'ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము' లో (పుటలు 1682–1700) శబ్దపల్లవములనుగూర్చి పూర్వ విద్వాంసుల మతములన్నింటినీ సుదీర్ఘంగా చర్చించి విమర్శించారు. చిన్నయసూరి మున్నగువారు శబ్దపల్లవ క్రియలుగా నిర్దేశించిన వాటిల్లో కొన్నిటియందు విలక్షణార్థాభిధాయకత్వం లేదని త్రోసిపుచ్చారు. అసలు మూల కారికా కర్తయైన అధర్వణుని భావము ఇది కాకపోవచ్చుననీ, నూతనార్థప్రదాయిత్వమనే లక్షణం ద్వితింత్రిణి సీతారామకవిగారిదనీ, చిన్నయసూరి మున్నగువారు దానిని ఎరువు తెచ్చుకొన్నారని,

విస్తరించారు. నామము + ధాతువు మేళనమే అధర్వణుని అభిమతమనీ, ధాతువు + ధాతువు మేళనము అతడు ఉద్దేశింపలేదనీ వీరి వాదము. ఇందులో కొంత నిజము లేకపోలేదు. శబ్దపల్లవ క్రియలలో పూర్వావయవము సుబంతమని అధర్వణుడు చెప్పినది వాస్తవమే. "ప్రథమాయా ద్వితీయా యాస్సంబంధ సూత్ర సమ్మతః" అని అధర్వణుని కారిక. ఈ కారికంకు అతను ఉదాహరణము లేమియు ఇవ్వలేదు. ఈ పరిశ్రమ చేసిన వారు అహోబల పండితుడు ఇతడిచ్చిన తెలుగు ఉదాహరణము లన్నింటిలోను శబ్దపల్లవ పూర్వావయవము ప్రథమా లేక ద్వితీయా విభక్త్యంత పదముగానే ఉంటుంది. వీడ్కొని (వీడు + కొను) దాకొని (దాగు + కొను) వంటి రెండు మూడు ఉదాహరణాలు అపవాదంగా ఉన్నాయి. వీటిల్లో ధాతువు + ధాతువు మేళనం స్ఫురిస్తూంది. ఇంత మాత్రం చేత కవిజన మండనకర్త మొదలు కొని ఇతర విద్వాంసులంతా చెప్పినది అప్రమాణంగా కొట్టివేయ నక్కర లేదు. నిరంతర భాషాధ్యయనం చేత శబ్దపల్లవాల విషయంలో వారు నూతన విషయాలు కనిపెట్టి శాస్త్రబద్ధం చేస్తే వాటిని కాదనగలమా. ఇంక శాస్త్రం వికసించడం ఎట్లాగ. శబ్దపల్లవ క్రియంలో విలక్షణార్థాభిధాయకత్వం గాని వాని పూర్వావయవం సుబంత భిన్నంగా కూడా ఉండడం గాని, నిరాకరింపరానివి. ప్రథమ పరిశ్రమ చేసిన అధర్వణ అహోబిలపతులు సత్యమును కొంత తెలుసుకున్నారు. అనంతరులు దాని పరిధిని చక్కగా విపులీకరించారని చెప్పడం యుక్తంగా ఉంటుంది. రెండు శబ్దాల మేళనం, అట్లు కలిసిన జంట పదాలను శబ్ద పల్లవం అని సంజ్ఞ చెయ్యడం వజ్ఝల వారు కూడా ఒప్పుకున్నారు. ఇక్కడ వీరు చేసిన వివరణ ఇట్లా ఉంది. "పల్లవ మనగా చిగురు. రెండు దళము లేకీభవించి పల్లవముగా నంకురించినట్లు రెండు శబ్దములు కలసి యొక శబ్దముగా నేర్పడుటచే నట్టిది శబ్ద పల్లవమనిపించుకొనును. పల్లవము వంటి శబ్దమని తాత్పర్యము." ఈ వివరణ మంత ఉదారంగా లేదు. లోకంలో ఎవరు చెప్పినా పల్లవము, చిగురు, అంటే వృక్షలతాదులకు నూతనావిర్భావముగా పరిగణిస్తారు. చెట్టు చిగిర్చిందంటే క్రొత్తదనం సంతరించుకుందనే భావిస్తాము. అది ద్విదళవంతమయిందని సంకుచితంగా భావించము. శబ్దపల్లవం అనడంలోనే నూతనార్థ (విలక్షణార్థ) దాయిత్వస్ఫూర్తి ఉన్నది. అట్లు కాకపోతే అధర్వణుడు చేసిన శబ్ద పల్లవ సంజ్ఞయే నేతిబీరకాయవంటిది అవుతుంది. విలక్షణార్థ ప్రతీతిని కలిగింపలేని శబ్దముల జంటలను ఉండవచ్చును. వీటిని ప్రౌఢవ్యాకరణకారుడు 'ద్వ్యవయవ క్రియలు' అని వ్యవహరించాడు. (ప్రౌ. వ్యా. శే. క్రియా 25) ద్వ్యవయవ క్రియలంటే ఏమిటో వివరించలేదు. 'చనిచ్చు' అని ఒకే ఒక ఉదాహరణం ఇచ్చి తృప్తిపడ్డాడు. వీటిని ఇంకా వివరించాలి. మొత్తం మీద తెలుగు భాషలో జంటపదములతో ఏర్పడిన క్రియలు ఉంటున్నాయనీ, వాటిల్లో కొన్ని అవయవార్థం కన్న విలక్షణమైన అనగా క్రొత్తదైన అర్థం ఇవ్వగలుగుతున్నాయనీ, వీటినే 'శబ్ద పల్లవాలు' అంటారనీ, ఆ విధంగా జంటపదాలుగా ఏర్పడి, క్రొత్త అర్థాన్ని ఇవ్వకుండా స్వార్థంతోనే విశ్రమించేవి 'ద్వ్యవయవ క్రియలు' అనీ స్థూలంగా చెప్పవచ్చును.

విలక్షణార్థ ప్రకాశనమునకు ఆయా భాషలు అవలంబించే పద్ధతి ఏమిటి అని పరిశీలిద్దాము. క్రొత్త శబ్దాలు ఎందుకు సృష్టించవలసివస్తూంది. దీనిని ఆయా భాషలు ఎట్లా సాధిస్తున్నాయి. మానవుడికి భౌతిక ప్రపంచంతో గాఢమైన సంబంధం ఏర్పడినప్పటినుంచీ ప్రకృతిలో కనబడే వివిధ పదార్థాలకు వేర్వేరు పేర్లు పెట్టుకోవలసిన అవసరం అతనికి ఏర్పడుతూంది. ఇవే నామపదాలు. ఒక వస్తువులో కనబడిన ఏదో ప్రత్యేక లక్షణమో, గుణమో, పట్టుకొని ప్రాథమిక మానవుడు దానికి పేరు పెడుతున్నాడు. ఇటువంటి నామపదాలు లేకుండా లోక వ్యవహారమే జరుగదు. మళ్లీ ఈ నామపదాల మీద కొన్ని ప్రత్యయాలు చేర్చి నామపద ప్రపంచాన్ని ఇంకా విస్తృతం చేసికొంటున్నాడు. ఈ వస్తుజాతము పొందే వికారాలు లేక మార్పులే క్రియాపదాలచేత చెప్పించడం జరుగుతూంది. ఏ భాషలోనూ నామ పదాలున్నంతగా క్రియాపదాలుండవు. ఒక దశ వచిన తర్వాత క్రొత్త పదాలు కల్పించేశక్తి మానవునకు తగ్గుతూందని భాషాశాస్త్రజ్ఞులంటారు. అతనికి భాషా ప్రయోగంలో పొదుపుమీద కూడా దృష్టి లగ్నమవుతూంది. అందుచేత ఇదివరలో తనకు ఉపలభ్యమైన పద సంపదనే ఇక్కడక్కడ కొన్ని మార్పులు చేర్పులు చేసి నూతన పదసృష్టి చేసే శ్రమను తప్పించుకుంటున్నాడు. నామముల విషయంలోనే ఇది ఇట్లా ఉండగా వ్యాపారబోధకమైన పదాలు అనగా క్రియాపదాల విషయంలో నూతన పద నిర్మాణం మానవునకు మరీ క్లేశదాయకమయింది. మానవుని మనస్సు క్రొత్త క్రొత్త వ్యాపారాలను ఊహిస్తూనే ఉంది. వాటిని ప్రకటించడానికి క్రొత్త ధాతువులు అవసరమవుతున్నాయి. ఈ దశలో ఒక్కొక్క భాష ఒక్కొక్క మార్గం తొక్కి తన ప్రయోజనాలను సిద్ధింపచేసుకుంటూంది.

సంస్కృత భాషను తీసికొంటే నూతనార్థ ప్రతిపాదన కోసం అక్కడ కొన్ని త్రోవలు మనకు కనబడుతున్నాయి. గీర్వాణ భాష చాలా ప్రాచీనమైనదవడం చేత దానిలో సహజంగానే మూల ధాతు పదజాలం కొంత విస్తృతంగానే ఉంది 'ధాతూనామనేకార్థకత్వాత్' అనుటచే ఉన్న ధాతువులకు భిన్నార్థాలు చెప్పే శక్తి ఏర్పడింది. అందుచే భావప్రకటనావకాశాలు విస్తరిల్లాయి. ఇంతే కాక సంస్కృత భాష 'Inflectional Language' అవడంచేత దానిలో ప్రత్యయాలు, ఉపసర్గలు మున్నగువాని వినియోగం పుష్కలంగా ఉంది

"ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యః ప్రతీయతే
ప్రహారాహార సంహార విహార పరిహారవతే"— అనే శ్లోకం

ఈ భావాన్నే ప్రకటిస్తుంది ఇట్లే ధాతువు పరమందు చేర్చే ప్రత్యయాదులచేత కూడా నూతనార్థ ప్రకాశనం జరుగుతూంది. 'పుత్రుడు' అనే నామవాచకంమీద 'క్యచ్' ప్రత్యయంచేత - పుత్రమ్ ఆత్మనః ఇచ్ఛతి— తనకు కొడుకుకావలెనని కోరుతున్నాడు అనే భావము 'పుత్రీయతి' అనే సంగ్రహరూపంలో ప్రకటింపబడు

తోంది. ఉపవీణయతి - వీణయా ఉపగాయతి - వీణతో గా న ము చేస్తూంది అనేభావాన్ని "ణిచ్" ప్రత్యయంతో చెప్పించడం జరుగుతూంది. తెలుగులో ఇట్లు ఉపసర్గ చేతనూ, ప్రత్యయాదులచేతనూ క్రొత్త అర్థాన్ని సంగ్రహంగా చెప్పించే సౌకర్యం లేదని అందరికీ తెలిసిందే.

ఆంధ్రభాష ఈ సమస్యను ఎట్లా పరిష్కరించుకొన్నదిఅని ప్రశ్నించుకుంటే, శబ్దపల్లవ నిర్మాణంచేత అని సమాధానం లభిస్తూంది. ఈ సన్నివేశం తెలుగుకుమాత్రమే కాకుండా దీనికి సహకుటుంబ భాషలైన తమిళ, కన్నడాది ఇతర ద్రావిడ భాషలకును వర్తిస్తూన్నట్లు తెలుస్తూంది. సంస్కృతాద్యార్యభాషలు 'Inflectional Languages' — అనగా ప్రత్యయ ప్రధాన భాషలనీ, తెలుగు,కన్నడం మొదలైన ద్రావిడభాషలు "Agglutinative Languages" అనగ సంశ్లిష్టపదభాషలనీ భాషాశాస్త్రజ్ఞులు వ్యవహరిస్తున్నారు. ఒక నూతనార్థమును చెప్పించడానికి ప్రత్యయ ప్రధానభాషలు శబ్దానికి పూర్వమందూ, పరమందూ చేర్చే ప్రత్యయాల మీద ఆధారపడుతున్నాయి. అదే ప్రయోజనాన్ని సంశ్లిష్ట పదభాషలు ఒకపదానికి మరొకపదంచేర్చి సాధించుకుంటున్నాయి. సంశ్లిష్టపదభాషలలో ప్రత్యయాలు బొత్తిగా లేవనికాదు. ప్రధానంగా పదసంశ్లేషమే వాటికి సహజమైన పద్ధతి. ఈ దృష్టితో చూసినప్పుడు తెలుగుధాతుప్రక్రియలో శబ్దపల్లవకల్పన ఎందుకు జరుగుతూందో తెలుస్తూంది. క్రియాసామగ్రిలో విలక్షణార్థప్రతిపాదకత్వం సమకూర్చాలంటే ధాత్వాదులకు ధాతువులను ప్రయుక్తం చెయ్యవలసివస్తూంది ఆదిమకాలంలో భాషకు పరిమిత ప్రయోజనమే ఉండడంచేత శబ్దపల్లవాల ఆవశ్యకత అంతఎక్కువ ఉండియుండకపోవచ్చును. కాలముగడచిన కొద్దీ మానవుని భావసంపద పెరగడమూ, దానిని ప్రకటించడానికి అనువుగ శబ్దపల్లవ కల్పనం జరగడం అనివార్యమవుతూంది. ఉదాహరణకు, శబ్దరత్నాకర నిఘంటువు ప్రధానంగా కావ్యభాషకు అద్దం పట్టదలచినది కనుక దానిలో ప్రాచీనభాషయందు ఏర్పడిన కొన్ని శబ్దపల్లవక్రియలు మాత్రమే ప్రత్యక్షమవుతాయి. సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఇవి కొన్ని ఎక్కువ. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారుకూర్చిన "క్రియాస్వరూపమణిదీపిక" లోనూ, శ్రీమాన్ చెలమచర్లరంగాచార్యులు గారు కూర్చిన ఆంధ్రశబ్దరత్నాకరంలోనూ, ఆధునికభాషాస్థితి విస్తారంగా ప్రతిబింబించడం చేత శబ్దపల్లవ క్రియలు కోకొల్లలుగా కనబడతాయి. మూలధాతువులు అనే వాటిని వెనుకకు నెట్టివేసి శబ్దపల్లవక్రియలు విచిత్రాలంకార వేషధారణతో భాషా రంగస్థలం మీద మనోహర నృత్యం చేస్తూ ఉంటాయి. దీనికై మనము తబ్బిబ్బుపడ నక్కర లేదు. భాష చెడిపోయిందని చింతిల్ల నక్కర లేదు అదికడు సహజమైన పరిణామము. కూనలు పెరిగి పెద్దవైనట్లు.

తెలుగు భాషలో తన కాలానికి జరిగిన ఈ పరిణామాన్ని మొదట గుర్తించి కారికాబద్ధం చేసిన వాడు అధర్వణాచార్యుడు. ఈతడు ప్రతిభాశాలియైన భాషాచింతకుడుగా కనబడుతున్నాడు. ఇతడు క్రియా సామగ్రిలో రెండు విధాలయిన శబ్దమేళనాన్నిగుర్తించాడు [1]అర్థఘటక క్రియలు [2] శబ్దఘటకాలు. అర్థఘటకాన్ని గురించి ఇట్లా చెప్పాడు:

ఘాగమి క్రియాయోరంతే
ఘటకాఖ్యాసమువ్యతే—వికృతి వివేకము—క్రియ 23.
అన్యాశ్చాప్యర్థఘటకా
స్స్యాదనే కార్థతాపిచ
క్వచిదర్థ విశేషస్య
వివక్షాపిచ దృశ్యతి—వికృతి వివేకము—క్రియ 24.

దీనికి కవిజనమండనమనేక ధాతువు యొక్క అంత మందు ప్రయోగింపబడిన అగు, పోవు, ధాతువులకు అనేకార్థములు ఘటించునవి కాన ఘటకములను పేరు చెప్పబడును వాడు సేయంగలడవున్, నీవుఘటించుచున్నాడ వగుదువు, నేను ఘటించుచున్నాడ నగుదున్, ఇత్యాదులు వర్తమాన భవిష్యదర్థంబులు

అందు సేయునగున్ ఇత్యాదులు తద్ధర్మార్థకములు.అంతేసేసెనయ్యె ఇత్యాదులు భూతార్థకములు. అక్కార్యము ఘటింపనగు ఘటింపదగినదియగును. ఘటింపనయ్యెదనేను, ఘటింపనైతిన్ ఇత్యాదులు వ్యతిరేకార్థమందును, ఆదితరార్థంబులందును దృశ్యంబులు.పోవు ధాతువువ్యతిరేకార్థమందుం గవర్ణకము కంటెఁబరంబునం బ్రయోగింపఁబడి విశేషార్థమును ఘటించునది యగును. ఉదా: ఘటింపకపోయె, రాకపోయె, చేయకపోయె, ఘటింపడయ్యె అను అర్థమును దెలుపును".

'అన్యాశ్చాప్యర్థ ఘటకాః'—అనుకారికా వివరణము. "మరికొన్ని ధాతువులును విశేషార్థ ఘటకములగును. ఉదా:—రాకమానె, రాకతక్కె,రాక చిక్కె,ఘటింపవచ్చున్ ఇత్యాదులు, ఘటింపకపోడు, రాకపోడు, లేకపోడు, రాకపోడు,ఇత్యాదులు నిషేధముఖంబుచే విధిని తెల్పుచున్నవి."

ఈ కారికల నింతకుముందే అహోబిల పండితుడు 'కవిశిరోభూషణము' నందు సవిస్తరంగా చర్చించి ఉదాహరణము లిచ్చియున్నాడు. ద్విభాష్యం త్రిణి సీతారామయ్యగారు అహోబలుని పద్ధతిని తమ వివరణము సాగించి యున్నారు. ఉదాహృతులును అవియే. అహోబలుడు నన్నయ ప్రయోగము నొకదానిని ఈ సందర్భంలో ప్రదర్శించడం విశేషము. దానిచే ప్రామాణికత్వమును సాధించాడు. "నమ్మనే రనయ్యెదన్" (ఆది 4–40) అనేది నన్నయ ప్రయోగము. నమ్మనేరను అనే భావాన్ని 'నమ్మనేర నయ్యెదను' అని అనుధాత్వనుబంధముగా నన్నయ ప్రయోగించాడు.'ఏమి కారణంబున విపంపుసేయరైరి' అని భూతార్థమందును, 'సృష్టిం లేదవు' అని తద్ధర్మార్థములనునన్న యోగాలు. ఇట్టి ప్రయోగము లింకను కొన్నిటిని సంహితాసర్వస్వము 1663–64 పుటలలో చూడవచ్చును. అర్థఘటకములలో 'అగు' ధాతువు స్వార్థవ్యతిరేకార్థములురెంటను, పోవుధాతువు వ్యతిరేకమందును కానవచ్చునన్నదని అథర్వణుడే చెప్పాడు "ఉభయత్రాపి భవతిః—అన్యాతువ్యతిరేకిణీ." అన్యా అనగా గముధాతుపర్యాయమైన పోవుధాతువుఅనుట. అహోబలపతిఇచ్చిన ఉదాహరణాన్నిబట్టి అర్థఘటక క్రియలు విశేషార్థము నివ్వడానికి ప్రయోగింపబడేవిగా కనపడుతున్నాయి — ఈ జంట

లలో రెండును ధాతువులుగానే ఉంటున్నాయి. రామానె, రాక చిక్కె, రాకతక్కె, వంటివానిలో పూర్వోత్తరావయవములు రెండును ధాతువులే. కొన్నియెడల నవి విశేషార్థమును సంపాదింపక, ఉన్న అర్థములోనే విశ్రమించుటయు కలదు. వృష్టి లేదవు (గు) వృష్టి యుండదు, అంటే ఎంత అర్థమో వృష్టి లేదవు, లేనిదియగు అన్నప్పటికీ అంతే అర్థము. భంగ్యంతరంగా చెప్పటమే దీని ప్రయోజనంగా కనబడుతుంది. శబ్దమేళనంవల్ల విశేషార్థము లివ్వ గల శబ్దపల్లవక్రియల్ని చెప్పబోతూ, అధర్వణుడు అర్థ ఘటకాలంటూ వేరే విభాగం ఎందుకు చేశాడనే ప్రశ్న రావచ్చును. అర్థ ఘటకాలైన జంటలకూ, శబ్దపల్లవాలైన జంటలకూ ఇతడొక విభాజ్యరేఖ పెట్టుకొన్నవాడులాగ ఉన్నాడు. అర్థ ఘటకాల్లో రెండూ ధాతువులు. శబ్దపల్లవాల్లో పూర్వావయవం సుబంతమని ఇతని భావనగా కనిపిస్తుంది. ఘటక సంజ్ఞను పొందిన ధాతువులు కూడా స్వల్పసంఖ్యలోనే ఉన్నాయి.

అనంతరులెవ్వరూ అర్థఘటకధాతువులంటూ వేరే విభాగం వెయ్యలేదు. వీటి మాటనే ఎవరునూ ఎత్తలేదు. ఈ విభాగం అనవసరమని వారు భావించి ఉంటారు. చిన్నయసూరి ధాతువుల జంటల్ని విలక్షణార్థాభిధాయకత్వం 'కలవీ' అట్లు లేనివీ అని రెండు తరగతులుగా భావించినట్లున్నాడు. వ్యక్తంగా అయితే ఆ మాట అతడు చెప్పలేదు. శబ్దపల్లవాల్ని గురించి బాల వ్యాకరణం—క్రియ–118 సూత్రంలో విధిస్తూ అంతకుముందు క్రియ 109వ సూత్రంనుండి 114 సూత్రం దాకా జంటధాతువు లనదగిన వానిని గూర్చి అనుశాసనంచేశాడు. వీటిల్లో ధాతుమేళనం కనబడుతూన్నా ఇవి స్వార్థమందే విశ్రమిస్తూన్నట్లు భావించి వీటిని శబ్ద పల్లవాలకు ముందే పఠించాడు. ప్రౌఢవ్యాకర్త వీటికే 'ద్వ్యవయవ క్రియలు' అనే సంకేతం వాడినట్లు తోస్తుంది.

ఇంక శబ్ద పల్లవ క్రియల విషయంలో అధర్వణుని అనుశాసనమూ దాని మీద ఇతరులు చేసిన మార్పులూ చేర్పులూ గుర్తిద్దాము. శబ్ద పల్లవముల సందర్భంలో అధర్వణుని కారిక—

"క్రియాః ప్రసిద్ధాః బహవశ్శబ్ద పల్లవ సంజ్ఞికాః
ప్రథమాయాద్వితీయా యాస్సంబంధ సూత్రసమ్మతః
తయోర్ద్వి ధిర్యథాయోగం తత్సహాద్వ్యాకృతావపి
క్రియా యగా ఉపచార స్స్యాత్ప్రథమా పద సంగతా
అకర్మకత్వం ప్రాయస్స్యాత్ పరత్రో భయ సంగతిః
శబ్ద శక్త్యా పరిప్రాప్త స్సర్వత్రార్థోహి గృహ్యతే
క్వచి ద్విభక్తి వైచిత్ర్యమ్ దృశ్యతే కవిభాషితే."

ఈ కారికను అహోబలుడిట్లు వ్యాఖ్యానించాడు. "అకర్మకత్వం ప్రాయస్స్యా దిత్యత్ర పూర్వత్రాన్వయః పరత్ర ద్వితీయా యాస్సంబంధస్థల ఇత్యర్థః– అత్ర ఆధేయ నిష్ఠక్రియాయా ఆధార ఆరోప ఉపచార ఇత్యుచ్యతే– పెంపెక్కుచున్నాడు. పనిదేరి, వడిమిగి, దెసచెడి, దిక్కుచెడి, పదనెక్కె, లావటి, పెంపటి, బలమటి, భయమటి," ఇత్యాదిగా పెక్కు ఉదాహరణము లిచ్చాడు.

శబ్ద పల్లవ సంజ్ఞతములైన క్రియలు చాలా కలవు. అక్కడ ప్రథమావిభక్తి ద్వితీయా విభక్తి సంబంధము ఇష్టము. ఆ శబ్ద పల్లవ క్రియలు తన్నను పదముల కంటెను వైకృత పదముల కంటెను వచ్చాయి. ప్రథమా పద సంగతి యందు క్రియకు ఉపచారము చెప్పబడును. ఉపచారమనగా ఆధేయ నిష్ఠ క్రియకు ఆధారము నందారోపమని అహోబలుడు. ప్రథమా విభక్తి సంగతిలో అకర్మకత్వము, ద్వితీయా విభక్తి సంగతియైనప్పుడు రెండును అనగా సకర్మకత్వా కర్మకత్వములు సమ్మతములు. వీనియందు శబ్ద శక్తి వలన వచ్చు అర్థమేయింతటను స్వీకరింపబడును. దెసచెడి, పదనెక్కె, లావటి, పెంపటి, మొదలైనవి ప్రథమావిభక్తి శబ్దములలో ఏర్పడిన శబ్ద పల్లవములు. ఇవి అకర్మకములు. కొన్ని ప్రథమా సంబంధము గల క్రియలు సకర్మకములగుటయు కన్పించును. 'అలఘు భుజానన్నుపవాహముగు దేయనినన్' అని నన్నయ ప్రయోగము. ఇక్కడ వివాహమగు అను శబ్ద పల్లవ క్రియ ప్రథమా సంగతి కలదైనను సకర్మకమైనదనుట. మార్కొను, ఎదుర్కొను, చేకొను, చెట్టవట్టు కాల్ద్రొక్కు, వంటివి సకర్మకత్వోదాహరణములు. చేకొను వంటి ధాతువుల్లో సంధిగత వికారములు కలుగవని యధర్వణుడే వచించాడు. "క్వచిన్నైవ వికారస్స్యాత్ మాధత్వాక్ శబ్ద పల్లవ". వికార మనగా గసడదవాదేశాదులు. కొన్ని శబ్ద పల్లవ క్రియల్లో సరళాదేశము కనబడుతూంది తెల్లంబడి, నల్లంబడి, వెలవెలంబోయి, బిడంబడి, విన్నంబోయి వంటివి అధర్వణుడు ఈ విశేషం కూడా గుర్తించియే ఉన్నాడు. 'కేచిచ్ఛబ్ద విశేషాస్స్యుః క్రియాయోగే ద్రుతాన్వితాః'. పై వాటిల్లో ద్రుతకార్యం కనబడుతూనే ఉంది. శబ్ద పల్లవ క్రియా సందర్భమున విభక్తి వైచిత్రియు కన్పించును. "నిన్ను దానిం బెండ్లి చేసెద," నీకు దానికిం బెండ్లిచేసెదను. ఇద్దరకు బెండ్లి యగున్. 'క్వచిద్విభక్తి వైచిత్రం దృశ్యతే కవిభాషితే' అను కారిక స్మరింపదగినది.

'క్రియాయా ఉపచారస్స్యాత్ప్రథమాపద సంగతా' అనునాధర్వణ వచనము కొంత క్లేశ దాయకమైనది. ఉపచారమంటే ఏమిటి. అహోబలుడు దీనినిట్లు వ్యాఖ్యానించాడు. 'అత్ర ఆధేయ నిష్ఠ క్రియాయా ఆధార ఆరోప ఉపచార ఇత్యుచ్యతే'. కవిజన మండనకారుడు దీనిని విస్పష్టము చేయలేదు. ఆధేయ క్రియకు ఆధార క్రియయందారోపము ఉపచారమనుట, అని యాతని వాక్యము. వస్తుతః ఇక్కడ రెండు క్రియలు లేనేలేవు. రూపఱు, పెంపఱు, మొదలైన క్రియలు ఇక్కడ పరిగణింపదగినవి. వీటిల్లో ప్రథమా పద సంగతి ఉన్నది. అఱు–నశించు అనునదొక్కటే క్రియా పదము. ఆధారక్రియ, ఆధేయక్రియ అని వేరుగా

(మిగతా 50 వ పేజీలో)

శ్రీ కోడూరి శ్రీరామమూర్తి

# మూడు దశాబ్దాల తెలుగు నవలా సాహిత్యంలో - అస్తిత్వవాద ధోరణులు [1947 - '77]

వ్యక్తి — వ్యవస్థ — ఈ రెండింటిమధ్యా సంఘర్షణ ఈనాటిది కాదు. వ్యవస్థ మతం పేరిట, నీతుల పేరిట, కొన్ని నియమాలను విధిస్తుంది. అవి ఉల్లంఘించరాదంటుంది. వ్యక్తి — అందునా, తనవంటూ కొన్ని ప్రత్యేక భావాలుగల వ్యక్తి ఈ వ్యవస్థతో సంఘర్షణకు పడక తప్పదు. దీనివల్ల అతడేమీ సుఖపడడు. వ్యవస్థ వేయి విషనాల్కలతో చిందించే విష జ్వాలలను ఎదుర్కోవలసి వుంటుంది. అయితేనేం — తాను అనుకున్నదానిలో తన మనసు నిర్దేశిస్తున్న మార్గంలో, నడుస్తున్నానన్న సంతృప్తి వుంటుంది. ఇంతవరకూ బాగానే వుంది. అసలు తన మనస్సు చెబుతున్నదేమిటో — తను ఎవరో తనకు తెలియాలి కద! —తనను తాను వెదుక్కునే కృషికి కారణము, ఫలితము, కూడా వ్యవస్థతో తలపడడమే అవుతుంది.

— దాదాపుగా యిలాంటి భావాలే 'అస్తిత్వవాదం' అనేది ఏర్పడ్డానికి అంకురార్పణ చేశాయి. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత; — ఈ అస్తిత్వవాదం ప్రపంచ సాహిత్యంలో కొంతవరకూ చోటు చేసుకొంది. ఈ సిద్ధాంత వాదులకు మనిషిముఖ్యం. అతని అస్తిత్వం ముఖ్యం. అందరినీ ఒకే మూసలోపోసే విధానాల్ని, అందరి విలువల్ని ఒకే రీతిలో కొలిచే ధోరణినీ వీరు వ్యతిరేకిస్తారు. తాత్విక ప్రపంచంలో అంతకుముందు ప్రచారంలోవున్న 'అయిడియలిజమ్' — 'నేచురలిజమ్' లకు ఈ సిద్ధాంతం విరుద్ధమైనది 'నేచురలిజమ్' ప్రపంచం యాంత్రిక సూత్రాలకు నిబద్ధమై పనిచేస్తున్నదని నమ్ముతుంది. మనిషి ఒక పెద్ద యంత్రంలోని ఒకభాగం మాత్రమేనని వీరి విశ్వాసం. దీనికి వ్యతిరేకంగా 'అయిడియలిజమ్' మనిషికి ప్రాధాన్యతను ఇస్తుంది. అయితే — మనిషి వ్యక్తిత్వాన్ని హేతువాదమనే చట్రంలో బిగించుదామని చూస్తుంది. వైయుక్తిక చేతనకు (Individual Consciousness) ద్వితీయ స్థాయి ప్రాధాన్యతను ఇచ్చి—విశ్వచేతనకు (Universal consciousness) ప్రథమస్థాయి ప్రాధాన్యతను ఇస్తుంది. అంతేకాదు — వైయుక్తికచేతన విశ్వచేతనలో లేదా ''హేతువు''లో ఒక చిన్నభాగం మాత్రమే అనికూడా అంటుంది. ప్రఖ్యాత తత్వవేత్త హెగెల్ ''థీసిస్'' ''ఏంటీ థీసిస్'' ''సింతసిస్''అంటూ ప్రతిపాదించిన గతి తార్కిక వాదంలో "System'' కున్న ప్రాధాన్యత మనిషికిలేదు. ఈవిధంగా మాస్తే అటు 'నేచురలిజమ్' లోను, ఇటు హెగెల్ 'రియలిజమ్' లోనూ, మనిషి అస్తిత్వానికి సరి అయిన స్థానం లభించలేదని తెలుస్తోంది. అందుచేత - అంతకు ముందువున్న తాత్విక సిద్ధాంతాలను వ్యతిరేకిస్తూ మనిషికి ప్రాధాన్యత యిస్తూ అస్తిత్వవాదం ప్రత్యేక సిద్ధాంతంగా రూపొందింది.*

అస్తిత్వవాదానికి మూలపురుషుడు పందొమ్మిదో శతాబ్దానికి చెందిన కీర్క్‌గార్డ్ అని అంటారుగానీ — అస్తిత్వవాద ధోరణులు సోక్రటీసు కాలం నించీ వున్నట్టుగా చెప్పవచ్చు. రాధాకృష్ణ పండితులు బౌద్ధమత కాలంనించీ అస్తిత్వవాదధోరణులుఉన్నట్టుగా చెబుతారు. ఉపనిషత్తులు చెప్పేది తన గురించి తాను తెలుసుకోవాలని (ఆత్మానామ్‌విధి) — ఇది మాత్రం అస్తిత్వవాదం కాదా అంటారాయన ''ప్రాక్పశ్చిమ తత్వశాస్త్ర చరిత్ర''లో.

ఏది ఏమైనా — అస్తిత్వవాదం మనిషికి సంపూర్ణమైన స్వేచ్ఛను యిస్తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం మానవునికి తన యిష్టప్రకారం ఆలోచించుకోడానికి, అనిశ్చితమైన విషయాల్లో ఏదో ఒకదానిని ఎంచుకోడానికి — అసలు దేన్నీ ఎంచుకోకుండా వుండడానికీ కూడా స్వేచ్ఛ వుంది.

తనను తాను తెలుసుకోవడంవల్ల, తనలో జరుగుతున్న మార్పుల్ని గమనించడంవల్ల మాత్రమే మానవుడు తన నిజ విలువ గ్రహించగలుగుతాడు వ్యక్తి ఈ విధమైన నిర్ణయాలకు రావడంలో 'వ్యవస్థ'కు ఏ విధమైన అధికారమూ వుండకూడదు.

---

(1) "— The genuine critical dilemmas of the individual's life ... are not solved by intellectual exploration of the facts nor of the laws of thinking about them. Their resolutions emerge through conflicts and tumults in the soul, anxieties, agonies perilious adventures of faith into the unknown territories.

(Philips mairet – "Existentialism and Humanism" గ్రంథానికి వ్రాసిన పరిచయంలో)

(2) "— Existentialism is thus a reaction of the Philosophy of man againist the exesses of the philosophy of Ideas and the philosophy of things—'

(Emmanuel Mounier–Existentialits Philosophies—)

ఆఖరికి ఇందులో భగవంతుడికి కూడా ప్రమేయం వుండకూడదు అంటారు నిరీశ్వర వాదులయిన అస్తిత్వవాదులు అయితే—అస్తిత్వ వాదుల్లో ఈశ్వరవాదులు అంటే ఆస్తికులు కూడా వున్నారు.

అస్తిత్వవాదంలో 'వ్యతిరేకత'కు అవకాశం ఎక్కువగావుంది. ఈ వ్యతిరేకత స్వేచ్ఛాయుతమైన 'ఇచ్ఛ'నుండి వెలువడింది కాబట్టి మనిషిచేసే పనులు ఊహాతీతంగా వుంటాయి. హేతువాదంతో చూస్తే అంతుపట్టవు. అస్తిత్వవాద ప్రధానసూత్రం Irrationality — కార్యకారణ భావశూన్యత జీవితంలోని అసంబద్ధత (absurdity) వీరిని బాగా ఆకర్షిస్తుంది. ఈ సిద్ధాంతం ప్రకారం మనిషి ఒక్క దుడుకులో మారిపోవచ్చును. జీవిత స్వరూపాలు మారిపోవచ్చును.

'వ్యక్తి' అనేది సంపూర్ణంగా తయారయిన పదార్థంకాదు. నిత్యం మారుతూవుంటాడు. తనను తాను అన్వేషించుకోవడం అనంతంగా జరుగుతూ వుంటుంది. ఈ అన్వేషణలో మనిషి అనేకమైన పనులు చెయ్యవచ్చు. వీటి బాధ్యత పూర్తిగా ఆ వ్యక్తిదే. మనిషి తన అస్తిత్వానికీ,—తానుచేసే కర్మలకీ పూర్తిగా బాధ్యుడు కావడంచేత —మనిషికన్నా శక్తివంతమైందీ, మనిషి ప్రవర్తనను నియమబద్ధం చేసేదీ—అయినశక్తి మరేదీ లేకపోవడంచేత, మనిషి తాను చేసిన తప్పులనించి తలదాచుకుందామన్నా అవకాశంలేదు. ఆ బాధ్యత సంపూర్తిగా అనుభవించాల్సిందే. ఈ గురుతర బాధ్యత మనిషిని వ్యథకు గురిచేస్తుంది. మనిషికి లభించే స్వేచ్ఛ ఓ విధంగా బాధాకరం అవుతుంది కూడాను.

జీన్ పాల్ సార్త్రే అస్తిత్వవాద సిద్ధాంతాన్ని వివరిస్తూ మనిషిలో వుండే రెండు విభిన్న పరిస్థితులను చెప్పాడు. మనిషి తనలో తాను వుండేదానికీ (Being in it self–Etre Ensoi) తన కోసం తాను వుండేదానికీ (Being for it self-Etre pour soi), గల తేడాను వివరించాడు. తనలో తాను వుండడం అంటే అచైతన్య స్థితి. తనకోసం తాను వుండటమనేది చైతన్యస్థితి చైతన్యవంతుడైన మానవుడు 'తనలో తాను' వుండలేడు. తననుంచి తనను విడిపించుకొని చైతన్యంతో ముందుకు పోదామనుకుంటాడు. అంటే— అచేతనమైన 'Ensoi' నుండి బయటపడి చైతన్య స్ఫూర్తిగల 'Poursoi' కి చేరుకొందామనీ—ఈ రెండింటినీ సమైక్యం చేద్దామనీ అనుకొంటాడు. అయితే, ఈ కలయిక అస్వాభావికమైంది కావడంచేత 'Ensoi' నించి పూర్తిగా బయటపడలేకా — 'Poursoi'తో పూర్తిగ సంలీనం కాలేకా, అనంతాన్వేషణకు, తీవ్రమైన ఆందోళనకు గురి అవుతున్నాడు—అంటారు ఈ సిద్ధాంత కర్తలు.

ఈ విధంగా మనిషిలో జరుగుతున్న సంఘర్షణను, అశాంతిని ప్రధాన ఇతివృత్తంగా తీసుకుని అస్తిత్వతత్వాన్ని ఇరవయ్యో శతాబ్దంలో సాహిత్యంలో కొందరు ప్రతిపాదించారు. అస్తిత్వవాద దృక్పథంతో నవలలు, కథలు, కవితలు, నాటకాలు, విశ్వసాహిత్యంలో వెలువడసాగాయి. అయితే—అంతమాత్రాన అస్తిత్వవాద దృక్పథం సాహిత్యంలో యిటీవలి పరిణామమని అనుకోడానికి వీలులేదు.— "Existentialism and the Modern French Novel" అనే వ్యాసంలో—Robert Chapigny యిలా అంటాడు: "First of all it could be maintained that every work of literature is existential, if not existentialist. The philosophic critics of existentialism are wont to deplore its literary turn. As a matter of fact, the existential reflection about men and things is not fundementally different from a point of view, at least from the point of view of thinking Novelists, dramatists, and poets—" ఏ పేరుతో అయినప్పటికీ సాహిత్యానికీ, అస్తిత్వవాదానికీ ఉన్న సంబంధం అతి పురాతనమైంది. షేక్స్పియర్ మహాకవి నాటకాల్లో కూడా అస్తిత్వవాదపు పోకడలు ఉన్నాయని కొందరు సాహిత్య విమర్శకుల అభిప్రాయం మనం ఏనాటికీ మరచిపోలేని కింగ్‌లియర్, హేమ్లెట్, వీళ్లిద్దరూ విలక్షణమైన వ్యక్తిత్వం కలిగినవాళ్లే తమను తాము అన్వేషించుకుంటూ జీవన సంగ్రామంలో పెను తుపానులకు గురిలయినవాళ్లే. ఈ విషయాన్ని గురించివ్రాస్తూ—"The Existential imagination" అనే సంకలనంలో ఫ్రెడ్‌రిక్, ఆర్. కార్ల్, లియోహేమాయిన్ అనే సాహిత్య విమర్శకులు కింగ్‌లియర్, హేమ్లెట్, నాటకాలు సార్త్రే, కేమూ, మొదలయిన రచయితలు చెప్పిన విషయాల్లో క్రొత్తవి ఎవీ లేవని చెబుతాయి అన్నారు. ఏది ఏమయినా ఒక విషయం మాత్రం స్పష్టం అస్తిత్వవాద ఉద్యమం సాహిత్యంలో ఇరవయ్యో శతాబ్దపు పరిణామం కావచ్చు గానీ — పేరు ఏమైనప్పటికీ ఈ తరహా దృక్పథంతో సాహిత్యానికి చాలకాల నించి పరిచయం వుంది. అయితే — మొదటి, రెండు, ప్రపంచ యుద్ధాల సమయంలో ప్రపంచంలో వ్యాపించిన నిరాశా నిస్పృహల ప్రభావం సాహిత్యంపై అస్తిత్వ వాద ముద్ర బలంగా పడేందుకు దోహదాన్ని కల్గించింది. సార్త్రే, కాఫ్కా, కేమూ, మొదలయిన రచయితలు అస్తిత్వవాద ధోరణిలో మంచి రచనలు చేశారు. దోస్తొవిస్కీ మొదలయిన 19 వ శతాబ్ది రచయితల రచనల్లో కూడా అస్తిత్వవాద ధోరణి కనబడుతుంది. దోస్తొవిస్కీ రచించిన "బ్రదర్స్ ఆఫ్ కర్మజోవ్—" నవలను అస్తిత్వవాద దృక్పథానికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

"Man is nothing but that which he makes of him self" అన్న ఫ్రెంచి నవలా కారుడు జీన్ పాల్ సార్త్రే అస్తిత్వవాద దృక్పథంతో చేసిన రచనలు మనం మరచిపోలేం. రెండో ప్రపంచ యుద్ధ ప్రభావం వల్ల మానసికంగానూ, శారీరకంగానూ, చాలా కష్టాలు పడిన సార్త్రే, విషాదజీవుల గాథలను తర్కానికి అందనిరీతిలో నవలల్లో చిత్రీకరించాడు. పాత్రల విషయంలోనేకాదు— నిజజీవితంలోకూడా సార్త్రె, అక్షరాలా అస్తిత్వవాది. సార్త్రె ఎన్నడూ ప్రభుత్వానికిగానీ, అధికారానికిగానీ తలవంచలేదు. తన 'యిచ్ఛ' చెప్పినట్టే నడుచుకున్నాడు. నాజీ ప్రభుత్వం తన ఫ్రాన్సు దేశాన్ని ఆక్రమించుకున్నప్పుడు 'అండర్ గ్రవుండ్'లో చాలాకాలం వుండి స్వేచ్ఛకోసం పోరాడాడు. ఆ తరువాత జనరల్‌డిగాల్ నాయకత్వంలో

ఫ్రెన్సు అల్జీరియాకు సంబంధించి వలసరాజ్యవిధానాన్నిఅవలంబిస్తు న్నప్పుడు అల్జీరియా స్వాతంత్ర్యంకోసం ఎలుగెత్తిపోరాడాడు. ఫ్రెంచి యువకులు అల్జీరియాలో సైనిక కార్యకలాపాలు నిర్వర్తించకూడ దని అలజడి లేవదీశాడు. 1965 లో తనకు నోబెల్ బహుమతి వస్తే — ఆ బహుమతి అక్కర్లేదు పొమ్మన్నాడు. ఇందుకు అతడు చెప్పిన కారణం ఇంకా విశిష్టమైనది. — "రచయిత ఒక వ్యవ స్థగా మారిపోవడం అన్నదాన్ని అంగీకరించకూడదు. - అది ఎంత గౌరవమైనరీతిలో వున్నాసరే — నేను జీన్‌పాల్‌సార్త్రే అని సంతకం చేసిన దానికీ, జీన్‌పాల్‌సార్త్రే నోబెల్ బహుమతి గ్రహీత అని సంతకం చేసిందానికీ చాలా తేడా వుంది " అన్నాడు.

ఇలాంటి అస్తిత్వవాది సృష్టించిన పాత్రలు ప్రత్యేకతతో ఉండటంలో ఆశ్చర్యంలేదు." — నన్ను నేను సృష్టించుకున్నట్టే నా విలువలను సృష్టించుకునే హక్కు కూడా వుంది—" అని సార్త్రే పాత్రల విలువలు ప్రత్యేకమైనవి. అయితే, ఈ విలువలు వ్యవస్థను వ్యతిరేకించేవీ కావచ్చు, అంగీకరించేవీ కావచ్చు. అయితే, అవి స్వయంగా ఏర్పరుచుకున్న విలువలు. ఉదాహరణకు సార్త్రే, రచించిన "Intimacy" లో భార్య భర్తలుంటారు. భర్త నపుంసకుడు. భార్య అతడిని విడిచి పెట్టెయ్యడానికి అవకాశం వుంది. చట్టం అందుకు వొప్పుకుంటుంది. స్నేహితులు అదే సలహా యిస్తారు. అయినా, భర్త అంటే అభిమానంగల భార్య అతడిని విడిచిపెట్టదు. ఇదీ అస్తిత్వవాద దృక్పథమే. అదే విధంగా "ఏజ్ ఆఫ్ రీజన్" లో మార్సెల్ అనే యువతి మాథ్యూ అనే తత్వశాస్త్ర ఉపాధ్యాయుని ప్రేమించి, శరీర సంబంధం పెట్టుకొని, గర్భవతిఅయి, —ఎబార్షన్ చేయించుకొందామనుకొని, ఆ తర్వాత —మాథ్యూ అన్న డేనియల్‌ను పెళ్లాడేస్తుంది. ఇదీ అస్తిత్వవాద దృక్పథమే.

సార్త్రే వ్రాసిన "రూమ్" అనే కథలో భర్తకు పిచ్చి ఎత్తి భార్యను గుర్తించలేకుండా ఉన్నస్థితిలో—అంతేకాదు—ఆ పిచ్చిభర్త ఎప్పుడయినా తనను చంపేస్తాడేమోనన్న అనుమానం ఉన్న పరిస్థితిలో — పిచ్చాసుపత్రిలో చేర్పించకుండా యింట్లోనే వుంచి అతని ప్రక్కన పడుకునే భార్య కథ వుంది. ఈ పిచ్చిప్రేమను విమర్శకులు "Bad faith" కు ఉదాహరణ అని అన్నారు. నీకున్నది మంచి నమ్మకమా, చెడ్డ నమ్మకమా, అన్న ప్రశ్నలేదు ఇక్కడ. నీ నమ్మకం ప్రకారం నడుచుకోమనే అస్తిత్వవాదులు చెప్పేది.

ఇలా ప్రతివ్యక్తి తన విలువల ప్రకారం ప్రవర్తిస్తుంటే— సమాజం అనేది ఎలా నిలుస్తుంది ? — మనిషికీ మనిషికీ మధ్య సంహీభావం ఎలా కుదురుతుంది ? — అనేది విమర్శ ఇలాంటి విమర్శల కారణంగానే అస్తిత్వవాదాన్నీ — అస్తిత్వవాద ప్రభావంగల రచనల్నీ సంప్రదాయవాదులు నిందించడం ప్రారంభించారు. దోస్తొ వస్కీ గురించి చెబుతూ ప్రఖ్యాత కవి డబ్ల్యు. హెచ్ ఆడెన్ అంటాడు — "Society could not exist if every body were like Dostoyevsky or his Characters. — " అని. ఈ కారణంవల్లనే ఈ సిద్ధాంతం తీవ్రవివాద గ్రస్తమైన సిద్ధాంతంగా తయారైంది. హేతువాదులు, మార్క్సిస్టులు, ఈ సిద్ధాంతాన్ని ఎన్నివిధాలదుయ్యబట్టాలో అన్నివిధాల దుయ్యబట్టారు.

ఈ సిద్ధాంతంలోవున్న 'నిహిలిస్ట్'(అన్నింటినీవ్యతిరేకించేధోరణి)ధోర ణిని విమర్శిస్తూ మార్క్సిస్టువిమర్శకులుయుద్ధాలకు.సంక్షోభాలకు, పెట్టుబడిదారీ సిద్ధాంతం తట్టుకోలేకపోయినఫలితంగాపుట్టుకొచ్చిన సిద్ధాంతంగా దీనినిఅభివర్ణించారు. "అడ్డూఅదుపూ లేకుండా మనిషి చేసే ప్రతిపనిలోనూ మనిషియొక్క గౌరవంవుంటుందంటే మేముకు సమర్థించలేం - " అన్నారు వాళ్లు. అదిన్నీగాక— మార్క్సిజమ్ వ్యక్తికన్నా వ్యవస్థకు ప్రాధాన్యతను ఇస్తుంది. హేతువాదాన్ని నమ్ముకొంటుంది. అలాంటప్పుడు అస్తిత్వవాదం మార్క్సిజమ్‌కు చుక్కెదురు కావడంలో ఆశ్చర్యంలేదు.

అస్తిత్వవాదాన్ని విమర్శించిన వారిలో మతాధికార్లు కూడా వున్నారు. అస్తిత్వవాదంలో రెండు రకాలయినవి ఉన్నాయి. ఈశ్వర వాదం ఒకటి నిరీశ్వరవాదం ఒకటి. సార్త్రే నిరీశ్వరవాది. ఈ విషయాన్ని వివరిస్తూ అస్తిత్వవాదాన్ని విశ్లేషణ చేసిన Marjorie green ఇలా వ్రాశారు "సార్త్రే దృక్పథంప్రకారం తనలో తాను అన్వేషించే 'ఒడిస్సీ' యొక్క స్వయం తత్వపు ప్రథమ కర్తవ్యం ఏమంటే — భగవంతుణ్ణి వెదకడంకాక, నిరాకరించడం -"—ఇలాం టప్పుడు సార్త్రేసిద్ధాంతాలను ఆస్తికులు దుయ్యబట్టడంలో ఆశ్చర్యం ఏముంది? *

అయితే — అస్తిత్వవాద దృక్పథం పేరుతో అయోమయ సిద్ధాంతాలు — తుదీ మొదలూ లేని నవలలూ, ఇతర సాహిత్య ప్రక్రియలూ, వెలుగులోకి రావడానికి ప్రయత్నించిన సందర్భాలు లేకపోలేదు. "T. S. Eliot - His mind and rt" అనే పుస్త కంలో A. G. George ఇలా అంటాడు —

"— As the word goes round, every treatise that dooms man to destruction-Every novel whose Characters are mad or bad–Every play that depre. sses without elevating is labelled 'So Existential' - and hence existentialism comes to mean the shock-ing, the sordid or the obscene."

ఈ సిద్ధాంతం, ఈ సిద్ధాంతాన్ని అనుకుని వచ్చిన రచనలు తెచ్చిపెట్టిన అపోహ మాట ఎలావున్నా - ఇందులోని విశిష్టతను మాత్రం మనం మరచిపోకూడదు. ఈ సిద్ధాంతాన్ని మొత్తంమీద సమీక్షిస్తూ రాధాకృష్ణ పండితులు అన్నమాటలు గుర్తుపెట్టుకో దగ్గవి.

"—ఈ వాదంలో కొన్ని లోట్లు వున్నప్పటికీ—మానవుని వ్యక్తిత్వానికీ, ప్రత్యేకతకు, వీరు యిచ్చిన విలువమాత్రం మెచ్చుకో దగ్గది మానవుడు కొరముట్టుగా పరిగణించబడుతూ, ఒకవర్గం కోసమో, ఒక ప్రభుత్వంకోసమో ఆహుతి కావడమే ఘనమనేభావం వున్న ఈ రోజులలో మానవుని వునికికి ఒక ప్రత్యేకత వుందనీ, మాన వుని బాహ్య జీవితమే గాక అంతరంగ జీవితం అనేది ఒకటి వున్న

* కాల్ జాస్పర్స్, కాఫ్కా, మొదలయిన వారు ఈశ్వరవాదు లయిన అస్తిత్వవాదులు.

దనీ, దీని స్వభావం సమిష్టి నియమాలకు అంతుపట్టదనీ చెప్పడం ప్రపంచానికి మేలు చెయ్యడమే అవుతుంది—''

## 2

తెలుగు నవలాసాహిత్యంలో వ్యక్తివాదానికి పట్టాభిషేకం చేసినవాడు చలం. సాంఘిక నీతులకు, వ్యవస్థా నియమాలకు వ్యతిరేకంగా ఆయన తన రచనలద్వారా ఒక మహాయుద్ధాన్ని ప్రకటించాడు. ''—నీతి చాలా గొప్పవిషయమూ, అవసరమైన విషయమూ కావచ్చు. కాని, నీతి గట్టిగా మనసుకి పట్టిన మనుషులు అందానికి అంధులవుతారనడంలోనే వుంది నీతిలోని నీచత్వం. ఎందుకంటే, దేవుడేవుంటే అతను నీతికన్నా, అందానికి చాలా దగ్గిర. సృష్టి అంతా అందం. ఒక్క కుచ్చితపు మానవుడిలోనే ఈ నీతి—'' అంటుంది చలంగారి లాలస 'జీవితాదర్శం'నవలలో. చలంగారి పాత్రలకు సంప్రదాయకమైన నీతులతో సంబంధంలేదు. తమ 'ఇచ్ఛ' ఎలా చెబితే అలా చేశాయి. అయితే ఈ విధంగా చేయడం వల్ల ఏమన్నా సుఖపడ్డాయా? అంటే, అదీలేదు. లౌకికమైన కొలమానం ప్రకారం వాటి సంతృప్తిని కొలవడం అవివేకం. ఆయన రచనల్లో సాధారణ ప్రమాణాల ప్రకారం సుఖంగా బ్రతుకుతున్నారని చెప్పబడే సంసారాలనుండి బయటపడి—కష్టాలను కోరి వరించుకున్న పాత్రలు చాలా కనబడతాయి. అయితే—యివి కష్టాలని కొందరనుకున్నట్టుగా ఆ పాత్రలు అనుకోకపోవచ్చు. చలం తగువు ముఖ్యంగా వివాహ వ్యవస్థతో ''—యితడు నా భర్త. ఈమె నా భార్య ఎవరికీ దక్కనీక నాదాన్ని చేసుకోవాలి. యావజ్జీవితమూ అనుభవించాల. అదేగా పెళ్లి—?'' అంటూ చలం వివాహ వ్యవస్థను నిశితంగా విమర్శించాడు. స్త్రీకి సెక్సు విషయంలో స్వాతంత్ర్యం వుండాలని వాదించాడు. ''భర్తల నిరంకుశాధికారంనుండి బైట పడండి. లేచిపొండి. నీమలు, అధములు అవుతారా, జీవితం నాశనం అవుతుందా, కానీండి—'' *అనే చలం ఈ స్వేచ్ఛాన్వేషణలో సుఖం వుందని చెప్పడు. స్వేచ్ఛగా బ్రతకమని మాత్రమే చెబుతాడు. ఈవిధంగా ఆలోచిస్తే—చలం వ్యక్తివాదంలో అస్తిత్వవాద ధోరణులు కొంతవరకూ కనబడతాయి. అయితే చలం తన నవలల్లో చెప్పదలచుకున్నది ఎగ్జిస్టెన్షియలిస్టిక్ ఫిలాసఫీకాదు. ఆయనే తన మాటల్లో చెప్పుకున్నట్టు— ''చలం గోలంతా పుత్తూలోంచి, మామూలు జనంలోంచి, తిరిగి తిరిగి రోజూ ఒకే పనిలోంచి, ఆలోచనలోంచి, నాది నా కోసం అనే ఇరుకు గాడిలోంచి మేలుకోండి—'' అని మాత్రమే. ఈ 'గోల' వ్యక్తి వాదంలోంచి పుట్టుకొచ్చిందికనుకా— వ్యక్తివాదం, అస్తిత్వవాదం సన్నిహితమైనవి కనుకా—కొన్ని పరిస్థితుల్లో చలం అస్తిత్వవాదిలా కనబడతాడు.

పాశ్చాత్యుల అస్తిత్వవాద ప్రభావంతో తెలుగులో వచ్చిన మొదటి నవల బహుశా, బుచ్చిబాబు వ్రాసిన ''చివరకు మిగిలేది''. ''జీవితంపై ఒక దృక్పథాన్ని కల్గజెయ్యాలన్న ఉద్దేశంతోనే ఈ రచన సాగింది. ఈ జీవిత రహస్యం, దాన్ని తెలుసుకోడానికి మానవుడుచేసే ప్రయత్నం ఏ గొప్ప గ్రంథానికయినా యివే పునాది. ఈ నవలకీ అదే పునాది—'' అని వ్రాసుకున్నాడు బుచ్చిబాబు ఈ నవల ముందు మాటలో.

ఈ నవలలోని దయానిధి చదువుకొన్నవాడు. అంతకుతగ్గ సంస్కారం వున్నవాడు. అయితే—యిలాంటి వ్యక్తికి—''నాతో నీకట్లో ఏం పని మీకు? రాత్రి పూట యింటికి రాకండి ఎప్పుడూ—అమ్మనూసిందంటే తన్నుద్ది''—అనే 'కోమలి' ప్రియురాలని ఊహించడానికే ఆశ్చర్యంగా వుంటుంది.

దయానిధి కోమలిని ప్రేమించాడా?—పోనీ కామించాడా?—ఈ ప్రశ్నలకి సమాధానం దొరికితే దయానిధి లాంటి విచిత్ర వ్యక్తి క్రాస్‌వర్డ్ పజిల్ సాల్వు అయిపోయినట్లే.

కోమలి సామాజికంగా తక్కువ స్థాయికి చెందిన పిల్ల. పైగా, దయానిధి తల్లిమీదవున్న కళంకాన్ని జ్ఞాపకం చేసి అతగాడి హృదయాన్ని గాయపరచడానికి వెనుకాడే మనిషికాదు. శీలవతి కూడా కాదు అయినా—ఆమె అంటే అతనికి ఎంతో అభిమానం. ఆమె అడిగినప్పుడల్లా డబ్బుయిస్తూంటాడు. ఆమె సారుగూర్లో ఎవడితోనోవుండి ఉత్తరాలురాస్తే, అడిగిన డబ్బు మనియార్డర్ చేస్తూ వుంటాడు. రాయలసీమలో వున్నప్పుడు లతగాడిని వెదుక్కుంటూ ఆమెవస్తే ఆప్యాయంగా ఆదరించాడు. పెళ్లాడమన్నా, కనీసం శరీరసౌఖ్యం అనుభవించమన్నా కాదంటాడు. ''—వొద్దు కోమలీ —నాకేమని పంచుకు పాడుచెయ్యకు. నాకు మిగిలింది ప్రేమ ఒక్కటే—'' అంటాడు. (పేజీ 206)

''—ఆమె ఎక్కడికి వెళ్లినా, ఎవరి హస్తాల్లో నలిగిపోయినా, ఏ దౌర్భాగ్యుడి దగ్గిర వంపులు పోగొట్టుకున్నా,—ఆమె హృదయం, దృష్టి, మానసిక వైరాగ్యం, అన్నీ నాకోసం కాచుకునివుంటాయి—'' అనుకుంటాడు దయానిధి. (పేజీ 105)

దయానిధికి నక్షత్రాలు, మేఘాలు హిమాలయ పర్వతాలు, కోమలి, అన్నీ ఒక్కటే—ఇవి లేకపోతే అతను జీవించలేడు. అయితే వాటినతడు వాంఛించడు అదొక చిత్తప్రవృత్తి.

కోమలికీ, దయానిధికీ, శారీరక సంబంధం లేకపోయినా—వీళ్లిద్దరిమధ్యా వున్నది శారీరక సంబంధమే అన్నది లోకం ఇలాంటి సంబంధం లేదని తెలిసినవాళ్లు... ''కోమల్ని ఏమన్నా చేస్తే పెళ్లి చేసుకోవలసి వస్తుందని భయపడ్డావు నైతికంగా పిరికి వాడవయ్యావు. నీతి తాలూకు ముసుగు కప్పుకున్నావు'' అని హేళన చేశారు. కాని, దయానిధి పిరికివాడు కాడు అయితే—దయానిధికి కోమలిమీద వున్నది కేవలం 'ప్లేటోనిక్ లవ్' (అమలిన శృంగారం) అని కూడా నమ్మబుద్ధి పుట్టదు. అసలు కోమలిలాంటి ఆడవాళ్ల విషయంలో అమలిన శృంగార భావానికి అవకాశం తక్కువ. ప్రేమించబడటానికి కావలసిన రసహృదయం ఆమెలోలేదు. కామించడానికి కావలసిన శరీరపు వొంపులు పుష్కలంగా ఆమెలో వున్నాయి. మరి- దయానిధి కోమలిని ఎలా ప్రేమించాడు? — అసలు అది ప్రేమేనా?—

''అట్లాంటి పిల్ల నీకెలా నచ్చింది బావా?'' అని అడుగుతుంది అమృతం దయానిధిని

* —చలం—గొర్రెపాటి వెంకటసుబ్బయ్య., పేజీ 370.

''ఏమిటో అమృతం—దానికి సమాధానం తెలిస్తే జీవిత రహస్యం తెలిసిపోను—'' అంటాడు దయానిధి (పేజీ 56)

కోమలి తను గురించి తాను ఎప్పుడయినా ఆలోచించిందో లేదో గాని,- దయానిధిమాత్రం అదొక చిక్కుప్రశ్న అనుకున్నాడు. అసలు కోమలి ఎవరు?—అన్న ప్రశ్నకు యదార్థమైన సమాధానం లేదంటాడు. కోమల్ని ఒక గాజు బీరువాలో పెట్టి—''నేనెవరు'' అన్న కాగితం అంటిస్తే — ఎన్ని సమాధానాలు వస్తాయో రచయిత చెబుతాడు. అయినా—దయానిధికి తనెవరో తనకి తెలిస్తేకదా— కోమలి ఎవరో తెలియడానికి.

ఇక,—దయానిధికీ, అమృతానికీ వున్న సంబంధం మరింత చిత్రమైంది. అమృతంలాంటి మనిషిని ప్రేమించకుండా వుండడం ఎవరికీ సాధ్యంకాదు. ఈ నవలలో దయానిధిని సహృదయతతో అర్థం చేసుకున్నది ఆమె ఒక్కతే. ఇలాంటి అమృతంతో దయానిధి అనుకోకుండా ఓ రాత్రి శరీర సంబంధం పెట్టుకుంటాడు. రచయిత స్పష్టంగా చెప్పడు గాని- అమృతానికి పుట్టినబిడ్డ దయానిధి బిడ్డే.

''—ప్రేమలేని వివాహం, వివాహం లేని ప్రేమ, వీటిలో మొదటిది వ్యక్తిని బాధిస్తుంది. రెండోది సంఘాన్ని బాధిస్తుంది నేననుకోవడం సంఘం బాధపడినా ప్రమాదంలేదు. వ్యక్తి సంతోషం ముఖ్యం'' అన్న దయానిధి ప్రేమలేని వివాహానికి సిద్ధపడ్డాడు పెళ్లిచేసుకున్నాడు. శోభనంనాటి రోజున మిత్రుల ప్రోత్సాహంతో, తాను రాజకీయవాది కాకపోయినా, కాంగ్రెస్ సభలో మాట్లాడి, బ్రిటిష్ ప్రభుత్వపు పోలీసులచే లాఠీదెబ్బలు తిని,—సంసారంలో చిచ్చుపెట్టుకున్నాడు. సర్కిల్ యిన్‌స్పెక్టర్ మామగారు భార్యను కాపురానికి పంపలేదు. భర్తగా అతడు నెరవేర్చిన విధి ఆమె అంత్యక్రియలలో పాల్గొనడమే.

దయానిధి ప్రవర్తన మొదట్నించీ తర్కానికిఅందదు. ''ఈ మనుషులు గోనె బస్తా మనుషులు. ఏ బస్తా ఖాళీగా వుండకూడదు. అందులో పుష్పాలు వెయ్యాలి. లేకపోతే రాళ్లు వెయ్యాలి. కట్టెలు వెయ్యాలి. ప్రతీవాణ్ణీ ఆ బస్తాలో దిగేసి చెట్టుకొమ్మకు వ్రేలాడ దీస్తారు—'' అనుకున్న దయానిధి, తన జీవితంలో ప్రతీ అంశం విషయంలోనూ సంఘంతో పోరాడాడు. ఒంటరి యాత్రికుడుగా తన జీవితసత్యాన్ని అన్వేషిస్తూ ప్రయాణం చేశాడు. అడుగడుగునా బాధలకు లోనయ్యాడు. వైద్యుడుగా ఘోర పరాజయాన్ని పొందాడు. పతిస్తిమితంలేని ఒక ఆడరోగిని యింట్లో వుంచుకుని ప్రజలచేత ఆమెకు, తనకు, రంకుకట్టించుకున్నాడు. వైద్యవృత్తికి స్వస్తిచెప్పి రాయలసీమలో గని త్రవ్వించడం ప్రారంభించాడు. ప్రాంతీయ దురభిమానాల కారణంగా గని త్రవ్వకం సర్వనాశనం అయిపోయింది. ఎక్కడికో తెలియని సుదూర తీరాలకు యాత్ర మిగిలింది.

''జీవితం నిరంతర యాత్ర. గమ్యస్థానంలేదు. నడవగలవా నువ్వు ?—'' అంటాడు కోమలితో. — ''ఓ'' అంటుంది కోమలి.

'' తన్ను తాను పరిపూర్ణంగా చూశాడు! ఎంత చిత్రం! ఎంత దగా! తన్ను తాను స్వీకరించి కౌగలించుకుని ఏకమయ్యాడు. ... చివరకు మిగిలిందేమిటి ? చివరకు మిగిలింది దాని సమాధానం కాదు. సమాధానం తెల్సుకునేటందుకు తను చేసిన యత్నాల జ్ఞాపకాలు — తనలో తను సమాధానపడటం అది మిగిలింది — '' అనుకుంటాడు దయానిధి. ఇది ఓ విధంగా అస్తిత్వవాదసారాంశం. దయానిధి అనే అస్తిత్వవాది జీవితాన్వేషణే 'చివరకు మిగిలేది' లో చివరకు మనకు కనబడేది.

''చివరకు మిగిలేది'' నవలమీద ''ఆఫ్ హ్యూమన్ బాండేజి'' ప్రభావం వుందంటారు కొంతమంది. సోమర్‌సెట్‌మామ్ ప్రభావం బుచ్చిబాబుమీద ఎప్పుడూ వున్నదే. పోతే, ఈ నవలకు సంబంధించి ''ఆఫ్ హ్యూమన్ బాండేజి'' లోని మిల్‌డ్రెడ్‌కూ, బుచ్చిబాబు కోమలికీ, కొన్ని పోలికలు కనబడవచ్చుగాని — అందులో ఫిలిప్ మన స్తత్వానికీ, దయానిధి మనస్తత్వానికీ చాలా తేడావుంది. అదీగాక— మిల్‌డ్రెడ్ అంత క్రూరురాలు కాదు కోమలి. అదిన్నీగాక-'చివరకు మిగిలేది' లో కనిపించినట్టుగా అస్తిత్వవాద ధోరణులు మామ్ నవలలో అంతగా కనబడవు.

అస్తిత్వవాద దృక్పథంతో తెలుగులో మంచి నవలలు వ్రాసిన వాడు గోపీచంద్. ఈయన రచించిన ''మెరుపుల మరకలు'' ''గడియపడని తలుపులు'' మొదలయిన నవలలు అస్తిత్వవాద ధోరణిలో వెలువడ్డాయి. గోపీచంద్‌గురించి చెబుతూ, ''రచయితగా గోపీచంద్'' అనే చిన్న పుస్తకంలో శ్రీ దోనేపూడి రాజారావు యిలా అంటారు—''-గోపీచంద్ సంఘంలోగాని, సాహిత్యంలోగాని, నియమాల నెప్పుడూ పాటించలేదు. వాటిమీద విద్రోహం చేశాడు. నియమాలుపెట్టి వ్యక్తుల కోర్కెల్ని అణగద్రొక్కడం సులరామూ ఆయనకు గిట్టలేదు. వాళ్ల కోర్కెల్ని బలపరిచాడు. వాళ్లస్వేచ్ఛకే హారతిపట్టాడు '' ఈ ధోరణిగల రచయిత కలం నుండి అస్తిత్వ వాద ప్రతిపాదక రచనలు వెలువడ్డం ఆశ్చర్యంలేదు. —అస్తిత్వవాద ధోరణిలో తెలుగులో వచ్చిన గొప్ప నవల ''మెరుపులమరక .''

''మెరుపుల మరకలు'' నవలలోని ఉషారాణి పాత్ర అతిచిత్ర మైనది. మెరుపు తెగెలా అందంగా కన్పిస్తూఉండే ఉషారాణిస్నైన జర్నలిస్ట్ క్రవర్తికి, శ్రీకాంత్‌కి, ఎడిటర్‌గారికి, మహాకవి చంద్ర వదనులకు,—అన్నట్టుమరచిపోయాను పూర్‌హెజ్‌బెండ్ రామానుజం గారికీ, వీళ్లందరికీ ఆరాధనాభావం వుందంటే అందుక్కారణం ఆమెలోని ఆకర్షణే—అయితే, ఉషారాణి కాముకురాలు కాదు. ఆమె కేదో కావాలి. ఏం కావాలో ఆమెకే తెలియదు. అందుకే ఈ అన్వేషణ. ఈ అన్వేషణలోని మజిలీలే వీళ్లందరూ. శ్రీకాంత్ చెల్లెలు పద్మ పాదాల పారాణి ఆరకుండానే ఆమె భర్త కమలా కరంతో ఉషారాణి సాగించిన రొమాన్సు చూస్తుంటే — ఆమె 'కామపిశాచి' అని అసహ్యం కలగవచ్చు. భార్యను గుడ్డిగా నమ్మి, ఆమె అమాయకత్వంపట్ల నమ్మకం పెంచుకొని—ఇంతమంచి భార్య దొరికినందుకు పొంగి పోతున్న రామానుజంగారిని బుట్టలో వేసుకుని దగాచేసిన ఉషారాణి శీలాన్ని కొందరు అసహ్యించుకోవచ్చు. కాని —

పుస్తకం పూర్తయేసరికి ఉషారాణి ప్రతిబింబం మన గుండెల్లో యింకోలా కనబడుతుంది. ఉషారాణి జీవితంలో మెరుపుల్లా మెరిసి అంతలోనే మాయమైపోయిన లౌకిక జీవితపు మరకల్ని అంతలోనే మరచిపోతాం. — ఏదో అనిర్వచనీయశక్తి ఉషారాణిని కొత్త కోణం లోంచి చూపుతూ వుంటుంది.

ఉషారాణి జీవితంలో స్టీరింగు దగ్గిర కూర్చున్నది సంప్రదాయం కాదు. భయంగాని, కట్టుబాట్లుగాని, అంతకన్నా కాదు. ఆమె 'ఇచ్ఛ' (Will) ఆమెను నడిపింది. వైవాహిక జీవితం గీసిన గిరి దాటడానికీ, Home - Sexaul ప్రవర్తనలో ఆనందం వున్న స్నేహితురాలి పక్కన పడుకోడానికీ, చివరకు — హిమాలయాలలో తపస్సు చేసుకుంటూ మహాతపస్వినిగా మారిపోడానికీ, ఉషారాణిని ఎగుడు దిగుడు రోడ్లమీద ముందుకు నడిపిందీ — ఆవేదనకు గురి చేసిందీ — ఈ 'ఇచ్ఛ' మాత్రమే.

ఉషారాణి ఇలా అనుకొంటుంది —

''—నిజంగా తనకు సుఖపడే అవకాశాలన్నీ వున్నాయి. కాని, ఎక్కడో అసంతృప్తి వుంది. ఒక్కొక్కసారి తన హృదయం ఏ అవకాశాలూ లేని నత్తగుల్లలా కనబడుతుంది. దేనితో పడితే దానితో నింపుకోడానికి అనువుగా వున్నట్లు కనబడుతుంది. ఏదో ఒక దాని మీద మనస్సు లగ్నమవుతుంది. అది లభ్యమైతే జీవితం ధన్యమైనట్లే అనిపిస్తుంది. కాని - అది లభ్యమైన కొద్దికాలానికే దానిమీద విరక్తి కలుగుతుంది. తనకు తృప్తిలేదు—ఎందుకని ?—''

— ఈ ప్రశ్నకు సమాధానం ఉషారాణికి హిమాలయాల మీదనే దొరికింది. నవల చివరిభాగంలో ఉషారాణి గురించి చెబుతూ రచయిత చక్రవర్తిచేత చెప్పించిన వాక్యాలు గుర్తుంచుకోదగ్గవి.

''— తన స్థాయికి సరిపడని జీవితంలో ఇరుక్కొని ఆమె కల్లోలపడింది. ఇప్పుడు తనస్థాయికి సరిపడిన జీవితాన్ని అందుకొని జన్మను చరితార్థం చేసుకొంది — '' అస్తిత్వవాదులు చెప్పేది అక్షరాలా యిదే.

లౌకికమైన సుఖాలతో తన జీవితాన్ని ముడిపెట్టుకొని - ఆ అగాధాల్లో తనను తాను చూచుకొందామని ఉషారాణి తాపత్రయ పడింది — కాని వాటిల్లో తన మనసు బొమ్మ కనబడక, మానసికంగా నానా క్షోభలూ పడి, చివరకు హిమవత్పర్వతాలపై అలౌకిక ఆనందానుభూతిని పొంది — ఆ మహదానుభూతిలో తనను తాను చూచుకోగలిగింది. చిన్ననాటి నుండీ వెతుకుతున్న ఆనందాన్ని చేత బుచ్చుకోగలిగింది.

గోపీచంద్ ఈ నవలను తాను ఇదివరకు నమ్మిన హేతువాద స్థితినుండి బయటపడి, — అరవిందుల సిద్ధాంత సౌరభాన్ని అందుకోబోయేముందు రాశాడు. గోపీచంద్ మానసికంగా నడుస్తున్న దోవను తెలియజేస్తుంది ఈ నవల. ఆస్తిక అస్తిత్వ వాదానికి ''మెరుపుల మరకలు'' ప్రతీక. అంతేకాదు — భారతీయ తత్వానికి కూడా ఈ నవల ఓ విధంగా ప్రతీక. అస్తిత్వవాదం భారతీయ తత్వానికి విరుద్ధమైంది కాదని ఇదివరకే వ్రాశాను. రాధాకృష్ణ పండితులు అన్నట్టు— ''అస్తిత్వవాదం అనేది పాతపద్ధతికి ఒక కొత్త పేరుమాత్రమే. ఉపనిషత్తులు, బౌద్ధమతం, మానవుడు ఆత్మజ్ఞానం పొందాలని చెబుతాయి. అజ్ఞానం స్వార్థానికి మూల కారణం...ఈ ప్రపంచంలో మనం అజ్ఞాన ప్రేరితులమై బ్రతుకు తున్నంతకాలం, కాలం చేతులో కొరముట్టుగా మాత్రమే వుండ గలుగుతాం. అందువల్ల వేదనానుభూతి సర్వదా వుంటుంది... మానవుడు తన్ను తాను అధిగమించాలి...కష్టాన్నుంచి, దుఃఖాన్నుంచి నిత్యతత్వ స్పృహను పొందగలిగినప్పుడే, తప్పుకోగలుగుతాడు.''*—

—ఆవేదననుండి తప్పుకోవడం మాత్రమేకాదు. ఉన్నతమైన ఆనందాన్ని కూడా అందుకోగలుగుతాడు. ఇటువంటి వేదనా భరిత ఆనందానుభూతికి నవలారూపమే గోపీచంద్ ''మెరుపుల మరకలు.''

గోపీచంద్ రచించిన ''గడియపడని తలుపులు''లో కూడా అస్తిత్వవాద ధోరణి కనబడుతుంది. ఇంచుమించు ఉషారాణిలాంటిదే ''గడియపడని తలుపులు'' కోటేశ్వరమ్మ. కోటేశ్వరమ్మ ఒక సిపాయ్ల మేడం. ఆమెను అనేకమంది అనేక విధాల ఉపయోగించు కున్నారు. ఆమెకు బోలెడంత పేరు, డబ్బు, దాని నంటుకొని నీడ లాంటి అపఖ్యాతీ వున్నాయి. ఆమె మొగుణ్ణి వదిలిపెట్టేసింది. రికమండేషన్లు చేసినందుకు డబ్బు పుచ్చుకుంటుంది. త్రాగుతుంది. మొగవాళ్లతో స్వేచ్ఛగా వుంటుంది. ఇవి అందరికీ తెలిసిన విషయాలు. తెలియనివి కూడా చాలా వున్నాయి. ఆ తెలియని వాటి ల్లోనే అసలు కోటేశ్వరమ్మ వుంది.

మొదటినించీ కోటేశ్వరమ్మ తనకు తోచినట్టుగానే ప్రవర్తించింది. భర్త మంచివాడయినప్పటికీ, అతడు తనని ప్రేమిస్తున్నాడని తెలిసినప్పటికీ తన మార్గానికి అడ్డుగా వున్నాడని అతడిని వదిలిపెట్టేసింది. అధికార్లతో సంబంధాల్ని పెట్టుకుని ''సొసైటీ మేడమ్''గా మారిపోయింది. కోరిన సుఖాలన్నీ సమకూరాయి. అయినా మనశ్శాంతిలేదు. అన్వేషణ పూర్తికాలేదు. ఆఖరికి సన్యాసాశ్రమంలో చేరింది. అల్లరి, అపఖ్యాతి తప్ప ఏమీ మిగలలేదు—చిట్టచివరకు కోటేశ్వరమ్మ తెలుసుకోగలిగింది తన అన్వేషణలో జరిగిన పొరబాటు ఏమిటో—అయితే, యిప్పుడామె ఆ పొరబాటును సరిదిద్దుకోగల స్థితిలోలేదు. తనకు మిగిలింది భర్త ఫోటో మాత్రమే.

కోటేశ్వరమ్మ తను ప్రయాణం చేస్తున్న మార్గంలోకాక-మరో మార్గంలో ఆనందం దొరుకుతుందనుకొంది. ఆ మార్గంలో ముళ్ళు, బురద, బాడి, తప్ప ఏమీ మిగలలేదు. తను వదిలి వచ్చిన మార్గమే మంచిదన్న నిర్ధారణకు వచ్చేసింది. అయితే—అప్పటికి కాలాతీతమైపోయింది. తలుపులకు కోటేశ్వరమ్మ తనకు తానుగా పెట్టిన గడియ విడిపోయింది. అయిలే, తలుపులుమాత్రం తెరుచుకో లేదు. ఈ నవలలో గోపీచంద్ వ్యవస్థను సమర్థించాడు. అయితే—

* —తత్వవేత్తలు—గోపీచంద్

ఈ నిర్ణయాన్ని వ్యక్తి తనకు తానుగా అన్వేషించి తెలుసుకున్నది మాత్రమే.

గోపీచంద్ "పిల్లతెమ్మెర" నవలలో కూడా వ్యక్తి చేసే ఇలాంటి అన్వేషణే కనబడుతుంది.

"మెరుపుల మరకలు"లోని ఉషారాణి, "గడియపడని తలుపులు"లోని కోటేశ్వరమ్మ, "పిల్లతెమ్మెర"లోని శమంతక మణి,—ఈ ముగ్గురూ ఒకే భావానికి మూడు రూపాలు.

"—ఈ జీవితంలో అస్తిత్వం తప్ప ఏదీ నిజం కాదు. ఆ అస్తిత్వం మన అనుభవంలోకి తెచ్చేదిమాత్రమే నిజం. వాటిని ఏదో వంకతో త్రోసిపుచ్చడం జీవితాన్నుంచి పారిపోవడమే అవుతుంది. మనం జీవితాన్ని ముఖాముఖి చూడాలి. చూచిన దానిని చదువరులకు చెప్పాలి. ఇదే సాహిత్యం—"—అన్న జీన్‌పాల్‌సార్త్రే భావాలకు పలువిధాలయిన కాల్పనిక రూపాలు యిచ్చాడు గోపీచంద్. ఈ పాత్రలు అన్నీ తమను తాము గుర్తుపట్టేందుకుచేసే అన్వేషణలో ముళ్లబాటల మీదుగానే ప్రయాణం చేశాయి. చెప్పరాని బాధలకు గురి అయ్యాయి. అన్వేషణలో సుఖంలేని మాట నిజమే. కాని, అన్వేషణ పూర్తి అయిన తర్వాత, తనను తాను గుర్తించుకో గలిగిన తర్వాత వ్యక్తిపొందే సంతృప్తి—ఆనందం—అనిర్వచనీయం. గోపీచంద్ నవలలు చెప్పేది ఈ సత్యాన్నే.

## 3

—ఇటీవలి కాలంలో వెలువడి పాఠకుల్ని విశేషంగా ఆకర్షించిన అస్తిత్వవాద దృక్పథంగల నవల 'హిమజ్వాల'—జీన్‌పాల్‌సార్త్రే మీద రిసెర్చిచేసి డాక్టరేట్ పట్టాను పుచ్చుకున్న శ్రీ సి. యస్. రావు (వడ్డెర చండీదాస్)గారు ఈ నవల వ్రాశారు.— 'వ్యక్తి వినా సంఘంలేదు. సంఘజీవనం అవసరార్థం మాత్రమే...సంఘం అనేది వ్యక్త్యంతర్గత జనితం. బాహ్యావాతావరణం మాత్రమే సంఘం కాదు' అనే ఈ రచయిత నవల కొన్నేళ్లక్రితం పాఠకుల్ని ఒక ఊపు ఊపింది.

ఈ నవలలోని గీత, కృష్ణచైతన్య, సార్త్రే తత్వాన్ని మూర్తీభవించుకున్నవి.

"నలిగి దుమ్ము కొట్టుకున్న చీర శరీరం వొంపులకి లొంగిపోయి సగం శరీరాన్ని బయటకు వదిలేసింది. నల్లనుకిలి కంఠం గీతలో ఇరుక్కుపోయింది. నూనె దుమ్ము కలసి చెరిగిన జుట్టులోంచి వచ్చినట్లుగా ఏదో వింతపరిమళం అతన్ని ఆవరించింది—" ఇదీ గీత అనే బి. ఏ. లిటరేచర్ అమ్మాయి హైదరాబాద్ నగరంలో కారుక్రిందపడి—డాక్టరు కృష్ణచైతన్యచే రక్షింపబడినప్పటి స్థితి.

దుమ్ములో పడిన ఈ అమ్మాయి సాక్షాత్తూ జీవం పోసుకున్న పాలరాతి విగ్రహం. ఈ విషయం 'నఫీజ్‌మంజిల్' అనే బ్రహ్మాండమయిన భవంతిలో వుండే ఫిలాసఫీ లెక్చరరు కృష్ణచైతన్య, అతగాడి ప్రియస్నేహితుడు అయిన జర్నలిస్ట్ శశాంక,—అంతేకాదు. కృష్ణచైతన్య నాన్న మరియు చీఫ్ ఇంజనీర్ సారథిగారు అందరూ అంగీకరించే విషయమే.

అయితే—గీత ఒట్టి పాలరాతి విగ్రహమేకాదు—ఆమెకీ మనసు వుంది. రొట్టె, బిస్కట్లు, చీరలు, అల్బర్ట్ కామూ, కాఫ్కా, వీళ్లమీద చర్చలూ—ఇవి మాత్రమేకాదు—ఆమెకు కావలసింది. అందుకే—ప్రొఫెసర్‌గారూ, మనిషికి ఆకలివేసేది ఒక్క కడుపులోనే కాదు—" అని ఉత్తరం రాసిపెట్టేసి వెళ్ళిపోయింది.

ఆ తరువాత, జీన్‌పాల్ సార్త్రేగారి శిష్యురాలిలాగా తన 'ఇచ్ఛ' ఏంచెబితే, అది చేసింది. బొంబాయి, విశాఖపట్నం హైదరాబాద్—వూళ్ళు మారింది యిష్టమున్న మగ స్నేహితులతో తిరిగింది. యిష్టం లేకుంటే ఫెడీమని లెంపకాయలు కొట్టింది. పెళ్లిచేసుకొంది. అంతలోనే పెడాకులుగా మార్చేసుకుంది. అంతటితో ఊరుకోక — కృష్ణచైతన్య తండ్రి సారథిగారితో రోమాన్సులో పడింది. వ్యవహారం పెళ్లిదాకా వెడుతుందిగానీ, అంతలోనే సారథి మరణిస్తాడు తండ్రి మరణించిన తర్వాత కృష్ణచైతన్య గీతలో తనను పెళ్లి చేసుకోమని అడుగుతాడు. "—నీకు నేను సవతల్లిని. నన్ను నువ్వు పెళ్లిచేసుకోకూడదు —" అంటుంది గీత. చివరకు ఆమె అతగాడిని పెళ్లి చేసుకునేదో లేదోగాని, — ఇంతలో పాత మొగుడు శివరామ్ ఆమెను హత్య చేస్తాడు. గీత అనే ప్రధానపాత్ర సంక్షిప్త కథ యిది.

ఈమె ప్రవర్తన హేతువాదానికిగాని, తార్కిక దృష్టికిగాని, ఎంత మాత్రమూ అందదు. ఆమె నఫీజ్ మంజిల్‌ను ఎందుకు వదిలిపెట్టి పోయింది ? — కట్టుకున్న మొగుడు శివరామ్‌పట్ల ఎందుకు విముఖురాలైంది ?—సమాధానంగా, సెక్సు విషయంలో సంతృప్తి లభించకపోవడం అని చెప్పా . అలాంటప్పుడు, ఆమెకు వీరెవ్వరిలోనూ దొరకని ఆనందం రిటైరై పోవడానికి సిద్ధంగావున్న సారథిగారిలో దొరికిందనుకోవాలా ?—పోనీ, ఒకవేళ అలా అనుకున్నా. — సారథిగారు చనిపోయిన తర్వాత శారీరకమైన ఆ బంధం తెగిపోవాలి కదా, — మరి, పెళ్లి అవకుండనే సారథిగారిని ఆమె తన భర్తగా ఊహించుకోవడంలో ఉద్దేశం ఆమె "ప్లెటోనిక్‌లవ్"వైపు మొగ్గుతోందహ ?—తనను ఎంతగానో ప్రేమించి, తన పొందు కోసం దాదాపుగా పిచ్చివాడైపోయిన కృష్ణచైతన్య కంటె, చనిపోయిన సారథిగారిమీద "సెంటిమెంట్"లాంటిది ఏర్పడ్డాన్నిబట్టి చూస్తే — ఆమెకు శారీరకమైన సంతృప్తుల మీద చిన్నచూపు కలుగుతోందనే కదా అర్థం. గీతలాంటి వ్యక్తిలో ఈ మార్పు హఠాత్తుగా ఎలా సాధ్యమైంది ? — ఇవన్నీ తర్కానికి అందని ప్రశ్నలు.

ఇక — కృష్ణచైతన్య ధోరణి యింతే. గీతతో అతగాడి ప్రేమ వ్యవహారం—చిదంబరంభార్య మాధురీదేవితో వ్యభిచరించడం, బజారు స్త్రీలతో తిరిగి ఆరోగ్యాన్ని పాడుచేసుకొని, చివరకు సన్యాసాశ్రమంలో చేరి "యింపాజిబులిటీ ఆఫ్ మెటా ఫిజిక్స్—అండ్ పాజిబులిటీ ఆఫ్ మెటా ఫిజికల్—" అనే విషయంమీద పరిశోధనా వ్యాసాన్ని రాయడం—వీటన్నింటిలోనూ కృష్ణ చైతన్య తర్కానికి అతీతంగానే ప్రవర్తిస్తాడు. — ఈ నవలలోని మాధురీదేవి ధోరణీ యింతే. ఇలా ప్రధానపాత్ర లన్నింటిచుట్టూ ఎన్నో చిక్కుప్రశ్నలు

కనబడతాయి. ఈ చిక్కు ప్రశ్నలకు పాత్రలు సంఘం నిర్దేశించిన తీరులోకాక — తమకు తోచిన తీరులో తాము పరిష్కారాలు అన్వయించుకుంటాయి ఆ ప్రవర్తనలో ఒకరకమైన విలక్షణత పాఠకులకు గోచరిస్తుంది. ఆ విలక్షణతే అస్తిత్వవాద ధోరణికి పాత్రను సన్నిహితం చేస్తుంది.

శ్రీ శీలా వీర్రాజు రచించిన "మైనా"లోకూడా ఈ తరహా అస్తిత్వవాద ధోరణి కనబడుతుంది. "— ఈ నవలలో ఒక జీవితాన్ని యథాతథంగా చూపించడానికి ప్రయత్నించాను. ఇది ఫోటో కాదు ఫోటో ధోరణిలో వేసిన చిత్రం. అదీ త్రీ డైమెన్షన్‌లో వేసింది—" అని చిత్రకారుడు, రచయిత, అయిన ఈ నవలాకారుడు చెప్పుకున్నాడు. అంతేకాదు — ఈ కథ సోమర్ సెట్ మామ్‌గాని, మొరేవియోగాని చెప్పి వుంటే అంతర్జాతీయ రంగానికి విస్తృతమై వుండేది అని కూడా చెప్పుకున్నాడు. వీటన్నింటిబట్టి మాస్తే రచయితకు మంచి నవల రాయాలనే రాసప్రయత్నం తప్పించి — అస్తిత్వవాద ధోరణిలో రచన చెయ్యాలనే కోరికలేదని స్పష్టమవుతున్నది. అయితేనేం—తెలిసో, తెలియకో, యిందులో అస్తిత్వవాద ధోరణి చోటు చేసుకుంది. ఇందులోని కథానాయకుడు సాయిబాబా జీన్‌పాల్ సార్త్రే, ఆల్బర్ట్ కామూ, ఇలాంటివాళ్ల గురించి తెలుసుకున్నవాడు కాదు. సాధారణమైన పోలీసు కానిస్టేబులు. కష్టాల్లో పెరిగిన సాయిబాబా చిన్నవయస్సులోనే బోలెడు జీవితానుభవాన్ని చూశాడు. కొన్నాళ్ల నేతపని చేశాడు. కొన్నాళ్ళు కమ్యూనిస్టులతో నాటకాలు ఆడాడు. ఇంకొన్నాళ్ళు ఎవరికీ చెప్పా చెయ్యకుండా మిలటరీ కంటోన్‌మెంట్‌కు పారిపోయి 'బాయ్స్ ఆర్మీ' లో చేరాడు. ఆర్థిక పరిస్థితులు, తండ్రి క్రౌర్యము, చిన్నతనంలోనే సాయిబాబా జీవితానికి తాడూ, బొంగరము లేకుండా చేశాయి.

కాస్త వయస్సు వచ్చిన తర్వాత,—సాయిబాబా కానిస్టేబుల్ ఉద్యోగం చేస్తూ తెలంగాణాలో వుండేవాడు. ఆ రోజుల్లోనే అతడిని ఒక సేట్‌జీ అమాయక హృదయంతో నమ్మి ఆదరిస్తే — అతని భార్య ముసియాతో లైంగిక సంబంధం పెట్టుకుని—ఆమె బిడ్డకు తండ్రి అయ్యాడు. ఆ తర్వాత, హఫీజా అనే తురకల అమ్మాయితో పరిచయం పెట్టుకుంటాడుగాని — "జలపాతం చూచి ఆనందించడానికిగాని స్నానం చెయ్యడానికి కాదు—" అనుకుంటూ—పొందుగోరే హఫీజాకు దూరంగా వుంటాడు. అయితేనేం — హఫీజా నెల తప్పడానికి కారణం సాయిబాబాయే అంటుంది లోకం యిది యిలా వుండగా, పోలీస్ కానిస్టేబుల్‌గావున్న సాయిబాబా హిందూ ముస్లిమ్ తగువుల రోజుల్లో, తన మిత్రుడయిన ఒక హిందువును రక్షించి కొన్నాళ్ళు సస్పెన్షన్‌లోవుంటాడు. క్షయరోగిఅయిన ఒక మిత్రుణ్ణి తన యింట వుంచుకొని క్షయరోగం తెచ్చుకుంటాడు. క్షయ ఆస్పత్రిలో చేరి — శీలవతి కాదని నలుగురికీ తెలిసిన డెరీసాతో స్నేహం చేస్తాడు. జబ్బు నయం అయిన తర్వాత, ఆమె రమ్మన్న చోటుకు బయలుదేరి — బస్సులోనే తన మనస్సు మార్చుకొని, బస్‌స్టాప్‌లో దిగడం మానేస్తాడు.

చిన్నతనంలో తను ముక్కువగా పెంచుకున్న మైనా లాగనే సాయిబాబా కూడా స్వేచ్ఛనే వాంఛించాడు. స్వేచ్ఛగా గాలిలోకి ఎగిరిన మైనా కాకుల వాతపడి అంతలోనే జీవితాన్ని కడమార్చుకుంది — అడ్డూ, అదుపూ లేని జీవితంలో సాయిబాబా ఎన్నో విపత్తులు పొందినా—చివరకు, వాటిని తమాయించుకొని నిలవగలిగాడు.

అస్తిత్వవాద దృక్పథంవున్న అన్ని నవలల్లాగానే — ఇందులో కూడా సాయిబాబా తనను తాను అన్వేషించుకొంటాడు. అయితే, నవల పూర్తయ్యేసరికి సాయిబాబా అన్వేషణ పూర్తి అయిందనే అభిప్రాయం పాఠకులకు కలగదు. ఈ నవలలో రచయిత చెప్పదలచుకున్న విషయంలో స్పష్టత కొరవడింది. సాయిబాబా — అస్తవ్యస్త జీవితయాత్రను అస్తిత్వవాది జీవితయాత్ర అనడానికి కొన్నిఇబ్బందులున్నాయి. అలా అని — యిందులోని అస్తిత్వవాద దృక్పథాన్ని విస్మరించటానికి వీలులేదు

## 4

అస్తిత్వవాదం పాశ్చాత్య సంస్కృతికి క్రొత్తదేమీ కాదని యిదివరకే రాశాను. ఈ కారణంచేతనే — కొందరు రచయితలు తమ నవలల్లో భారతీయ ఆధ్యాత్మిక తత్వాన్ని, అస్తిత్వవాదాన్ని కలపడానికి ప్రయత్నం చేశారు. శ్రీ ఎల్. ఎస్. సుదర్శనంగారు ఇటీవ రచించిన "సంసార వృక్షం—" నవలలో ఈ ప్రయత్నం చాలావరకు సఫలీకృతమైంది.

భగవద్గీతాకారుడు సంసారాన్ని రావిచెట్టుతో పోలుస్తాడు. కర్మానుబంధాలు విస్తరించిన వేళ్ళు. అసంగత్వం అనే కత్తితో వేళ్లని దృఢంగా ఛేదించి, ముక్తి మార్గాన్ని చూచుకోమంటాడు. ఇలాంటి అసంగత్వంకోసం ప్రయత్నించిన అస్తిత్వవాది కథనే ఈ నవలలో చెబుతారు సుదర్శనంగారు.

ఈ నవలలోని కథానాయకుడు ఆచ్ఛే ప్రాక్టీసులేని న్యాయవాది. అయితేనేం — సంసారం గడవడానికి లోటులేదు. వెనకాల పెద్దలు గణించిన ఆస్తిపాస్తులున్నాయి అతను హేతువాది. అలా అని భౌతికవాది కాడు. అద్వైత సిద్ధాంతంమీదా, ఆధ్యాత్మిక విలువల మీదా, నమ్మకం వున్నవాడు. తీరుబడి ఇచ్చిన అవకాశంతో ఆలోచించడం అలవాటు చేసుకున్నాడు.

— 'నేను' అంటే ఎవరు ? —

నేను, ఈ శరీరము, ఒకటి కాదు. ఈ శరీరమూ నాకు చెందిందే — ఈ సుఖానుభూతీ నాకు చెందిందే — నాకు రెండింటిమీదా మమకారం వుంది. అయితే—'చెందటం' వేరు, 'తాదాత్మ్యం' వేరు, — ఈ 'నేను' అన్నింటికీ వెలుపలే అతీతంగా వుంటోంది. దేశ కాల వ్యవహారాలకు 'నేను' కేవలం ద్రష్టను మాత్రమే !— అనుకొన్న కథానాయకుడు — ఈ 'నేను' అనే భావన ఆత్మస్థాయికి ఎదగాలనీ—ఆత్మస్వరూపాన్ని తెలుసుకోవాలనీ భావించాడు. అయితే, ఈ జ్ఞానాన్ని హేతుజ్ఞానంతో పొందగలనని ఆశించాడు.

అయితే—మన మతం, మన సంస్కృతి,- Intellect కన్నా, Intuition మీద అధికంగా ఆధారపడినట్టివి. నిజమైన ఆత్మ

జ్ఞానం కావాలంటే, బ్రహ్మజ్ఞానం కావాలంటే,—మేధస్సుతో ఆలోచించి, తర్కించి ప్రయోజనం లేదనీ—ధ్యానంవల్ల మాత్రమే అది సమకూరుతుందనీ, ఉపనిషత్తులు చెబుతున్నాయి. హేతువాదంవల్ల ఆత్మజ్ఞానం సమకూరదనీ,—దానికి పరిమితులు ఉన్నాయనీ ఈ నవల నాయకుడు స్వానుభవంతో తెలుసుకున్నాడు. అతగాడికి నిజమైన ఆధ్యాత్మిక విలువలు అనుభవంలోకి వచ్చేసరికి-అసలు సిసలైన అద్వైతతత్వం ఆచరణలోకి వచ్చింది. అందువల్లనే ఈ నవల చివరికి వచ్చేసరికి కథానాయకుడు, అంతకుముందు తను ఎంతగానో వ్యతిరేకించిన డాక్టర్ వీరభద్రరావు భావాలు—తన భావాలకు విరుద్ధమైనవి కావు అని తెలుసుకోగలిగాడు. — ''వీరభద్రరావు ఎవరో కాదు నాలోనివాడే!—'' అని అనుకోగలిగాడు.

అద్వైత తత్వవేత్త రాధాకృష్ణ పండితులు అంటారు - ''.........మనిషికి ఆధ్యాత్మిక చైతన్యం కలిగేటప్పటికి 'నేను' 'నీవు'గా కనబడుతుంది. తనే తనకు విడిగావున్న వస్తువుగా అనిపిస్తుంది. అంటే—తన్ను తాను పరామర్శించుకోగలిగిన శక్తి ఆవిర్భవిస్తుంది. ఈ స్థాయిలో కాలా కాశాలకు అతీతంగావుండి, అనుభవానికి పునాదిగావుండే వాస్తవికత తానేనని గుర్తిస్తుంది—''

ఈ అద్వైత తత్వాన్ని చేరుకొనేందుకు కథానాయకుడైన లాయరుగారు తీవ్రమైన శోధనకు గురిఅయ్యాడు. శ్రీ జిడ్డు కృష్ణమూర్తి చెప్పినట్లుగా అపనమ్మకాన్ని సానబట్టాడు. నమ్మకు ఎవరినీ—నిన్ను నువ్వు కూడా నమ్మకు అన్న కృష్ణమూర్తిగారి ధోరణి—అస్తిత్వవాది అయిన కథానాయకుడి జీవితయాత్రలో కనబడుతుంది. ఈ జీవితయాత్రే ఈ నవలలోని కథ. హేమసుందరి, సావిత్రి, వీరభద్రరావు, నల్లచెర్వు స్వామీజీ, అమియాబాబా, వీళ్లందరూ ఈ యాత్రలోని మజిలీలు. ''తర్కించవద్దు. ప్రశ్నించవద్దు. జపంచేస్తూ మంత్రానికి ధ్యానంద్వారా నిన్ను నువ్వు సమర్పించుకో —'' అని ఉపదేశం చేసిన అమియాబాబా, కథానాయకుడి జీవితయాత్రను మలుపు తిప్పిన మజిలీ.

ఇదివరకు వెలువడిన ఆస్తిక అస్తిత్వవాద నవలల్లో కొందరు రచయితలు—ప్రధానపాత్ర జ్ఞానోదయం అయిన తర్వాత, ఆ పాత్రను ఏ హిమాలయాలకో పంపిస్తే, -సుదర్శనంగారు మటుకు ఈ నవలలో జ్ఞానోదయం అయిన తర్వాత కథానాయకుణ్ణి గృహస్థాశ్రమానికి తిరిగి పంపించారు. అనొక ప్రత్యేకత, వైవిధ్యం, ఈ నవలలో.

—ఇలా పలువిధములయిన ధోరణులలో తెలుగులో అస్తిత్వవాద ధోరణి నవలలు కొన్ని వచ్చాయి. ఈ సందర్భంలోనే మనం భాస్కరభొట్ల కృష్ణారావుగారి 'వెల్లువలో పూచికపుల్లలు', 'వింత ప్రణయం', 'యుగసంధి', నవలలనూ కపిల కాశీ ప తి గా రి ''ఇంతకూ నేనెవరు?'', పి. వి. సుబ్బారావుగారి 'ఆమె చెప్పింది', కోడూరి శ్రీరామమూర్తిగారి 'నీటిలో నీడలు' మొదలయిన నవలల గురించి కూడా ప్రస్తావించాలి వీటిల్లో చాలా భాగం '70లకు ముందుగా వెలువడినవే.

ఇటీవలి కాలంలో సాహిత్యంపై అస్తిత్వవాద ప్రభావం క్రమంగా తగ్గుతోంది. సాహిత్యంపై మార్క్సిజమ్ ప్రభావం పెరుగుతూండడమే ఇందుకు కారణం అనుకుంటాను. ఎగిజస్టెన్షియలిజమ్ వ్యక్తివాదాన్ని సమర్థిస్తుంది హేతువాదాన్ని వ్యతిరేకిస్తుంది. మార్క్సిజమ్ ఇందుకు పూర్తిగా వ్యతిరేకం సమిష్టివాదాన్ని బలపరుస్తుంది. మార్క్సిస్టు సిద్ధాంతాలు హేతువాదంపైననే ఆధారపడి వున్నాయని వేరుగ చెప్పనవసరంలేదు. వ్యక్తివాదాన్ని ప్రోత్సహించే రచనలను ఈనాడు బూర్జువా రచనలు అంటూ విమర్శించడం మనం తరుచుగా వింటున్నాం. ఆ మధ్య ఓ విమర్శకుడు ఇలాంటి రచనలు ''తోమిన చెంబుల్లాంటి కళాఖండాలు ''* అంటూ వ్యంగ్యంగా వ్రాశాడు.

ఆ విమర్శలోని నిజానిజాలు ఎలా ఉన్నప్పటికీ—పూర్వకాలంతో పోల్చిచూస్తే, ఇటీవల కాలంలో వ్యక్తివాదానికి విలువ తగ్గుతున్నదనేది నిర్వివాదాంశం. అయితే—అంతమాత్రాన, సమిష్టివాదపు ప్రవాహంలోపడి వ్యక్తి కొట్టుకుపోవాలనీ—వ్యక్తికి ప్రాధాన్యతలేదనీ అర్థంకాదు వ్యక్తికి ప్రాధాన్యత లేనినాడు—వ్యక్తి సృజనాత్మక శక్తికి అవకాశం లేనినాడు; జాతి మనుగడకే ప్రమాదం సంభవిస్తుంది. వ్యక్తికి ప్రాధాన్యత నశించకుండా—వ్యక్తిమాత్రమే సర్వస్వం అనుకోకుండా, రచనలు చేయవలసిన అవసరం ఈనాడు వున్నది వ్యక్తి ధర్మానికీ—వ్యవస్థా ధర్మానికీ మధ్య వారధి నిర్మించగల శక్తి సాహిత్యానికే వున్నది.

* —పుర్ణాంగారు 'హిమజ్వాల' ముందు మాటలో.

---

# శబ్దపల్లవక్రియలు

(41 వ పేజీ తరువాయి)

లేవు. నారాయణీయాంధ్ర వ్యాకరణమున ''ఔపచారికము=లాక్షణికార్థము. వ్యుత్పత్త్యర్థ రహితమైయుండి సమస్తముగ నొక విలక్షణార్థమును దెలుపుచుండునని భావము'' అని చెప్పనైనది. అహోబలుడు సూచించిన ఆధారాధేయ సమన్వయం విస్పష్టము చేయబడలేదు. వ్యాకరణ సంహితా సర్వస్వంలో వజ్ఝల వారు దీనిని సమన్వయం చేయడానికి యత్నించారు. వీరి వాక్యములు (పుట 1687 వ్యా. సం. స) ''పూర్వావయవము ప్రథమాంతమగునపుడు—రూపఱు =రూపుచెడు =నశించు; పెంపఱు =పెంపుచెడు =క్షీణించు. రూపురూపఱెను అనుచో రూపము ఆధేయము. వాదు అనుతత్పదార్థ మాధారము. ఈ వాక్యము నందు నశించినది రూపమేయయినను నట్టి నశించుట యాధార భూత తత్పదార్థమునందు (వానియందు) ఉపచరితమగుచున్నదని గ్రహింపవలెను. ''అథర్వణుడును అహోబలుడును నచించిన ఉపచారము'' చక్కగా సమన్వితమైనది. శబ్ద పల్లవము పూర్వావయవము ప్రథమాంత పదమైనప్పుడే ఉపచారము నిర్దేశింపబడినది.

(ఇంకావుంది)

శ్రీమతి ఆర్. వసుంధరాదేవి

# సీతాకోకచిలుక

వంతెన మీద నిల్చున్నాను. క్రింద మహాగంగ నిండుగా, నింపాదిగా ప్రవహిస్తున్నది.

ఎక్కడ నుండో, ఎక్కడికో, ఎందుకో.

ఈ వంతెన మీద నిల్చుని దాన్ని అర్థం చేసుకోవడం సాధ్యమా ?

దానితో ప్రవహించవచ్చును గాని, దాన్ని అర్థం చేసుకోవడం ఏమిటి ? ! అర్థం చేసుకోవడం అనేది అర్థంలేని పిచ్చిమాట. చచ్చుమాట !

ఒక స్థితిలో దానితో ప్రవహించవచ్చు. మరో స్థితిలో వంతెన మీద నిల్చుని దాన్ని చూడవచ్చు. రెండూ సత్యమే. కాని యీ రెండు స్థితులకీ మధ్యన సంబంధం వున్నదా ?

ఎన్నో ఊహలు వాలో చిన్న అలల్లాగ అకారణంగా పుట్టి సోమరిగా తిరిగి వ్యర్థంగా సమసిపోతున్నాయి.

పాతికేళ్ళ క్రితం నేను అయిదేళ్ళ పిల్ల ఎవరూ అర్థం చేసుకో ప్రయత్నించని చిన్నది.

ఇక్కడి నుండీ వెనక్కి తిరిగి చూసుకుంటే ... ఒక బుద్ధి తెలియని పసివాణ్ణి. ఈ జీవన సంఘర్షణలో నా ఉనికికి ఆధారం, ఆలంబన అయిన అమ్మ నన్ను ఓర్పుగా లాలించి సేదదీర్చే ప్రేమమూర్తి. నాన్న నన్ను క్రమశిక్షణతో రూపు దిద్దుతున్న గురువు. యుగయుగాల మానవజాతి రూపొందించుకుంటూ వస్తున్న విజ్ఞానంలోకి నడిపించుకువచ్చే దైవం. అక్క యీ ఆటలో నాకు సహచరి.

...కాని యిదంతా నా ఇప్పటి ఊహ అప్పటి నా అనుభవాలు వేరు రెండింటికీ సంబంధమే లేదు ! పాతికేళ్ల క్రింద నేను గ్రహించిందీ, అనుభవించిందీ సత్యమా ? లేక అప్పటి నా గురించిన ఇప్పటి ఊహ సత్యమా ? అప్పటి నన్ను యీ ఊహతో గుర్తించి యీ అర్థం చెప్పుకోవటం సబబేనా ?

అర్థం అనేది చచ్చుమాట. అర్థంలేని మాట !

ఆ కృష్ణుడికీ యీ కృష్ణమూర్తికీ సంబంధం ఏమిటి !

ఆ క్రింద ప్రవహిస్తున్న మహాగంగకీ నేను చూస్తున్న మహా ప్రవాహానికీ సంబంధం ఏమిటి ?

నేనక్కడ ప్రవహిస్తున్నానా ? ఇక్కడ నుంచీ ప్రవాహాన్ని చూస్తున్నానా ?

...చూడగా చూడగా నేనూ ఆ ప్రవాహంలో కొట్టుకుపోతున్నట్లనిపించి భయం వేసింది.

నాలో ఏవో ధ్వనులూ, ప్రతిధ్వనులూ, జ్ఞాపకాల నీడలూ...

ఆ జీవన ప్రవాహంలో కొట్టుకుపోతున్న నేను అప్పటికి నాచుట్టూ విలువల్నీ, సూత్రాల్నీ లైఫ్‌బోట్లుగా అల్లుకోలేదు. నింపాదిగా నిలబడి చుట్టూ పరికించి చూడటానికి అవసరమైన ఆలోచనల వంతెనలు కట్టుకోలేదు. వుత్త అసహాయుడైన పిల్లవాణ్ణి. ఏదైన అడ్డం వచ్చినప్పుడు లోనికి మునుగుతూ మళ్లీ పైకితేలుతూ ప్రవాహంలో పోతూవున్నాను.

మునగటం. తేలటం. మునగటం.

## 2

నాకు ఊహ తెలిసినప్పటి నుండి నా ప్రపంచంలో ఒకే మనిషి ఉన్నది — అక్క.

అమ్మ వున్నా ఆమె వేరే మనిషి కాదు. నేనే.

నాన్న వేరే అయినా నా నాన్నే.

అక్క మాత్రం మనిషి.

ఆమె చాల పెద్దది చాల దుర్మార్గురాలు.

ఒక రోజున నాతో ఏమి చెప్పిందంటే బాగా అన్నం తిని పాలు తాగి యింకా పెద్దగా అయిపోతానన్నది నాకు భయం వేసింది. 'ఇంకా పెద్దగా అయిపోతే నాకు యింకా గట్టిగా మొట్టికాయ వేస్తావా ?' అన్నాను సందేహంగా. 'వేస్తాను' అని హుంకరించింది. ఈ అవాంతరం ఎట్లా ఎదుర్కోవాలో నాకు తెలియలేదు. కాసేపు అట్లాగే నిల్చుని ఆవిడకేసి చూశాను. 'ఇంకా మూడుసంవత్సరాలుంటే నేనూ పెద్దవుతాను' అన్నాను బింకంగా. ఆవిడ భయంకరంగా, వికటంగా నవ్వింది. 'అప్పుడు నేనూ యింకా పెద్దయిపోతాను. అప్పుడు నీకు ఎనిమిదేళ్లుంటై. నాకు పదహారేళ్లుంటై...పదహారు !' అన్నది ఆ మాటను నొక్కి పలుకుతూ, పొంగిపోతూ.

అమ్మ దగ్గరకు పరుగెత్తాను ఉక్రోషంగా.

''అది ముందు పుట్టింది. అందుకని నీకంటే ఎప్పుడూ పెద్దగానే వుంటుంది...అయినా చిన్నగా వుండటమే బాగుంటుంది కదరా, కన్నా'' అన్నది అమ్మ 'ఈ అమ్మకి ఏమీ అర్థంకాదు'

అనుకున్నాను నిస్పృహగా. చిన్నవాళ్లు ఎప్పటికీ చిన్నగా వుండి పోవలసిందేనా ? పెద్ద వాళ్ల మీద గెలవటానికి మార్గమే లేదా ? అన్యాయం ! 'నువ్వు చిన్న..... నువ్వు చిన్న' అంటూ నామట్టూ ఎగురుతుంది అక్క.

అసలు ఈ అక్క ఎందుకు ? దీన్ని ఎక్కడికైనా పంపిం చేస్తే ఎంత బాగుంటుంది ! అమ్మని అలాగే అడిగాను రెండు సార్లు. అమ్మ సమాధానం చెప్పకుండా నవ్వింది. కొంచెం పట్టు బడితే అక్కని పంపించేస్తుందని నాకు నమ్మకమే. కాని అసలు చిక్కు నాన్న పెద్ద భూతంలాగా నిల్చుని 'కాదు!' అంటారు. నాన్న మాటకి తిరుగులేదు. పట్టుబట్టి ఒప్పించటాలూ, సాధించ టాలూ లేవు. నాన్నంటే నాకు భయం.

అక్క తన డబ్బు లెక్క చూసుకుంటూ ''ఒరే కృష్ణా, నాలుగు పావలాలు యిస్తాను గాని రూపాయినోటు యివ్వరా'' అన్నది. రూపాయికి నాలుగు పావలాలని నాకు తెలుసు సూరమ్మ కొట్లో అట్లాగే యిస్తుంది. అందుకని సరేనని నా పర్సు తీసి అక్కకు నా రూపాయి నోటిచ్చి నాలుగు పావలాలు తీసుకున్నాను. లక్కతో సమాన స్థాయిలో వ్యాపారం నడుపగ గినందుకు నాకు సంతృప్తి, ఆనందం కలిగాయి. కొంచెంసేపున్నాక అక్కతో యింకా కొంచెం వ్యాపారం చెయ్యాలనిపించింది ''అక్కా నాలుగు పావలాలు తీసుకుని, అన్నీ పదిపైసలియ్యి'' అన్నాను. అక్క నాలుగుపావలాలు తీసుకుని, పది పదిపైసల బిళ్లలిచ్చింది. పర్సులో పెట్టుకునా అప్పుడు అక్క నన్ను చూసి నవ్వుతూ ''నాకైతే మంచి రూపాయి నోటు'' అన్నది. నాకు బలే కోపం వచ్చింది. కొత్త రూపాయినోటు అసలు నాది కదా! నాది ని.. మన్నాను. కాసేపు గొడవ జరిగాక ''అయితే నా పది పైసల కాయిన్సు బోలెడన్నీ నాకిచ్చేసెయ్యి. నీ నోటు యిచ్చేస్తా'' అన్నది. రూపాయి నోటుకి బదులుగా యిచ్చింది నాలుగు పావలాలు గదా. అవి అప్పుడే తీసుకున్నది. పది పైసల కాయిన్సు నెను ఎందుకివ్వాలి ? నన్ను టక్కరు చేసెయ్యాలని చూస్తున్నది, పాపం ! ''అదికాదురా, నావిగదరా ఆ కాయిన్సు. నేను నీకిచ్చాను గదా'' అన్నది. ''అవి పావలాలిస్తే యిచ్చావు. పావలాలు నీకే యిచ్చానుగా'' అన్నాను. అక్క ఒప్పుకోలేదు. ఆవిడ ఎప్పుడూ నా కన్యాయంచెయ్యటమే ! అమ్మ దగ్గరికి పరుగెత్తుకెళ్ళాను. అక్క కూడా వెనుకనే పరుగెత్తుతూవచ్చి అమ్మతో ఏమిటేమిటో చెప్పేసింది. 'నా నోటు తీసుకుంది. నా పావలాలు తీసుకుంది. నా కాయిన్సు అన్నీ యివ్వమంటున్నది. నా నోటు నాకిచ్చేసెయ్య మను !'' అని అరిచాను కోపంగా. ''నీ నోటుకు బదులు పైస లిచ్చాను కదరా. ఆ నోటు నాది'' అన్నది అక్క పెద్దగాలరుస్తూ. ''అవి పావలాలకిచ్చావు. నోటుకి కాదు. అన్నీ అబద్ధాలు చెప్తు న్నావు'' అన్నాను. అమ్మ నన్ను ఎత్తుకుని కళ్లల్లో నీళ్లు తుడిచి ''నీకు నేను వేరే నోటు యిస్తానులే'' అన్నది. అక్క నా నోటు తీసుకుంది గదా. దాని సంగతేమిటి ? 'నాక్రొత్త నోటే నాకు కావాలి'అని ఏడుస్తున్నాను. నాన్న వచ్చారు. అక్క గబగబా ముందు ముందే ఏమిటేమిటో చెప్పేసింది. ఎప్పుడూ అంతే. పెద్దది గనుక అబద్ధాలన్నీ చెప్పేస్తుంది నాన్న నన్ను అమ్మ దగ్గర్నుంచి క్రిందకు దింపారు. కుర్చీ మీద కూర్చో పెట్టారు. తనూ నా ఎదురుగా కుర్చీలో కూర్చున్నారు ''విలువ అంటే ఏమిటో నీకు తెలియలేదు. నేను చెప్తాను, విను. అక్క నీకు రూపాయి విలువ యిచ్చింది. రూపాయి విలువ తీసుకుంది. చెల్లుకు చెల్లు. తెలిసిందా?'' అన్నారు నిదానంగా. నాన్నకు సమాధానం చెప్పి లాభం లేదు. ఏమిటేమిటో చెప్తారు. నేను చెప్పేది అర్థం చేసు కోరు. నిస్పృహలో మాట్లాడకుండా ఉండిపోయాను.

ఎప్పుడూ అంతే. పెద్దవాళ్లు ఏమిటేమిటో చెప్తారు. నేను చెప్పేదిఅర్థంచేసుకోరు. వాళ్లు చెప్పినట్లేచెయ్యాలి!...నాకు స్కూలుకు వెళ్లాలంటే యిష్టంలేదు. రాకెట్లు తయారు చెయ్యా లనీ, సూర్యుడి దగ్గర కెళ్లాలనీ యిష్టం. ''స్కూలుకి వెళ్లి చదువుకుంటే పెద్దయినాక పెద్ద రాకెట్లు చేస్తావు చదువు నేర్చుకోకపోతే రాకెట్లు చెయ్యడం రాదు'' అన్నారు నాన్న. నాన్న సంగతి నాకు బాగా తెలుసు. ఇట్లా మెల్లిగా కారణాలు చెప్పి ఒప్పి స్తున్నట్లు మాట్లాడుతారు. నిజంగా వెళ్లకపోతేమాత్రం ఊరు కోరు!

స్కూలుకువెళ్తే తిరిగి యింటికి రావటానికి నాకు దోవ ...తే నాకు పెద్ద భయం. స్కూలు ఒదిలే వేళకు జవాను ...మ్మతో గట్టిగా చెప్పి మనసు కుదుటబరచు ...తే నాన్న ఊరుకోరుకదా...అక్కలాగా ...బడికి వెళ్తున్నందుకు కొంత గర్వంకూడాక గింది.

...కాని స్కూల్లో వున్నంతసేపూ భయమే-రాముడు రాక పోతే ఎట్లాగా అని. బడి ఒదిలేశారు అందరూ యిళ్లకెళ్లి పో... న్నారు. రాముడు రాలేదు!

ఇహ నాకు యిల్లులేదు... అమ్మలేదు ... ఎవరూలేరు.. ఏమీలేదు...

పెద్దగా ఏడ్చేశాను. దూరాన అక్క కనిపించింది. పరు గెత్తుతూ వెళ్లి పరికిణీ పట్టుకున్నాను. అక్క చూసింది. కళ్లల్లో నీళ్లు చూసి 'ఎందుకురా ఏడుస్తున్నావూ?' అన్నది. నాకు నోట మాట రాలేదు. ''బళ్లో ఏడిస్తే పెద్దమేష్టారు కొడతారు'' అన్నది. నాకంతా భయంగా, గొడవగా, మసగ్గా వుంది. అక్క నా చెయ్యి గట్టిగా పట్టుకుని 'రాపోదాం' అన్నది. పెద్ద మేష్టారు దగ్గరికి తీసుకెళ్తుందేమోనని 'నేను రాను' అన్నాను. భయమూ, ఏడుపూ కలిసి ఎక్కిళ్లు బుక్కిళ్లుగా ఎగదన్నుకు వస్తున్నాయి. అక్క చెయ్యి విడిపించుకోవాలని చూస్తున్నాను. అంతలో రాముడు వచ్చాడు...అక్కలాగా నేనుకూడా బడికి వెళ్తున్నానన్న గర్వం, పెద్దరికం పోయాయి. నేను బడిని చూచి భయపడి ఏడ్చే పిరికివాణ్ణి అయిపోయాను...ప్రతి పిల్లవాడిలోనూ ఒక పసివాడూ, పెద్దలతో సమానంగా వ్యవహరించాలనుకునే వ్యక్తీ కూడా వుంటారు. కాని

పరిస్థితులు ఎప్పుడూ ఆ లోపలి వ్యక్తిని నలిపేస్తూ, కించపరుస్తూ పిల్లవాణ్ణి పసితనంలోకి విసిరేస్తూ వుంటాయి...

ప్రతిరోజూ నేను అమ్మతోపాటే పెందలాడే లేస్తాను. అమ్మ వంటింట్లో పని చూసుకుంటూ వుంటుంది. అమ్మవున్నా నాకేం లెక్కలేదు. నాన్న, అక్క నిద్రపోతూ వుంటారు. అప్పుడు నా యిష్టారాజ్యం ధీమాగా యిల్లంతా కలయ దిరుగుతూ, పనులు పెక్కబెడుతూ నా యిష్టమొచ్చినట్లు చేసుకుంటాను. ఇదేమిని అడిగేవాళ్ళుండరు. రోజు మొత్తంలోకీ ఆ సమయంలో భలే హాయిగా వుంటుంది నాకు.

ఆ రోజున అలానే లేచాను. ముందుగదిలోకి వెళ్ళాను. పని మనిషి వస్తుందేమోనని తలుపులు బార్లా లెరిచి పెట్టాను. చలి గాలి వేస్తుందేమోనని తెరిచివున్న కిటికీలు మూసిపెట్టాను. నేను లేచేశానుగదా, ఇహ యిదెందుకని నా దోమతెర విప్పేశాను. నాన్న పెన్నులో సిరాపోసి పెడదామనుకున్నాను. కొంచెం సిరా క్రింద పడి పోయింది. అందుకని ఆ పెన్ను అక్కడే పారేసి అక్క అలమార్లో పుస్తకాలు పూరికే చూద్దామని వెళ్లాను. అక్క కొత్త బాల్ పాయింట్‌తో అక్కనోట్సులో మంచి సూర్యుడు, రాకెట్, ప్రపంచం బొమ్మ వేశాను. వెనగ్గదిలో కొచ్చాను. అద్దంముందు అక్క వాచీ కనిపించింది. నాకు వాచీలంటే భలే యిష్టం కీ తిప్పవచ్చు. నాకు వాచీలేదు. అక్కది యిక్కడ పారేసిందేమిటా అనుకుని దాన్ని తీసుకెళ్లి నా బొమ్మల పెట్టె అడుగున పెట్టాను. బాయిలర్ దగ్గర కెళ్లాను. క్రింద నిప్పులుండే పళ్లెం అమ్మ కదిలించినట్లు కదిలిస్తే బాగా మండుతుందని కదిలించబోయాను. అది క్రింద పడిపోయింది. అమ్మవచ్చి నన్ను లాక్కెళ్లింది.

బడికి వెళ్లబోతూ అక్క వాచీ కోసం తెగ వెతికింది. కన బడలేదని అందరితో చెప్పింది. అక్కడ పెట్టిన వాచీ ఎలా పోతుంది? అని అమ్మ, నాన్న, అక్క ఆలోచించారు. గది ఊడ్చి నప్పుడు పనిమనిషి జాలమ్మే తీసివుండాలి అనుకున్నారు. జాలమ్మని ఏమని అడగాలి? అడిగితే యిస్తుందా, యివ్వదా? అంటూ రక రకాలుగా అనుకున్నారు. 'అసలు జాలమ్మ యిట్లాంటి పని ఎప్పుడూ చెయ్యలేదు' అన్నది అమ్మ, అలమార్లోనూ, మంచాల క్రిందా యింకా జాగ్రత్తగా వెతికి చూడండి. రేపు అడగొచ్చు అన్నారు నాన్న. భలే తమాషాగా వుంది. నన్నడుగుతారేమో అను కున్నాను. ఎందుకో వాళ్ళు అడగలేదు. అదెక్కడుందో నాకు తెలుసు కదా. అక్కవాచీ కనపడకుండా పోతేపోనీ! అట్లాగే వెతుక్కోనీ! అనుకున్నాను హాయిగా ఆడుకుంటూ.

అప్పుడు అక్క నాదగ్గరకొచ్చి నన్ను అనుమానంగా చూస్తూ 'ఒరే కృష్ణా, నా వాచీ దొంగిలించావా?' అన్నది. 'లేదు' అని అరిచాను. నాలో కోపం పొంగివచ్చింది. నేనేమన్నా దొంగనా?' 'నువ్వెప్పుడూ నామీదే తప్పువేస్తావు' అని కోపం పట్టలేక ఏడ్చే శాను. అమ్మ వచ్చింది. 'వాడి వాడెందుకు తీస్తాడు? ఎక్కడ పెట్టుకున్నావో, ఎవరు తీశారో. తెలియకుండా వాడి నంటావేం?' అని కేకలేసింది. నాన్న మాత్రం అక్క నేమీ అనలేదు. అందుకని నాకు మరింత ఏడుపొచ్చింది. ఆఖరికి నాన్న 'అక్క ఎక్కడ పెట్టిందో. వెతికితే దొరుకుతుందిలే. నీవు ఏడవొద్దు' అన్నారు. నేను ఏడుపు మానేసి బడికెళ్లాను.

ఆరోజు సాయంత్రం 'కృష్ణా, నీ బొమ్మలు తీసుకురా. బిల్డింగ్ బ్లాక్స్‌తో కొత్తరకం యిల్లు కడదాం' అన్నది అక్క. పరుగెత్తుకుంటూ వెళ్లి పెట్టెతెచ్చి అక్కముందు బోర్లించాను. దబదబమంటూ బొమ్మలన్నీ క్రిందికి దూకినై. అన్నిటి కంటే ఆఖర్న దిగి అన్నిటిమీద కూర్చుంది సగర్వంగా వుతో చిన్నవాచీ అక్క వాచీ! అక్క కేకలకి అమ్మా నాన్నా వచ్చారు...వచ్చేశారు! ...వాచీ చూశారు! ఏదో పెద్ద తప్పు చేసినట్లు నాకు భయం పట్టుకుంది. గుక్కపట్టినంత చూద్దామనుకున్నా నోటమాట రాలేదు.

వాళ్ళు నన్ను పెద్దగా కోప్పడ్డారు. అరిచారు.

నాకు ఏడుపు వచ్చింది. కాని ఏడవలేదు.

'నువ్వే తీసి యింత నాటకం ఆడావా?' అన్నది అమ్మ ఆశ్చర్యంగా.

కోపంవచ్చి అమ్మను కొట్టబోయాను.

'నంగనాచి. చూడు అమ్మమీద తిరగబడుతున్నాడు' అన్నది అక్క.

'భడవా' అంటూ నాన్న నన్ను పట్టుకున్నారు.

అందరి మొహాలూ పరికించిచూశాను. వాళ్ళు నన్ను అర్థం చేసుకోరు! వాచీ నేను దొంగిలించలేదని వాళ్లకు అర్థం కాదు. వాచీ నేను తీసుకున్నాకూడా తప్పెలా అక్కదే కాదని వాళ్లకు తెలియదు! నాదే తప్పు అంటారు! నన్ను వేరుచేస్తారు!

... ఆ పరిస్థితిలో అందరిముందూ దోషిగా నిల్చున్న నేను అనుభవించిన నిస్సహాయత, భయం, తప్పు; అప్పుడు నాలో నిండిన నిస్పృహ -- అంతా తిరిగి యిప్పుడు అనుభవిస్తున్నట్లు తోచింది.

దీర్ఘంగా నిట్టూర్చాను.

హృదయం నుంచీ మెదడులోకి, నిస్సహాయత నుంచీ అధికా రానికి, స్త్రీత్వం నుంచీ పురుషత్వంలోకి, అనుభూతి నుంచీ అహం కార వ్యాపారంలోకి పెరగటం మనిషికి తప్పనిసరేమో!

ప్రకృతి ధర్మంలో గొంగళీ పురుగులు సీతాకోక చిలుకలుగా మారుతాయి. కాని ఈ మానవ పరిణామంలో సీతాకోక చిలుకలు గొంగళీ పురుగులుగా మారుతాయి!

మనిషికీ మనిషికీ మధ్యన వుండగల వంతెన ఒక్కటే— అది ప్రేమ.

**3**

'సిద్దా, ఎన్నిరా లోకాలు ?'

'ఎవరిలోకం వారిది స్వామీ'

అన్ని లోకాల్నీ కలుపుతూ వంతెన్ని కట్టెయ్యాలని పెద్ద రాక్షసుడు పథకం వేశాడు. వ్యవస్థలు, విలువలు అంటూ కట్టెలు పట్టుకొచ్చాడు. వాటిని తీసుకుని అందరూ చిన్న సన్నాసుల్ని కొట్టారు. దెబ్బలు మీద పడ నే వాళ్ళా రాక్షసులై పోయారు. 'నక్సలైట్లు' అని అరిచారు అందరూ క సి గోల గోలగా. భూమి దద్దరిల్లేటట్లుగా ధన్‌ధన్‌మని అడుగులేసుకుంటూ బోర విరుచుకుని నడుస్తూ, ఆకాశంకేసి చూసి నిరసనగా పెదవి విరుపుతో మందహాసంచేసి, నన్ను నేను పరకాయించి చూసుకున్నాను. నా కాళ్ళూ, చేతులూ, తలా అన్నీ కట్టెలతోనే తయారైనై. అన్నీ గట్టి సర్వే కట్టెలే. వాటిని విరిచి పొయ్యిలో పారెయ్యాలనుకున్నాను ...

'ఏం, గోదార్లో దూకి చచ్చాపుదామనుకున్నావా?'' అంటూ రెక్కపట్టుకు గుంజాడు దోవన పోతున్న దానయ్య. వంతెన అంచు మీద నిల్చునివున్న నేను కళ్ళుమూసుకుని మృతిలోకి తూగానేమో...

వెనక్కు జరిగి క్రిందికి చూశాను. మహాగంగ నిండుగా, నింపాదిగా ప్రవహిస్తున్నది. ఆ మందగమనంలో ఎంత చైతన్యం ! ఎంత శక్తి! దాన్ని వంతెనమీది నుంచీ చూడొచ్చు. అర్థమూ చేసుకోవచ్చు. కాని దానితో ప్రవహించటం సాధ్యమా !

# దేవికి

## శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఎన్ని నిధులున్న దరి ఎందరున్నగూడ
ఒంటరిగ కాలుదు తలంపు మంటలందు —
నీవె నాకు సర్వస్వమ్మో దేవి, నిజము !
అందుకే ఇంత బాధ ఎడంద నిండ !

భువన రాజ్ఞివి నీవు ! ఈ అవనిఉన్న
సర్వ సర్వం సహా వస్తుజాలమెల్ల —
అసలు స్థల కాలములె — త్వదీయాత్మనుండి
సంజ నిత మందు ఒక రేణు పుంజమేను !

పెను ఎడారిగ కన్పడు వనధి ఒక ఒ
యాసిసుగ వెల్గు ద్వీపము, అమృత ఝరిణి,
దివ్యసుందరా రామము, నవ్యకుసుమ
రాజి, సురభిళపాళి, సర్వమ్మునీవె !

కాని ఎల్వదాకల కలకాల మల్లె !
భగ్గుమని కోటి కోట్ల జిహ్వలను సాచి
లేత నారింజ మంటలు లేచి పడుచు
ధ్వంసి మొనరించు ద్వీపము, వనము, ఝరిణి !

స్వర్ణరోచిస్సు లెగయు దీపాలశాల
రత్న సింహాసనమున నీ రమ్యమూర్తి !
అంతలో చిమ్మ చీకటు లన్ని దెసల —
చిమ్మటల కీచు రాళ్ల నాదమ్ము మటుకె !

ఏల ఆశల చుక్కలీ నీలి నింగి ?
మరు గడియ కారు మబ్బు దొంతరల నడుమ
మాయ మగుటకా ? మెరపులు మండి పడుచు
భయద గర్జన దిక్కుల పగులగొట్ట !



# జ్యోతిషానికి భవిష్యత్తు తెలుసా ?

తెలుసు.

ఆంధ్రప్రదేశ్‌లో భవిష్యత్ కాలాన్ని చూడగల జ్యోతిష్కులున్నారు.

పన్నెండుగదుల్లో దోబూచులాడే నవగ్రహాల వైనం తెలిసిన జ్యోతిశాస్త్ర పండితులు మాత్రమే కాదు సుమండి !

సగటు మనిషి జీవితపు చీకటి గదుల్లో రేపటి వెలుగును నేడే చూడగల ఆర్థికశాస్త్ర ప్రవీణులు.

సామాన్యుడి జీవితంమీద స్వతంత్ర భారత సంస్కృతి ముద్రవేయగల ప్రణాళిక వ్యూహ రచయితలు.

"నాదేశం ఏ రంగంలో ప్రగతి సాధించినా, దాని ఫలితాలు భారతీయు లందరికీ సమంగా దక్కాలి. అప్పుడే నేనా ప్రగతిని గుర్తిస్తాను." అన్నారు బాపూజీ. బాపూ కన్న కలలను నిజం చేస్తున్నాయి నేటి పంచవర్ష ప్రణాళికలు.

ఐదవ పంచవర్ష ప్రణాళిక ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పాలిటి వరం. **1973-74** లో ప్రణాళికా పెట్టుబడి రూ. **93** కోట్లు వుండేది. **1974-75** లో రూ. **148** కోట్లకు చేరిన యీ వ్యయం **1975-76** నాటికల్లా రూ **203** కోట్లకు పెరిగింది.

గత సంవత్సరం **1976 - 77** వార్షిక ప్రణాళిక పెట్టుబడి రూ **298** కోట్లు. దీనిని **1977 78** ప్రణాళికా కాలానికి రూ. **383** కోట్లకు పెంచారు.

**1978-79** లో యిది రూ. **450** కోట్లు వుంటుందని భావిస్తున్నారు.

నాల్గవ పంచవర్ష ప్రణాళికా కాలం మొత్తం పెట్టుబడి రూ. **499** కోట్లు మాత్రమే కాగా ఒక్క **1978-79** వార్షిక ప్రణాళికా పెట్టుబడి ఈ మొత్తానికి రమారమి సమానమన్న మాట. ఐదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో మొత్తం పెట్టుబడి సుమారు రూ. **1480** కోట్లు వుంటుంది - యిది నాల్గవ ప్రణాళిక పెట్టుబడి కంటె మూడురెట్లు అధికం.

ప్రణాళికలు విజయవంతమైతే ప్రగతి భేరి ప్రతి మనిషి గుండెలో ప్రతిధ్వనిస్తుంది.
తెలుగు తల్లి జడలో ప్రగతి పుష్పం ఫక్కున వికసిస్తుంది !

---

*డైరెక్టరు, సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.*
37/77-78



శ్రీ పి. శివరామకృష్ణమూర్తి

# గిరిజన భాషా మాండలికం

శ్రీకాకుళం, విశాఖ, తూర్పు పశ్చిమ గోదావరులు, ఖమ్మం జిల్లాలలో మన్య ప్రాంతం ఏక ఖండంగా వ్యాపించి యున్నది. ఈ జిల్లాలలో కోయలు, సామంతులు, సవరలు, గదబలు తప్ప మిగిలిన కొండ జాతుల మాతృభాష తెలుగే. వీరు ముఖ్యంగా కొండరెడ్లు, బగతాలు, వాల్మీకులు, కమ్మరులు మొదలైన జాతుల వారు. ఖమ్మం జిల్లాలో ఉర్దూ ప్రభావం, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో ఒరియా భాష ప్రభావం, కోయలు ప్రాంత మంతా వ్యాపించి ఉన్నారు కాబట్టి అంతటా కోయ భాషా ప్రభావం యీ మాండలికం మీద ఉన్నది. తరతరాలుగా నాగరికులతో సంపర్కం చాలా స్వల్పమైనందు వలన వీరి భాష — ఆచార వ్యవహారాలు, పాటలు — వానిలో సహజత్వం — ప్రాంతీయత జీవనసరళి ఇంకా ప్రత్యేకతను గోల్పోలేదు. గిరిజన ప్రాంతంలో ఏ కృషికైనా ఉన్న ప్రాకృతిక అవరోధాల వల్ల ఈ సాంస్కృతిక పరిశోధన జరుగక యీ ప్రత్యేకతలు వెలుగు చూడలేదు. ఆంధ్ర దేశంలో ప్రామాణికమైన భాషా మాండలికాల జీవశక్తి, భాషకు సౌష్ఠవం కల్పిస్తున్నట్లే ఈ మాండలికంలోని నూతన పదాలు — వృత్తి మాండలికాలు — పద నిర్మాణం (World formation) క్రొత్త ధాతువులు — వ్యవహారంలో కనిపించే ప్రాచీన ధోరణి — ఉనిక— ఆదాన ప్రదానాలు. చెట్లు, పుట్టలు, పక్షుల పేర్లు—సామెతలు— పదబంధాలు — జాతీయాలు ఇవన్నీ సంకలనం చేయగలిగితే మన భాషకు మరింత పుష్టి కలుగుతుంది. తులనాత్మక అధ్యయనం చరిత్ర గతిని కూడా గ్రహించడానికి తోడ్పడవచ్చు. ప్రస్తుతం తూర్పు గోదావరి జిల్లా గిరిజన భాషా విశేషాలను ముచ్చటిస్తాను.

## భాష

ఉచ్చారణలో ఉనిక అధికం. సాధారణంగా రెండక్షరాలు మించిన మాట మీద, దీర్ఘం మీద (అది పదాదిలో ఉన్నాసరే) ఉనిక ఉంటుంది. మనవలె మాటలు ప్రవాహవేగంతో ధారాళంగా సాగవు. ఉదా : గెద్దాడ ఒక గ్రామం పేరు. కాని కొండవారు ఇప్పటికీ గెడ్డవాడ అని మాత్రమే అంటారు.

గెడ్డ=కాలవ. ఈ ఊరిని ఆనుకొని ముఖ్యమైన కాలవ ప్రవహిస్తూంది పదాలు — కొంతి. తెలుంగు మాస్టారు. వచ్చిది పోయిది (వచ్చినవి పోయినవి); వానికి పిలువడమట= ద్వితీయకు షష్ఠి, భావార్థ కాంతం. ఈ రకం ప్రయోగాలు ఇక్కడ సహజం. మనమేల మోయడము ?. ఉదాత్తమైన ఉనిక రమ్మి—రావోయ్, వాడు వచ్చిడి—పోయిడి (వచ్చాడు పోయాడు) వచ్చిది - పోయిది.

ఈ ఉనిక ప్రాచీన పదజాలం మూలంగా వారు మాట్లాడేది ఒక పట్టాన అర్థం కాదు. కనీసం రెండు మూడు నెలలు అలవాటుపడాలి. తత్సమాధి యీ మాండలికంలో దాదాపు పదో వంతు దాకా ఉన్నాయి. వాటిని చాలా అపభ్రంశంగా ఉచ్చరిస్తారు.

ఉదా : లచ్చుకల్లో నమో రాముకల్లో నమో (పెండ్లి పాట) ఈ లచ్చుకల్లు ఏమిరా అని నేను చాలా రోజులు తలబద్దలు కొట్టుకున్నాను. లక్ష్మికల్యాణమో — రాము కల్యాణమో దీనికి వచ్చిన తిప్పలు ఇది పాండవులను పాండువులు. వైద్యుడు (ప్రకృతి) వెజ్జు (వికృతి) అని ఉన్నత పాఠశాలల్లో చదువుకునే రోజుల్లో తెలుగు పండితులు చెపుతుంటే యీ వెజ్జు అని మనం పలకము కదా. ఈయన ఎందుకు చెపుతున్నట్లు అని అనుమానం రేకెత్తేది. ఇక్కడి పిల్లలకు అటువంటి సందేహం రాదు ఇక్కడ తత్సమాలను దాదాపు తద్భవాలుగానే పలుకుతారు.

గురువు గొరవ; కుంతి=గొంతి, బందువులు=బెజ్జు.

## పదజాలం

(వ్యవసాయానికి సంబంధించినవి.)

పూండు-కాడి; తామర = కాడి మధ్యన వేసే మేకు; కచలి=తవ్వుగోల; బలవ=పికాస్ (రైల్వే పని వారు కంకరలాగే సాధనం వంటిది); వార్నము=అరికత్రాడు; పట్టిబల్ల—పదునుపెట్టె; తట్ట=పొలంలో ఆత్మరక్షణార్థం వేసుకొనే గుడిసె ఇది నేలవరకు దించేసివుండి, ఒక కన్నం గుండా బయటకు చూడవచ్చు.

అరప నుంచె; కయ్యిలు నరకుట—మోళ్ళు నరకుట; బోద=చిన్న సంగ్రడాయి; చీర్నం=ఉలి; సోగ=మేడిమీలి; మొల్ల = మేకు; మొల్లకారు మనకెంతో మురిపెము—ఖరీదుఅయిన విరుగుడు చేవ (రోడ్‌వడ్) ముక్కను పీరు నారి మొద్దుకు — తొందరగా అరగదు — బరువు అని వాడతారు ఈమాట వింటూంటే 'మలయే భిల్లపురంధ్రీ చందన తరు కాష్ఠం ఇంధనం కురుతే' అంటూ జగన్నాథరాయలు గుర్తుకొస్తున్నాడు గదూ.

## ఇల్లు

జాగాలు=కర్రలు; సత్తర=అటక; తేనెబల్ల=కొమరబల్ల. (దీనిని ఆరెకకర్రతో చేయడం ఇక్కడ సంప్రదాయం=గృహావాస్తు.

సాటు=దిమ్మిస చేయడం; ఇల్లు కట్టాక ''సాటు భోజనం'' (సమారాధన) ఆచారం; గుమ్మం, బల్ల=ద్వారము;

కండువ=దూలాలపై వేసే అడ్డ దూలాలు; పీసుంటుగు; వడ్డు=వరండా; అంటూగ్ర=తొట్టి; తుప్ప=కోడి. గుడ్లుపెట్టే చిన్న ఆరుగు

## వంట సామగ్రి

పిండి పిడత=అంబలి పులియబెట్టు కుండ.

పన్నీళ్ళ పళ్ళెం } కొండవారికి (రెడ్లకు) మడీ తడీ ఉన్నది.
వన్నీళ్ళ కుండ } ఈ మడి కట్టుకున్న మనిషిని ఆ మడి నీళ్ళకుండను ఇతరులు తాకరు.

కంటి చేయడం=కర్రల రాపిడితో నిప్పు వేయడం (చాలా సులభంగా నిముషంలో చేస్తారు)

సొద=దివిటీ (రాత్రి దారి జూపేందుకు వెలిగిస్తారు)

తిలికె=దీపం. పట్టెగర=తెడ్డు. కిమ్మ=చిల్లుల తెడ్డు.

దాగరి=పిండి విసరెడు బుట్ట ("వరుగుతో దాగరయు ఎండ వలసినట్లు"—ఉత్తర హరివంశం—సోమన)

జిర్నె=ఎండబెట్టు బుట్ట.

జిల్బు=అన్నం వార్చే పట్టా. పకె=చిన్నబుట్ట; సూరికె=చిన్నగంప.

జోకి=నీళ్ళుంచే ఆనపకాయ డిప్ప. బుర్రడిప్ప—నాగస్వరం

వేపుడుబల్ల, జుగుడి=అల్పాహారం (విశాఖ జిల్లా)

## కత్తులు-విల్లమ్ములు

ఓలకత్తి=మంగలికత్తి; బొబ్బ కత్తి=పెద్దకత్తి. (పోట కత్తికంటె కొంత చిన్నది) ఉసికత్తి=కూరలు తరుగుకునే చిన్నకత్తి.

గొంజ్లెము=వింటినారి. మిట్ట=ఇనుపముక్కలేని సాదా అలుగు.

తున్ను=సాదా అలుగు చివర తొడిగే చిన్న వెదురు గొట్టం.

గడ్డికొరప=తున్నుపెట్టని అలుగు.

## పిట్టలు-జంతువులు

బుచ్చి=పిల్లి; పొదరిబండ=ఎలుక; మోర్స=పందికొక్కు; పాలదోకి=పొడవుకోతి; కొక్కిపిల్లి=కుందేలు; పులి=కండచీమ. వెదురెలుక=గురుడిపిల్లి (దీని మాంసంతో నంజుడు చాలా రుచిగా ఉంటుంది) వేపి=కుక్క; (నన్నెచోడుడు యీ పదాన్నే 'కుమార సంభవం'లో ప్రయోగించాడు ఇది ఇక్కడ ప్రచురం.)

మెకము=క్రూరజంతువు
అరిజ=కాకి.

## ఇతర పదాలు

మొరకలు=చెవులు; యాసలు=వేళ్ళు; చెల్ల=సమస్తము.

గగ్గ=పొట్ట; గబ్బుటాల్లా=వయసులోనున్న కన్యలు.

ఘాటులు=పిల్లలు; గోవులు=యువకులు, జౌజం=మద్దెల. చొంచ=చిన్న మద్దెల.

గుమ్మడి=నృత్యంలో జట్టుకట్టడం (నా రాచ గుమ్మడి)

గండి=కొండ; పల్లా—30కుంచాల; కేరెం కర్ర-త్రాసు.

ఈ త్రాసు కొండవారి సృష్టి. ఇది మన రైల్వే స్టేషన్లలో పెద్ద బరువులను తూచే యంత్రంయొక్క సూత్రంపై తయారు చేశారు. మూరకంటె చిన్న కర్ర దానికి ఒకప్రక్క కొన్ని గీతలు—వానిమీదకు బరువునుబట్టి చిన్న రాయి గట్టిన తాడును జరుపుతూ తూకం నిర్ణయిస్తారు. మన తూకాలతో ఖచ్చితంగా సరిపోతుంది ఈ కర్ర—తరతరాలుగా యీ ప్రాంతంలో వాడుకలో ఉంది.

వడుగులు=కథలు; కట్టకల్లు—పులిసిన కల్లు

గున్నె=అబ్బాయి; ఎద్గరి=త్వరగా (విశాఖ)

పొరకమేశి=సరిహద్దు; సర్పులు=గట్టిగా; చిరిదడి=అల్లరి చిల్లరి; పురుటుళ్ళు=బారసాల; వెడ్డి=పెళ్ళికాని; చిప్పలు=నేగిస కలప.

## పద నిర్మాణం

పెంకువంట=(వైశ్వదేవం)

క్రొత్తపంట వచ్చినపుడు బరిగా ఓటికుండలో వండి, పసుపు పూలు చల్లి ఆ పెంకును పొలంలో పడేస్తారు. అడవిలో పోతున్నప్పుడు ఏదో ఓటికుండ దొరికితే దానిలో వండుకోవడమూ పెంకువంటే.

పోతబూరం=జీవనది; బూర=కాలవ (గడ్డ) ఎప్పుడూ పోతగా పారే (ఎడతెగక) కాలువ జీవధార.

పొట్లం పెట్టడం—దొన్నెలో మాంసంపెట్టి నిప్పులో కాల్చడం.

మెతుకు వేయడం=పిండప్రదానం.

పసుపునీళ్ళు వల్లడం=చిన్న దినం.

కీడు. అది—కీళ్ళది, అంగడి + అది= అంగళ్ళది=బతుమతి కావడం, అడవికి పారడం=రజస్వలకావడం=(ఈ కన్య అడవిలో ఉండాలి)

పై చెంగువేయడం=కడుపుతో ఉండడం

ఇండ్లుచేయడం=పెళ్ళిచేయడం.

ఆవు నూనె = నెయ్యి. నెయ్యి — నూనెగా మారిన చరిత్ర మనకుతెలుసు ఇది లవ్రతో కలిసి మరల నెయ్యిగా మారింది.

పిండి పిడత—చట్టిగ్ర—కట్టకల్లు — ఆడకట్టు (ఆడ మగ యాళం) మొదలైనవి వారు పద నిర్మాణ ప్రతిభకు ఉదాహరణలు.

## నూతన ధాతువులు-ధాతుప్రయోగాలు

ఈవుకొనుట=అంటుకొనుట, చెందుకొనుట=ముక్కలుగా కోయుట, పల్లకుండుట=మిన్నకుండుట, ఈదుకొనుట—కొనుగోలుసేయుట.

దొంగ చేయడం = దొంగతనం చేయడం

ఇండ్లు చేయడం = పెళ్లి చేయడం

గొరవ చేయడం = భూతవైద్యం చేయడం

ఉరుమడి తోండం=బండి పండుగ తంతు, ఊరుబయటకు బండి తోలడం

తప్పు వేయడం = తప్పుమోపి సుంకం వేయడం.

వీనిలో తద్ధితాంతాలు కాక, నామవాచకాలనే అనుబంధ క్రియలుచేర్చి ధాతువులుగా ప్రయోగించడం.

## సా మె త లు

సాధారణంగా అటవిక జీవితంవలె సామెతలు మోటుగా ఉంటాయి. అక్కడక్కడా అశ్లీలాలు కూడా కద్దు.

1 చెప్పిన మాటలు చెవికి చుర్రగ — పట్టిన కంప వంటికి చుర్రగ.

2 ఇక్కెకు ఇక్క — మంకుకు మంకు (ఇక్కె=బెల్లం కొట్టిన రాయిలా ఉండేవాడు)

3 మాలకు మాటలు పాడుగు — రొయ్యకు మీసాలు పొడుగు. మాలలు—వార్తాహరులు, రెడ్ల దగ్గర ఉద్యోగులు. ఇక్కడ మాలలను వాల్మీకులు అంటారు. (వాల్మీకులు అనే పేరు వచ్చిన కారణం అన్యత్ర వివరిస్తాను.)

4 మాటంటే మాలవాడికి లాభం. (మాట—కబురు)

5 గొడ్డువానికి గోరంలేదు వెడ్డివానికి విచారం లేదు. (వెడ్డి=పెండ్లి కానివాడు)

6 పిట్టను కొట్ట-పొయిలో పెట్ట=ఏ పూటది ఆ పూటే.

7 మంచి చెడ్డలేక రాతికి మల్లగొల్ల.

8 నాప చిక్కుడు కాపుకు బోటది (సంవత్సరం దాటిన చిక్కుడు తీగ మరం కాపు కాస్తుంది. ప్రతి యింట్లో చిక్కుడుతీగలు తప్పనిసరిగా చూడవచ్చు).

9 కేసవాడు మాటకు బోటడు — కుంటిగొర్రె పులికి వెరవదు (ఎలాగూ పరుగెత్తలేదు గదా.) (ఏమీలేనివాడు మాటకు వెరవడు.)

10 ఉండలేనమ్మ పిండకాల్చుకుంది.

11 అంద ముండం లేనమ్మ సందెదే.

12 కుండలో ఓపలేక కుమ్మరిమీద పడిలివా.

13 గొట్టుచేస్తే గొల్లవాడికి లాభం : గొర్రెకొవ్వితే గొల్లవాడికి లాభం. గొట్టు చేయడం = పెద్దలు సమావేశమై తగవు తీర్చడం. తప్పు చేసినవాడు పెద్దలకు విందు చేయాలి. ఆ మాంసం కోసం గొల్ల దగ్గర జీవాలుకొనాలి. ఆ అమ్మకం లాభం.

14 సామంలో బుర్ర — ఉదుముల్లో తోక (ఎక్కడైనా ప్రధాన పాత్ర)

15 చెయిని చేటుకు — నవ్వు నష్టంకు (చెయిగ=వెకి నవ్వు)

16 ఒల్లనమ్మకు చెల్లని గాజులు.

17 పిల్లనెత బెల్లంపెట్టి తల్లితో తంటాలు పడడం.

18 సాదరెని సోమడి పెళ్లికి కంపు బొక్కు కాత కట్టుకొని వెళ్ళాడట. (కంపు బొక్కు=పాసినకూడు తినేవాడు, కాత=మూట)

19 ఏమీ ఎరుగనివాడు అద్దం చూస్తే అద్దంలో యిద్దరు కనిపిస్తారుట. (ఏమీ ఎరుగక సాక్ష్యం ఇస్తే తనో తీరు — సాక్ష్యం ఒక తీరుగా బయటపడుతుంది)

20 చేతలేని నాడికి చేపల చెరమెందుకు.

కొత్త మొహం చూసి కొండవాడు పారిపోవడం సహజం. సమాధానం ఇవ్వడం ప్రపంచంలో ఎనిమిదవ వింత. అటువంటి వారిని కబుర్లలోకి దింపి సామెతలు వగైరా సేకరించడం—కుందేటి కొమ్ము సాధించడం—కుందేటి కొమ్మును కూడా సాధించవచ్చునని గదా సుభాషితం

ఆచార్యశ్రీ బిరుదరాజు రామరాజుగారి ప్రోత్సాహంతో శర వేగంగా సాగించిన పర్యటనలో స్థూలంగా గమనించిన అంశాలను వాడవి నివేదించడమే ఇప్పటి ఈ వ్యాసం. ముందు ముందు పరిశోధనలో సేకరించే జాతీయాలు లోకోక్తులు మన జాతీయ సంపదలో మరో భాండారం కాగలవు.



# మీరు - మేము

డాక్టర్ టి. బి. యం. అయ్యవారు

అన్నలు మీరు మీకు విన
యాంజలి—మీ నిటలమ్ముఁన్ సుధా
స్విన్న మరాళ తూలికను
జేకొని వ్రాసె విరించి—భాగ్య సం
పన్నుల యైక మూర్తులఁగఁ
బ్రౌఢ మనీషులుగాఁ గవిత్వపున్
వెన్నెల పంటలై హృదయ
వీధుల శైత్యము గ్రుమ్మరింపఁగన్. 1

కలశ పయో నిధానమయి
కన్పడె జీవితమెల్ల—మీ తలం
పుల లలితేంద్ర చాపచయ
ముల్—చదశోభి మయూర బర్హమం
జల సుషమా కదంబముల
సొంపులు మాత్రమే నిల్చి మీ దృగం
చలవల సమ్మె యందమును
శబ్దముఁ గల్పన చేసె—సృష్టిలో 2

క్షితి యిది కేవలమ్మొక భు
జిష్యగఁ దమ్ము భజింప నిల్చెనన్
మతి—ప్రతిలేక రంపిలు ధ
రా రమణుల్ భవదీయ కావ్య సం
తతిఁ బులకించుచున్ మణిగ
కౌస్తుగి తోజ్వల భూషణాదులా
తతముగ నిచ్చి నారఁటవ
దాన్యత పెంపు ధరిత్రి మెచ్చఁగన్. 3

అళికుల రావముల్ కిసల
యాకుల కోకిల కాకు కాకలీ
కల కల రావముల్ గలసి
కమ్మగ మీ గళ సీమలందునన్
నెలకొని చిత్ర భంగిరవ
ణించెనటే వివశ్వ వైఖరుల్
దఁకొన నాటి సభ్యులకు
దాత్తర సొపగలై పొరిఁబొరిన్ 4

మనుజ పతులకు తోడుగా పణి మయున్న
రసమకుట దీప్తిరిం ఛోళి గ్రమ్ముకొనఁగ
కృతిపతిత్వ మర్థించి దే వతలు వేచి
రటవె? మీ స్వప్న హేమ సౌధాంగణముల 5

ఏరాదృశమ్మ హివాను భావములు లే
నే లేవుపో! గథ చిం
తా తంత్రాత్మలమైన మాకు, విధి ని
ర్దాక్షిణ్య చిత్తమ్మునన్
యాణా యాత నిరంత యాతనంసీ
త్తై పోవగా--మా ముఖ
వ్రాతం బందున వ్రాసె, హాలహం లి
ప్త క్రూర శల్యంబునన్. 6

వేవిన నేమి యౌనా యను
జేతి మెయిన్ నడిరేయి దాక నా
నా విధ చింతలన్ నిదుర
నందక యించుక కన్ను మూసినన్
'గా' యని, ప్రాంత భూరుహాళి
ఖానివ సద్భరి ఘుక్కుదంబ సం
రావము లేచి శ్రోత్ర వివ
రంబులు బద్దలు చేసి వేసెడిన్. 7

భ్రూకుటీ చండ ముఖములు భూరి భయద
తర్జనల గర్జనలె స్వాగతమ్ము పలుకు
కనులు విచ్చిన—ప్రతిపదమ్మునఁ గఠోర
కులిశ మాలికలే పడు గళము నంగ. 8

కుడువఁగఁ గట్టలేని బ్రదు
కుల్ మసనమ్ములుగాగ మ్యోములన్
గడుకొని శోక రోషముల
ఖండమలై జ్వలియింప ప్రేతముల్
వడువున సంచరించెడి య
భాగ్యులె! మా కపనమ్ము లాలకిం
చెడి రసికాగ్రణుల్ కటిక
చీకటి తాండవ పాడు దర్శలన్ 9

వారేమిత్తురు కోష్ణ బాష్ప కళిక
ద్వంద్వమ్ము తప్పన్-క్షుధా
బార ధ్వస్త సమస్త చేతనులు, వ
హ్వా యన్న కొండొక్కయు
ద్గా రంబేనియు రాదు నిట్టు సురులన్
దప్పించినన్, మా కవే
సార శ్రీ మదుదార సత్కృతులుగా
సార్థక్యమున్ బెంచెడిన్. 10

దశ దిశా రాగిణులఁ దృప్తమతు పీరు
స్నిగ్ధ సుమ మాల్య వితతిఁగై సేయఁదొల్లి
భీకర చితాగ్ని కీలికా వేల్లనముల
నే మలంకారములఁ దీర్తు మీ రసమున.  11

లోకమ్ము నిదుర పోవఁగ
జో కొట్టిరి మీరు నాఁడు-స్తోభామయి గీ
లా కలన మేలుకొల్పఁగఁ
గై కొంటిమి దీక్ష నేఁడు-కవితా ఫణితిన్. 12

భారతీ లోల సంవ్యాన పల్లవాంచ
లోదిత మనోజ్ఞ సురభి వాయువులు మీరు-
జగతికై-కోపగించిన చండమూర్తి
ఆమె శాపాక్షర స్ఫులింగాళి మేము! 13

[పూర్వాంధ్ర మహాకవుల నుద్దేశించి]

# బృహత్కథ

## శ్రీ కావలిపురపు రామచంద్రరావు

నా గళం కలంగా
చీకటి సిరాగా
చైతన్యం కాగితంగా
రాస్తున్నానొక కథ.
యుగ యుగాల బృహద్వ్యథ

నక్షత్ర పిశాచం చెప్పగ
నర్తించే నా నేత్రం విన్నది
రాస్తున్నా నొక కథ
పురిటి మంచం నుంచి
పరేత వాటిక దాక
జరుగుతున్నాయి పేజీలు
పెరిగి విరుగుతున్నాయి పేచీలు

మాటలతో పొడుచుకునే వాళ్ళు
మంటలనే కప్పుకునే వాళ్ళు
రక్తం మధువు గ్రోలే వాళ్ళు
నక్తం వధువు కోరేవాళ్ళు

విచిత్ర జీవలక్షణం గలవాళ్ళు
నింగికి నేలకు పుట్టినవాళ్ళు
ఎందఱో నా కథలో

కథ మలుపు తిరిగినచోట
కనిపించును మాంసపు కోట
అధ్యాయాలు సాగుతున్నాయి
ఆత్మల కీచురాళ్ళు వాగుతున్నాయి
మృత్యు దేవత చనుబాలు త్రాగే
మానవతా శిశు సందర్భం
గ్రంథంలో రసవత్తర ఘట్టం

కులం బలం మతం మౌఢ్యం ధనం ద్వైవం
ఒక వర్గానికి కొమ్ము కాని మరో వర్గాన్ని
దుమ్ముచేసే దుస్తర న్యాయం ఏదో
అల్లుకున్నదీ కథా ప్రపంచంలో
ఉద్యంతం ప్రాణ స్పందన రక్తపాతం కలదీ కథ
అందుకే ఆదిభిక్షువుకే ఇది అకితం.

# వ్యాఖ్యాతృ సార్వభౌమః మహోపాధ్యాయ మల్లినాధ సూరిః

## [జయంత్యుత్సవ సందర్భే విరచితమ్]

శ్రీ ముత్యంపేట సాంబరాధ్య శాస్త్రి

మత్తేభ వృత్తమ్

శ్రీమల్లనాథ బుధనామా—మహ సుగుణ ధామా వినిర్జితరిపు
స్తోమ స్వకీయ కవితా మ్రాప్రతోషిత సుసామంత పండిత వరః
శ్రీ మాఘ ముఖ్యకవి సోమోక్త కావ్య విషయామూల్య రత్నచయదః
శ్రీ మత్కొలంచెలిమ గ్రామస్థితో జయతు సోమార్ధమౌళి రిపుః 1

వసంత తిలకా వృత్త

శ్రీ మల్లినాధ కవిరాజ తనుం సమేత్య
వాగ్దేవ తేత్యవతతార మహీత లేస్మిన్
మంతవ్య మేవ విబుధై ధృవ మార్యవర్యా
స్సో స్మాక మద్య భవతా న్నుతి పూజినార్హః 2

శ్లో: నిశ్శేషం యోపి బత్సర్వ శాస్త్ర సింధు గతోదకా
న్యగస్తి రివసో స్మాకం స్మరణీయోస్తు సర్వదా 3

శ్లో: కాళీదాసీయ కావ్యానాం త్రయాణాం మహతాం త్రయాః
వ్యాఖ్యా స్సంజీవినీ నామ్నీ స్సోకరోత్ హృదయం గమాః 4

శ్లో: ఘంటా పధాఖ్య వ్యాఖ్యానం కుర్వాణో భారవేః కృతేః
పుపోషార్ధ గురుత్వం స మల్లినాధ విదగ్రణీః 5

శ్లో: చకార మాఘ కావ్యస్య వ్యాఖ్యాం సర్వం కషాభిధాం
సర్వ శబ్దార్ధ వృత్యాది బోధినీం మంజులామయమ్ 6

శ్లో: జీవాతు నామ వివృతి ర్నైషధాఖ్య కృతేః కృతా
సంఖ్యా వత్సేవ నార్ధాయ మల్లినాధాఖ్య సూరిణా 7

శ్లో: పదవాక్య ప్రమాణాబ్ధి పారగో ద్బిరుదాంకితః
మహోపాధ్యాయః బిరుదోరే జేసౌ కవిశేఖరః 8

శ్లో: అను సృత్యాన్వయ పథమనుల్లంఘ్య కవేర్గిర
త్య క్త్వానుక్త మసౌచక్రే వ్యాఖ్యా స్సర్వార్థ సాధిక 9

శ్లో: స్వత స్సంజాత విజ్ఞానం మల్లినాథ విపశ్చిత
విద్వ త్సౌజన్య సంపాది యశో భవతి నిశ్చయః 10

శ్లో: కామనాయస గోత్రాబ్ధి చంద్రస్యాస్య మహాకవేః
సితరేకా మహాభాగ్యే తౌస్తు త్వా భవతోధునా 11

శ్లో: వ్యాఖ్యాతృ సార్వభౌమ శ్రీమల్లినాథ స్వజన్మనః
మెదజన్మండల మత్యంత మశేషం పావనంబ భౌ 12

## శార్దూలమ్

ఏతావత్ప్రతిభా విశేష మహిత శ్రీ మల్లినాథస్య స
త్కీర్తీందు ద్యుతయో నిశాకరల సదృగ్భోర్వ్య తిరాజంతితా
వ్యాప్యా శాసు దివాని శంకవి మణౌ స్తాదృ
జ్మహిమ్నోయశః స్తోతుం నాలా మహం
నమ్మోస్తు సతతం తస్మై సుధీమౌళయే 13

## వసంత తిలకమ్

శ్రీమల్లినాథ విబుధేశ్వర సజ్జయంతీ
ప్రేక్ష్మాధికే నరచిత ద్య యధాత థైవ
ప్రత్యబ్ద మన్య మహనీయ విదాం జయంత్యా
కార్యా ఇతి ప్రకలితాంజలి రస్మిధీరా 14

## మందాక్రాంతమ్

ఆచంద్రార్కం సకల జగతీ మండలే మల్లినాథ
ప్రాజ్ఞే శ్రీతా విరచిత మహాగ్రంథ జాలమ్ సమస్తం
విద్యాభ్యర్థి వ్రజ బుధ వర్గైః పఠ్యమా నార్చ్యమానమ్
నిశ్శేషిల్యం విమల విజయం ప్రాప్ను, వద్వర్ధతాంతత్ 15

# అంటరాని పాట

డా. తంగిరాల

అన్ని ఖండాల్లోనూ తెలుపు
లేదా ఎరుపు పసుపు
ఆఫ్రికాలో మాత్రం కారు నలుపు
నా దేశంలో ప్రతి గ్రామం
వెలుగు వెల్లువతోనిండి పొర్లిపోతోంది
ఊరిబయటమాత్రం చిమ్మచీకటి
వెలుగుబంటిలా కూర్చుని ఎన్నేళ్ళగానో
మూలుగుతోంది.

ఆకలి అజ్ఞానం నీ ఆకారం
అంతులేని పేదరికం నీ పూరిగుడిసెకు ప్రాకారం
అన్నా !
నీ ఘర్మజల ఘృతం త్రాగి మేం నిగనిగలాడుతున్నాం
మా పొలాల్లో నీ రక్తం పారించి పంటలు
పిండుతున్నాం
నీ కన్నారి పాపలు
పసిపాపలు
నిరంతరం మా పశువులు మేపాలి —

ఎండుటాకుల ప్రోవు
ఎముకలగూడు
ప్రాణమున్న అస్థిపంజరం
నీ తల్లి
మూడు కాళ్ళ ముసలి
తన గాజుపళ్ళు పొడుచుకుంటూ
మా చేలో కలుపుతియ్యాలి -
అడవి మల్లెల ఘుమఘుమలు
అల్లనేరేళ్ళ నిగనిగలు
నంది వర్ధనాల చిరునవ్వులు
నీ అర్ధాంగి రూపయౌవనాలు
మా నాడాల బూట్లక్రింద పడి నలిగిపోవాలి —

నా తాతనుంచి నా మనవడి వరకూ కాస్తున్న
పట్టపగ్గాల్లేని దురహంకారపు దోపిడీ యెండ
నీ ముత్తాతనుంచి నీ ముని మనవడివరకూ మాడ్చి
మీ బ్రతుకుల సెలయేళ్ళలోని స్వచ్ఛమైన నీళ్ళుపీల్చి
యిసుక మేటలు వేయించి ఓటలు తీయిస్తుంది.
పురాణాల్లో విన్న రౌరవాది నరకాల యమయాతనలు
నీ మీద ప్రయోగాలుచేసి ప్రత్యక్షంగా తెలుసు
కుంటున్నాం

నువ్వెంత గింజుకున్నా
మా బారినుంచి తప్పించుకోవడం నీ తరంకాదు
బుద్ధుడూ క్రీస్తూ యిద్దరూ కలిసినా
నీకు అభయమివ్వలేరు
తారస్థాయిలో సాగుతున్న మా
అంటరాని పాటను ఆపలేరు ...
కోటిమంది మహాత్ములు పుట్టినా
నీ గోడు ఎవడూ పట్టించుకోడు ...

అన్నా !
ఎందుకింకా ఆలస్యం ?
ఇదిగో
ఈ మెషిన్ గన్ తీసుకో !



శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం

# తాళపత్రాల్లో దాగివున్న "సురాభాండ చరిత్ర" యక్షగానం

సంగీత సాహిత్య నృత్యకళలకు సమన్వయాన్ని కల్పించే దేశిరచనా విశేషాల్లో విశిష్టమైంది యక్షగానం. ఇది పేరు మొదలు కొని ప్రక్రియలో సయితం పాల్కురికి సోమన్నకంటె పూర్వం నుంచీ క్రమ పరిణామాన్ని పొందుతూ క్రీ. శ. 15వ శతాబ్దానికి సర్వలక్షణ సమన్వితమైన యక్షగానంగా స్థిరపడింది. అప్పటినుండి దక్షిణాంధ్రయుగంవరకూ అనేక యక్షగానాలు రచింపబడి వెలువడి నాయి. కాని నాటినుండీ నేటివరకూ యక్షగాన వాఙ్మయ చరిత్రలోనే పేర్కొనబడని, వినబడని యక్షగానం "సురాభాండ చరిత్ర". ఇది కర్నూలు జిల్లా నందికొట్కూరు గ్రామంలో ఒక వీరశైవుల ఇంట్లో లభ్యమైంది. దీని రచయిత "ముమ్మకవి భోగఘనుడు." ఇందులోని యితివృత్తం సంగ్రహంగా ఇది :

"కాశీపట్టణంలోని విప్రుడొకడు దగ్గరిలోనున్న తాటి తోపులో శివుణ్ణి గూర్చి తపస్సుచేస్తూండేవాడు. కల్లు కొరకై ఆ వనంలోనికి వచ్చిన ఒక యీడిగ వనితయొక్క వయ్యారానికి మనస్సు చలించి అతడామెతో తన కోరిక నెరవేర్చమన్నాడు. లేకపోతే తాను చస్తానని బెదరించాడు. బ్రాహ్మణ భక్తిచే ఆమె అతని కర్తవ్యాన్ని గుర్తుచేసింది. అంతేకాదు. తన భర్తవల్లా, లోకుల వల్లా కలుగబోయే ప్రమాదాన్ని గూర్చి హెచ్చరించింది. అయినా ఆ బాపడు కామాంధుడై ఆమె వెంటబడ్డాడు. చివరకామె సమ్మతించింది. ఆ విప్రుడామె యింట్లోకి దూరి యామెను పొందుట కుపక్రమించాడు. అంతలో కల్లుకావడితో వచ్చిన ఆమె మగడు తలుపు తట్టాడు. ఆ విప్రుడు భీతితో గడ గడ వణకుతూ తన్ను రక్షించమని ప్రాధేయపడ్డాడు. ఆమె అతన్ని కల్లుకుండలో దాగుకునేట్టు చేసి ధైర్యంతోవాకిలి తెరచింది. కలవరపాటుకు కారణ మడుగుతున్న మగణ్ణి విన్పించుకోకుండా, కావడిలోని కల్లుపాత్రను ఒక్కొక్కటే తీసి ఆ విప్రుడు కూర్చున్న కడవలో కల్లును 'బాపడి ఉసురు తనకు తగిలెననెడి' బాధతో పోయసాగింది. చివరకు మగని వత్తిడి ఎక్కువకాగా ఆమె సత్యాన్ని విన్నవించింది. ఇంతలో బ్రాహ్మడు శ్వాసను బంధించి శివుణ్ని ధ్యానిస్తూ శివునిగా రూపు దాల్చాడు.

ఎంతో పొద్దెక్కినా సంతలోకి కల్లురానందున అచటికి కల్లుకై వచ్చిన వాళ్ళీ విషయాన్ని విన్నారు. అందులో కొందరు అమ్మలక్కలు కల్లుకుండ కడకేగి పై నురుగును తొలగించిచూచి ఇతడు సాక్షాత్తూ శివుడే! అని ఆశ్చర్యం పొందినారు. పాప బుద్ధితో వచ్చిన బాపడు ఇట్లాగ మారడం ఎక్కడైనా కద్దా? కనుక ఆమె బొంకులాడుతున్నదని వారు పల్కగా కల్లుకుండలో నుండి ఆతడు చేతులెత్తి అందరూ వినేట్టుగా 'పంచక్రోశ పర్యంతం ఈ క్షేత్రంలో మరణించిన ఎంతటి నికృష్టజీవి అయినా పరమేశ్వర రూపాన్ని పొంది కైలాసాన్ని ఏలు'నని పల్కి ప్రమథ గణాలతో కూడి ఆ యీడిగ దంపతులకు ప్రత్యక్షమయ్యాడు."

ఇదే కథను ఘట్టు శేషకవి ప్రబంధంగానూ, గజ్జెల నారాయణ కవి నాటకంగానూ, పుంగడ్డ నారన ద్విపద కావ్యంగానూ రచించారు. యక్షగాన వాఙ్మయానికిది కొత్తది గనుక దీనిని గూర్చి కొంచెం తెలుపుచున్నాను.

కాశీక్షేత్ర మహిమను వెల్లడించే గాథల్లో తెలుగు నాట తెలుగు నోట బహుళ ప్రచారాన్ని పొందిన ఈ యితిహ్యాన్ని గైకొని "ముమ్మకవి భోగ ఘనుడు" అతిశయోక్తుల జోలికి పోకుండా, ఔచిత్యానికి ఎలాంటి భంగం రాకుండా, స్వాభావికంగా, తేటతెల్లని తెల్గు పదాల్లో "అన్నిట నవరసాలంకారముగ" ఈ యక్షగాన రచన సాగించాడు. శివుణ్ణి, ఏక దంతుణ్ణి, శారదనీ, కంచి కామాక్షమ్మనీ స్తుతించడంతో ఈ యక్షగానం ప్రారంభమైంది.

॥ అటతాళం ॥

శ్రీ నగేంద్ర తనూజ పతియై — చెలిమి ఏపారమరియొక
స్త్రీని శిరమున నిడిన యాఘను—శివుని దలతున్ ॥౧॥

పురుడు జెప్పగ రాని పురములు — బూని నపుడె మిక్కిలి
అరయు నిమిషము నందు గెలచిన—యభవు దలతున్ ॥౨॥

లోకమున చౌషష్టి విద్యల—లోలకుండై మిగుల వెలసిన
యేక దంతుని పొగడి శారద—నెపుడు దలతున్ ॥౩॥

సలలితంబుగ వెన్ను బలమై వ—ర్రాంగి జోడియ్యకుండెడు
అలరు చక్కని కంచి కామాక్షమ్మ దలతున్ ॥౪॥

పేరు గీర్తులు జనులు మెచ్చగ—ప్రేమతోనా మిక్కిలి
గారవంబున మెరయు నాదిమ—కాలు దలతున్ ॥౫॥

ఈ స్తుతికి తర్వాత ఒక కందంలో సూచ్యార్థ సూచన వెయ్యబడింది. అటు తర్వాత కాశీనగర వర్ణనతో కథ ప్రారంభింప బడింది. ఆ కాశీ నగరంలోని ఒక బ్రాహ్మణుడు లాటితోపులో

॥జంపె॥

ఆలు బిడ్డల మీసి — అడియాసలంటు విడిచి।
తాలిమితో శివు మదిని — తలపోయ దొణగెన్ ॥1॥

మంచి లావుగ జూచి—మౌని భావంబునను।
పంచేంద్రియములన్ని—బంధించి నిలిపెన్ ॥2॥

ఆకలియు యెండ దప్పెని—విచారములేక।
మాకులును తరుణు లోక—మర్యాద నుండున్ ॥3॥

వ॥ మరెన్ని తపంబెటువలె చేసెనూ.

॥జంపె॥

జడివాన గురిశినను—సంతోషకరమునను
జడియ కించుక కష్ట—సాహసంబునను ॥1॥

బిడుగులును వనగండ్లు—భీకరార్భటముగా।
వడి యురుములకు బెదరి—వణకింత లేకన్ ॥2॥

గాలి యాహారంబు—కడుపు నిండ గ్రోలి।
ఆలాగు తపము సేసె—ప్రేమతోనా ॥3॥

ఇట్లు తదేక నిష్ఠతో తపస్సు చేయుచుండగా, ఆ వనంలోనికి ఒక యువాదిగ వనిత వచ్చినదట. ఆమె తీరును కవి ఈ రీతిగా వర్ణించాడు:

॥ ఏ క తా ళ ం ॥

పట్టు పటావళి — బాగుగ కుచ్చెల
గట్టి పచ్చల కడి — యంబుల తోనా ॥1॥

కన్నుల కాటుక — కంగుల రవికెతో।
మున్నుగ ముత్తెపు — ముక్కరతోనున్ ॥2॥

నెత్తిన కుండయు — నెరవుగ బెట్టుక।
హత్తుక విప్రుని — కడ్డము రాగన్ ॥3॥

కన్నులు దెరచుక — కలికి కులుకులూ।
వన్నుల గమకము — చక్కదనములన్ ॥4॥

వన్నెల నటనయు — సలుపుచు వచ్చెను।
యెన్నిక సఖి జూచి — యేమని పలికెన్ ॥5॥

॥జంపె॥

బాల నీవే వూరు — వనతి నీ కులమేమి
యేల దాచెదవు నా — కేలనగ నీవూ ॥1॥

జపము మానితి నేను — చెలియనే నిను జూచి।
తపము చాలించితిని — తరళాయ తాక్షి ॥2॥

మాటలాడవె నాతొ — మరుని చిలుకల కొలికి
బోటి నా మాట విని — పాలితి దయ వుంచూ ॥3॥

అని విప్రుడు ఆమెను ప్రార్థించాడు. ఆ వనిత తాను శూద్ర స్త్రీ ననీ, తాపసివైన నీకు ఇట్టి కోరిక తగదనీ సలహా చెప్పింది. కాని ఆ విప్రుడు వింటేనా? చెవిని బెట్టక ఏమంటున్నాడో చూడండి:

ద్వి॥ ఓ మానినీ మణి — వో కీర వాణి

వో ముద్దు గుమ్మరో — వో పువ్వు బోణి
హరి మధ్య నిను జూచి — నప్పటి నుండి
విరహ తాపము చాత — వినవె నా తపము
మానితి జపమింక — మరువంపు మొలక
మానక నీ మీది — మనసు చే దగిలి
నిండు చందురు బోలు — నెలత నీ మొగము
ఖండ చక్కెర బోలు — కలికి నీ మోవి
మేటి యా బెడస — మీలు కన్నులునూ,
నిటు సంపెగ మొగ్గ — నీ నాశికంబు,
గండు తుమ్మెద పంక్తి — గరులు నీ కురులు
మెందు శంఖముబోయి — మెలత నీ గళము,
బిరుదైన చక్రముల్ — బిగువు గుబ్బలును
కర యుగములు మంచి — కలువ దండలును
అరుదైన తొడలును — అరటులోయనగ
లరుణార విందంబు — లడుగులో యనగ.

అని ఆమె అందాన్ని అడుగడుగునా పొగడినాడు. అంతేకాదు. ఈ ఇంపుసొంపులు ఏ ఇంతులందు వెదకినా కానరాదన్నాడు బ్రాహ్మణ్ణి కనుక నా మీద దయజూపి కౌగిలిమ్మని ఆమెను ప్రాధేయపడ్డాడు. అందుకు ఆ యువాదిగ వనిత అతన్ని ఈ విధంగా హెచ్చరించింది:

॥జంపె॥

వో విప్రకుల తిలక — వో మౌని వందిట్ల
భావింప నీ పనులు — పనికి రావయ్యా ॥1॥

నా మగనిచే దూరు — నాకు వచ్చినయ్యా,
భూమి లోనను రట్టు — పురజనుల చాతన్ ॥2॥

కన్నులందు మదము — గబ్బ, కానవుగాక
చిన్నవాడవా నీవు — చిరుతనా నేనూ ॥3॥

అప్పటికైనా ఆ విప్రుడు ఆమె మొరను విన్పించుకున్నట్లు కాన రాదు. విరహమెక్కువైంది. నన్ను రక్షింపవలసింది. నీ మగడు నన్నేమి చేసినా చేయనీ అని బింకాలు పలికాడు. వెంటబడి ఆమె ఇల్లు జొచ్చాడు.

॥ఏ క తా ళ ం॥

ఎంతులు శాయక ఊరమ్మనవే యిక
పంతము లేటికి — పడతిరో నాతో ॥౧॥

నీ దయ వుంచవె — నిన్నే నమ్మితి
పాదము లోనికి — పొలతిరో యేమె ॥౨॥

కూరిమి యిద్దరు — కూడుక వకటై
ధీరత లోనికి — దిగ్గన నరిగెన్ ॥౩॥

అని ఆమెతోపాటు లోపల జొరబడినాడు. విప్రుడామెను పొందే సమయంలో ఆమె మగడు గౌడు వచ్చి పాకిలి తట్టాడు. అపుడు బ్రాహ్మడు గడగడ వణకుతూ భయంతో ఆ వనితతో ఇట్లు పలుకుచున్నాడు :

॥జంపె॥

ఇగనెట్లు నీ మగడు — ఇంటి వాకిట నిలిచె
పగవాడ నే నెంత — బ్రాహ్మణోత్తముడా ॥౧॥

ఇగనేమి సేయుదును — యిందులకు వుపమేది
సకల శాస్త్రజ్ఞుడను — పనికి వచ్చితిని ॥౨॥

నాతి నీ బుద్ధి వినవైతి — యిటు చిక్కితిని
ఈ తప్పు గావుమను — యిందీవరాక్షి ॥౩॥

అని విప్రుడు తానొనర్చిన తప్పిదానికి పశ్చాత్తాపాన్ని పొందుతూ తనను ఎట్లైనా రక్షింపుమని ప్రార్థించినాడు. ఆమె పెద్ద కల్లు కుండలో అతన్ని దాచి పెట్టింది. కోకను బిర బిర చుట్టికొని, ఊడిన కొప్పును చేత్తో ముడివేస్తూ నివ్వెరపాటుతో తలుపుతీసింది. గౌడు ఆమెలోని కలవరపాటును గమనించి

॥ త్రి పు ట ॥

గట్టిగా పనిలేని దానవు—గనుక యెవరికి వెరవకేటు వలె
పట్ట బగలును నిదుర—బోదురె భయము లేకన్ ॥౧॥

భామ నీ కురులేల చెదిరెను—పడలి చిరుచెమటేల పుట్టెను
భామ నాతో విన్నవించవె—పడతి నీవూ ॥౨॥

చక్కగా నా దిక్కు జూడవె—సారె నీ మొగ కళలు దేరెను
యెక్కడెక్కడి జగడ మాడితో—యెవ్వరే మనిరో ॥౩॥

అని ప్రశ్నల వర్షాన్ని కురిపించాడు. ఆమె ఎలాంటి జవాబివ్వక మగడు దెచ్చిన కల్లును విప్రుడు కూర్చున్న కడవలో పోస్తూ 'బ్రాహ్మడు నేటితో సరి. అతని ఉసురు తనకు తగిలెనని' బాధతో ఉండింది. అంతలో బ్రాహ్మడు శివుడిగా మారాడు. గౌడు మళ్లీ అడుగగా :

॥అ ట తా ళ ం॥

ఆనతియ్యవే నాతగాదది — ఆనతిచ్చినను వచ్చును
కాని మాటలు జనుల చాతను—కల్లగాదూ ॥౧॥

యింగితంబుగ నెంతవానికి — యెంచగాను । చుట్టుక
రంగుగా దరలోన దూరులు — రాకపోవూ ॥౨॥

యేపునను యిగ వకటి చెడుదల కెల్లలోనూ । వెతను
బాపురే యిది గడవ నెవరికి బ్రహ్మవశమా ॥౩॥

అని బ్రహ్మహత్యాదోషాన్ని గూర్చి చెప్పింది. కల్లుకై వచ్చినవారు వారిద్దరికి జరిగిన సంభాషణ విన్నారు. అందులో కొందరు స్త్రీలు కల్లుకుండలోని సురుగు తొలగించి చూచి

॥ఏ క తా ళ ం॥

మూడు రూపులతో—ముచ్చుగలెనుతా।
కడవలో దాగిన—ఘనుడెవ్వడమ్మా ॥౧॥

నెరవుగ సంపద—సిరువుగ గొమ్మా।
శిరులొసగిన యా—శివుడోయమ్మా ॥౨॥

యిద్దర లోపల — నెన్నిక గని ప్ర
సిద్ధిగ వెలసిన — శివుడోయమ్మా ॥౩॥

అని ఆశ్చర్యాన్ని కనబరుస్తూ ఆ సతి చెప్పింది అసత్యమనీ ఆ ప్రజలు యిట్లు పలుకుచున్నారు :

॥అటతాళం॥ త్రిపుట॥

పాపమించుక అనక విప్రుడు—బలిమి స్త్రీను బట్టినాడట।
పాప కర్ముండెంచి చూడను — భవుడు లవునా ॥౧॥

బాపడు ఇటుమీద మిక్కిలి — పడలి కులమిక విడిచినాడట
యేపునను సుర దాగి నాడట—యిగాతుడగునా ॥౨॥

యిమ్మహిని యిటువంటి వానికి—యెపుడు నేడూ॥
కమ్ముకొని, యిహపరము గలుగునె—కలికి బొంకనిరి ॥౩॥

అంతలో శివుడు కల్లుకుండలోనుండి చేతులెత్తి ఆమె చెప్పింది నిజమేననీ, ఈ క్షేత్రంలో మరణించిన ప్రతి జీవీ శివరూపాన్ని పొంది కైలాసాన్ని ఏలునని చెప్పాడు. ప్రమథ గణాలతోకూడి ఆ దంపతులకు శివుడు ప్రత్యక్షమై వరాలిచ్చినాడు

ఈ యక్షగానాన్ని శివునికి అంకితం చేస్తూ ముమ్మకపి భోగఘనుడు ఇలా ముగించాడు :

**॥ద్వి ప ద॥**

నంది వాహన అర్ధనారీశు పేర।
పొందు మీరిన యట్టి పురహరు పేర।
వరముడౌ నా పంచ వదనుని పేర,
శిరిమించగా యిందు శేఖరు పేర,
గజ చర్మధరుని నీలకంఠుని పేర,
భుజనంబు గరిగిన ప్రమధేశు పేర,
వాసితో కైలాసవాసుని పేర।
యీశుడౌ యాగంటి యీశుని పేర।
అవనిలో గుండ వంశాబ్ధి చంద్రుండు।
వివరింప బసవయ్య వీరప్ప పేర।
గురుతరంబుగ పర్వకుల పావనుండు।
గరిమెతోనను సుమ్మకవి భోగఘనుడు।
అన్నిట నవరసాలంకారముగను।
పన్నుగ యీ సురభాండ చరిత్ర।
కరమర్థితో యక్షగానంబు చేసె।
ధరలోన నా చంద్ర తారార్కముగన్॥ మంగళం- మహాశ్రీ॥

ఈ యక్షగానంలో కవి ఒకటి రెండుచోట్ల శివుణ్ణే. మల్లికార్జును'ను పేర పేర్కొనుటవల్లనూ, యాగంటీశునిపేర తన యక్షగానాన్ని అంకితం చేసినందువల్లనూ, ఈ కవి కర్నూలుజిల్లా బనగానపల్లి ప్రాంతంవాడని ఊహించవచ్చు.

పైన పేర్కొన్న ఉదాహరణల్లోని సారళ్యము, నడక మున్నగునవి సుమ్మకవి భోగఘనుడు సహజ కవితా ధురీణుడని చెప్పకయే చాటుచున్నవి.

యక్షగానాన్నిబట్టి కవి కాలాదులు ఏ మాత్రం తెలియక పోయినా, యక్షగాన పరిణామాన్నిబట్టి పరిశీలిస్తే దీనిలో త్రిపుట, జంపె, ఏక, అట, అను తాళప్రధానాలైన రగడ రేకులు ప్రాముఖ్యం వహించి వున్నాయి. సంస్కృత నాటక ప్రాముఖ్యం ఇందులో ఏ మాత్రం గోచరించదు. ఈ లక్షణాలు కందుకూరి రుద్రకవి రచించిన "సుగ్రీవ విజయం", చక్రపురి రాఘవాచార్యుని "విప్రనారాయణ చరిత్ర" మున్నగుయక్షగానాల్లో కన్పట్టుతున్నాయి. కనుక సుమ్మకవి భోగఘనుడు కందుకూరి రుద్రకవికి సమకాలికుడో, ఇంచుక తర్వాతివాడో కావచ్చు.

ఈ యక్షగానం 13 ఆకుల్లో రాయబడింది. పేటి సంఖ్య ४౮ నుండి ప్రారంభమై ६౦ వరకు కొనసాగింది. ఒక్కొక్క తాటాకు పొడవు 12" వెడల్పు 1" పరిమాణాన్ని కలిగివున్నది. ఈ యక్షగానం సమగ్రంగా ఉన్నది. దీనితోపాటు మరికొన్ని యక్షగానాలు కూడా కలిసి ఒకే గ్రంథంగా ఉండినది. వాని క్రమసంఖ్య ఇలాగున్నది:

1. ౧ పేజినుండి ४౭ వరకు 'నిజలింగ చిక్కయ చరిత్ర'. యక్షగానం.- రెగళగ నిమ్మ నాథుడు- సమగ్రము.
2. ४౮ నుండి ६౦ వరకు "సురభాండేశ్వర చరిత్ర" యక్షగానము. సమగ్రము. దీనిని గురించియే ప్రస్తుత వ్యాసము.
3. ६౧ నుండి ౯౭ వరకు "శిరియాళుని కథ" ద్విపద. అసమగ్రము. కవిపేరు తెలియదు.
4. ౯౮ నుండి ౧౩౪ వరకు "నడయనంబి చరిత్ర" యక్షగానం. రెగళగ నిమ్మనాదుడు. సమగ్రము
5. ౧౩౬ నుండి ౧౬౦ వరకు "గణపాల చక్రవర్తి కథ". ద్విపద. కవిపేరు తెలియదు. అసమగ్రము.

పైన వివరించిన వానిలో 'శిరియాళుని కథ'లో కొన్ని ఆకులు లేవు. చివరి 'గణపాల చక్రవర్తి కథ' చాలావరకు శిథిలమైంది. ఇక మిగిలినవి సమగ్రరూపంలోనే ఉన్నాయి.

ఇవీ ఈ యక్షగానాన్ని గూర్చిన విశేషాలు. ఏది ఏమైనా "సురభాండ చరిత్ర" ప్రాచీన ఉత్తమ యక్షగానాల్లో ఇది ఒకటి యని చెప్పవచ్చు. అ తేకాదు. వీరశైవ వాఙ్మయానికి చెందిన మరొక మనోజ్ఞ యక్షగానమిది.

తాళపత్రాన్వేషణ, పరిశీలనయందు అభిరుచిగల నాకు ఈ యక్షగాన సంపుటి కర్నూలుజిల్లాలో లభించింది. ఈ జిల్లాలో శ్రీశైలం ప్రాజెక్టు నిర్మాణం త్వరలో పూర్తిఅయ్యి, ఆ శ్రీశైలం సాగర్‌లో మునిగిపొయ్యే అనేక గ్రామాల్లో, క్షేత్రాల్లో యిట్టి అమూల్య తాళపత్ర సంపద, అపూర్వ శాసనాలు, శిల్పాలు యింకా ఎన్నో దాగి వున్నాయి. త్వరలో వాటిని సేకరించి రక్షించడం ప్రస్తుత కర్తవ్యం. ప్రభుత్వంగానీ, లేదా విశ్వవిద్యాలయాలంటి సంస్థలుగాని వీని సేకరణ కార్యక్రమం త్వరలో చేపడితే బాగుంటుంది.

# కలగూరగంప

## చిన్నయసూరిబొమ్మ: బంగోరెబాంబు:

శ్రీమాన్ విద్వాన్ బండి నాగరాజు ఈ ఫిబ్రవరి 'భారతి'లో 'బంగోరెబాంబు' అనే పేరున వ్రాసిన విమర్శావ్యాసానికకు సమాధానంగా యీ నాలుగుమాటలు వ్రాస్తున్నాను. 'చిన్నయసూరి బోగస్‌బొమ్మ: కళాప్రపూర్ణ నిడుదవోలు వారికి చిన్నప్రశ్న' అనే పతాకశీర్షికతో 1977 మే 22 'ఆంధ్రజ్యోతి దినపత్రిక'లో వచ్చిన బంగోరెబాంబు వ్యాసాన్ని ఆసరాచేసుకొని అతగాడు యింత లేటుగా పనిగట్టుకొని అడ్డదిడ్డమైన విమర్శలకు దిగడం ఆశ్చర్యాన్ని రేకెత్తిస్తున్నది. విస్పష్టమైన దాఖలాలు చూపిన తర్వాత కూడా—తప్పును వొప్పుకొనే నిజాయితీలేక, నా దాఖలాలను ప్రశ్నించే తాహతులేక అసలు పాయింటును పక్కదారిపట్టించి కాలక్షేపం చేయజూడడం మన సాహిత్య విమర్శక బృహన్నలగాళ్లకే తగును. యెనిమదినెల్ల ఆలస్యంగా బండినాగరాజు రంగప్రవేశంగావించి చిలపలపలపల చర్చ కొనసాగించడం చూస్తే, ఆ విద్వాంసుడుకూడా యీ సాహిత్యమూర్ఖుల-బృహన్నలల జాబితాలో కొత్తగా చేరదల్చుకొన్నాడా అనిపిస్తున్నది.

ఇంతకూ బంగోరె చేసిన పాపం యేమిటి? కళాప్రపూర్ణ, పరిశోధన పరమేశ్వర వగైరా బోగస్ బిరుద విరాజమాన నిడుదవోలు వెంకటరావు 1962 లో తన 'చిన్నయసూరి జీవితము' అనే గ్రంథంలో ప్రకటించిన తర్వాత యిటీవలదాకా విశేషప్రచారంలోకి వచ్చిన చిన్నయసూరిబొమ్మ పచ్చి బోగస్‌దనీ, అది తంజనగరం తేవప్పెరుమాళ్లయ్య ఫోటోకు ఫక్తుకాపీ అనీ స్పష్టమైన సాక్ష్యాధారాలతో బంగోరె బయటపెట్టాడు, ఆ ఆంధ్రజ్యోతి వ్యాసంలో. ని. వెం ను చూచి కీ. శే. దువ్వూరి వెంకటరమణ శాస్త్రీ, హైదరాబాదు విజ్ఞానకోశంవారూ గుడ్డిగా నమ్మి, భక్తిప్రపత్తులతో ఆ బోగస్‌బొమ్మకు నకళ్లు తీయించి తమ తమ గ్రంథాల్లో ముద్రించి దేశంమీదకు వదలడంతో, యెంతో కథ నడచిపోయి, సదరుబోగస్‌బొమ్మకు బహుళ ప్రచారమేకల్గింది. బంగోరెబాంబు ప్రేలుడుతో చిన్నయసూరి భక్తశిఖామణులైన మన సంప్రదాయ సాహిత్య చరిత్రకారులకు మతులుపోయాయి.

యే ఆధారాలూ యివ్వకనే, యే వివరాలూ చెప్పకనే తన చేతికి తగిలిన వొకతప్పుడుబొమ్మను తెచ్చి అదే చిన్నయసూరి చిత్రమని అచ్చుగుద్దించి కళాప్రపూర్ణుడు అపచారం చేశాడని బంగోరె తన వ్యాసంలో స్పష్టంగా చూపెట్టాడు. 1962 నాటి తన సెకండ్‌రేట్ పుస్తకంలో అది వూహాచిత్రమనీ సెలవియలేదు. గీహాచిత్రమనీ చెప్పలేదు. యేమీ చెప్పకనే ఆ బొమ్మనువాడ్తం యిచ్చాడు ఆధారాలు చెప్పకుండా అట్లా బుకాయించడం ఆయనకు రివాజు అనికూడా బంగోరె వాదించాడు. తాను చిన్నయసూరిదని ప్రచారంలోకి తెచ్చిన ఆ బోగస్‌బొమ్మకు ఆధారం యేమిటో చెప్పి పుణ్యం కట్టుకోవలసిందని ని వెం. ను ముద్దాయిగా నిలబెట్టి పై వ్యాసంలో నిలదీసి అడిగినప్పటికీ నిజాన్ని చెప్పగలిగే ధైర్యం లేకపోయింది.

ఆ దరిమిలా, 'భారతి' పత్రికలో వచ్చిన 'బ్రౌన్‌లేఖలు' గ్రంథసమీక్షపరంగా చెలరేగిన చర్చ సందర్భంలో ఆ బోగస్‌బొమ్మ ముగ్గులోకి రావడంతో ని. వెం. తన తప్పును వొప్పుకోక తప్పింది కాదు. 'అది వూహించివేసిన చిత్ర'మని అశ్వత్థామ హతాహత కుంజరః అన్నధోరణిలో చల్లగా తప్పుకొన్నాడు—జరిగినవిషయాన్ని వివరించకుండానే ఆ వూహించి వేసింది యెవరు? ని. వెం. గారే వూహించి గీచిన చిత్రమా? కళాప్రపూర్ణుడు డ్రాయింగ్‌మాస్టర్ కూడానా? లేక యెవరైనా కిరాయిచిత్రకారుడుచేత గీయించిందా? అయితే ఆ చిత్రకారుడి పేరేమిటి? వూహించి వేసినదైతే ఆ వూహకు ఆధారం యేమిటి?—యీ ప్రశ్నలన్నీ నిగ్గదీసి అడగవలసిన సాహితీ ప్రియులైన 'భారతి' పత్రిక పాఠకులు, పాపం ఆ వయోవృద్ధ సాహిత్యవేత్తకు జరిగిన శృంగభంగం చాల్లెమ్మని వూరుకొన్నట్లున్నారు. ఇదీ యింతవరకు జరిగిన కథ. చర్చ యిక్కడితో ఆగిపోయిందనుకొన్నాం. కానీ కాలేదు

వొక శూరుడిలా సూరుడిలా విద్వాన్ బండి నాగరాజు యింత లేటుగా ప్రవేశించి 'భారతి' లో యీ చర్చను తిరగతోడుతున్నాడు. విష్ణుమూర్తి వారి వూహాచిత్రాలు యన్టీరామారావు రూపసాదృశ్యంలో రావడం మనం చూడ్డంలేదా? — అని సతీసు సినిమాల భక్తుడిగా, ని. వెం. కు వకాల్తాదారుగా యీ బోగస్ బొమ్మను సమర్థించుకొంటూ, సన్నాయి నొక్కులు నొక్కుతూ బండి నాగరాజు తన వ్యాసంలో 'శకలు' పడడంచూస్తే, ఆ బోగస్ బొమ్మకు పటం గట్టుకొని పూజించదల్చుకొనే జాతిలోని వాడుగ కన్పడుతున్నాడు. [అదే ఆయనకు ప్రీతి పాత్రమైతే అట్లానే చేసుకోనుందాం. దానికొక కొత్త సిద్ధాంతం కల్పించుకోవడమెందుకు?]

'బాంబు' అనే మాటను పట్టుకొని, బంగోరె — ఆంధ్రజ్యోతి కల్ప వుపయోగించిన వొక మామూలు మాటను తీసుకొని అందులో శ్లేషార్థ సంపదను దర్శించ జూస్తున్నాడు సదరు విద్వాంసుడు. బాంబు అంటే వ్యవహారంలో అపానవాయువు అని కూడా అర్థం వుందంటున్నాడు బోగస్ బొమ్మను ఆరాధించే వాళ్లు ఆఘ్రాణించడానికి అర్హమైనవి బంగోరె అపానవాయువులే గదా! వొక్క వసుచరిత్రకారుడిలోనేగాక బంగోరె మామూలు మాటలోకూడా శ్లేషార్థాన్ని గుర్తించి తన యోగ్యతకు తగ్గట్టు గ్రహించగల్గిన నాగరాజును మనసారా అభినందిస్తున్నాను.

యీ బంగోరె బాంబు వ్యాసవిషయమై విద్వాన్ బండి నాగరాజు చేసిన విమర్శలో చిన్నయసూరికి యింగ్లీషు వచ్చునా అన్న అంశం గురించి, నేను లేవనెత్తిన వివాదంగురించీ, యింకా నన్ను గురించీ, నా యితర పుస్తకాల గురించీ మరికొన్ని పరామర్శలు చేసి

వున్నాడు. నా 'బ్రౌన్ లేఖలు' గ్రంథంలో చిన్నయసూరిని గురించి ప్రచారంలోవున్న మరికొన్ని తప్పుడు విషయాలనుకూడా ప్రశ్నించి వున్నాను. చిన్నయసూరి అని నామాక్షరములు చెక్కబడిన బంగారు కడియమును సీమనుంచి తెప్పించి పాటిలోపికిమొసంగి సన్మానించిన విషయమూ, సూరి సుజనరంజని పత్రిక సంపాదకత్వం నెరపాడన్న విషయమూ వొట్టి గ్యాస్ అని వాదించాడు బంగోరె. యెందువల్లనో వీటి విషయమే ప్రస్తావించలేదు నాగిరాజు.

— బంగోరె

# సమాధానం

ఈ విధంగా నిద్యః సమాధానం చెప్పుకోవడానికి అవకాశం కల్పించిన 'భారతి'కి నా హృదయపూర్వక ధన్యవాదాలు —

1. బంగోరె — ఆంధ్రజ్యోతి క్వ్ ప్రయోగించిన వాక మామూలు మాట — 'బంగోరె బాంబు'ను — డా. మల్లిప్రియ "నాగరాజు" అనేవారు అర్థం చేసుకోలేక రచయిత పేరుగా పొరపడితే నేను సవరించాను "దానిని (భారతి — సెప్టెంబరు 77) పురస్కరించుకొని" నేను 'భారతి'కి "బంగోరె బాంబు" వ్యాసం 29-11-77 న పోస్టుచేశాను. (నా డైరీ ఆధారం) అది ఫిబ్రవరి 78 'భారతి'లో వచ్చింది. "ఇంత లేటుగా — యెనిమిది నెల్ల ఆలస్యంగా —" అన్న శ్రీ బంగోరె మాటలు అసంబద్ధం. ఒకవేళ, నిజంగా ఆలస్యమే అయినా, ప్రస్తావించడం తప్పా? కాలదోషం పట్టిపోద్దా? ఎంతకాలం లోపల జవాబు చెప్పాలి.

మరైతే, జనవరి 1975 లో "బ్రౌన్ తాతాచార్ల కథల"పై వచ్చిన వివాదాన్ని ఫిబ్రవరి 1977 లో తన "బ్రౌన్ లేఖలు"లో రెండు సంవత్సరాల తర్వాత — ఎందుకు ప్రస్తావనకు తెచ్చారు? నిజంగా సదరు వివాదంలో ఛందస్సంబంధ చర్చ జరిగిందా? శ్రీ బంగోరెకు ఛందస్సుయొక్క ముక్కు మొహం తెలుసునా, నాతో వివాదపడటానికి? ఇదంతా బోగస్ వ్యవహారమని యీ సందర్భంగా చెప్పవలసి వస్తున్నది.

2. ఆంధ్రజ్యోతిలో వచ్చిన శ్రీ బంగోరె వ్యాసం పత్రిక సీర్షికలో రాలేదు. అదొక జంబమా అందులోను? రెండో వ్యాసంగా వచ్చింది దాన్ని 'ఆసరా చేసుకొని'కాదు నేను 'భారతి'లో ప్రస్తావించింది. చిన్నయసూరి రేఖాచిత్రాన్ని డా. మల్లిప్రియ "నాగరాజు", "ఫోటో"గ చెప్తున్నారు. ఏది నిజం? - ఈ సందర్భాన్ని పురస్కరించుకొనినేను 'బంగోరె బాంబు' ప్రస్తావన తెచ్చాను. చిన్నయసూరి బొమ్మగా చెప్పబడుతున్నది రేఖాచిత్రమా? ఫోటోనా? ఈ తబిసీలు వివరించాలి కద?

"బహుశా ఆ చిన్నయ్యే ఈ చిన్నయ్య అని పొరపడి వుంటారేమోనని నిడుదవోలు వారికి 'బెనిఫిట్ ఆఫ్ డౌట్' ఇవ్వాలి!" (22-5-77) ఆంధ్రజ్యోతి దినపత్రిక) అని జడ్జిమెంట్ ఇచ్చిన, తనకుతానై అయిన 'న్యాయమూర్తి' శ్రీ బంగోరె, ఇప్పుడు మళ్ళీ తం. తే. ఫోటోకు సెకుస్తాకాపీ అంటారేమిటి? ఇది బంగోరె గారి బోగస్ రిసెర్చికి తార్కాణం కాదా?

3. "కళాప్రపూర్ణ,... వగైరా బోగస్ బిరుద విరాజమాన నిడుదవోలు వెంకటరావు..."— ఆంధ్రా యూనివర్శిటీవారు ప్రదానంచేసే అత్యున్నత గౌరవ బిరుదం "కళాప్రపూర్ణ". అది వారి సాహిత్యసేవను 'గుర్తించి' యిచ్చింది. ఎవరో, 'బుడ్డా ఫక్కీరు' గారు పొరపాటు సూచించినంత మాత్రాన, తప్పు ఎన్నినంతమాత్రాన 'కళాప్రపూర్ణ' బిరుదం బోగస్ అయిపోతుందా? ఈయన పాసైనథర్డ్‌క్లాసు, బి. కాం. ఆనర్సు డిగ్రీ బోగస్ అయిపోద్దా, ఎవరైనా ఒక తప్పు ఎత్తి చూపితే? అన్ క్వాలిఫైడ్ — థర్డ్ రేటు జర్నలిస్టు శ్రీ బంగోరె, శ్రీ వెంకటేశ్వరా యూనివర్శిటీలో తెలుగు డిపార్ట్మెంటు అనబడే "రెడ్డి రాజ్యం"లో ఏ మోకాటి బిరుదుతో బ్రౌన్ రిసెర్చి ప్రాజెక్టు ఏర్పాటు చేయించుకొని, "సీనియర్ రిసెర్చి ఆఫీసరు"గా చెలామణి అవుతున్నారు?

4. "యీ బంగోరె బాంబు వ్యాస విషయమై విద్వాన్ బండి నాగరాజు చేసిన విమర్శలో... మరికొన్ని పరామర్శలు చేసి వున్నాడు." - అవును, వాటికి జవాబులేవి? (1) చిన్నయసూరికి ఇంగ్లీషు రాదా? (2) శ్రీ బంగోరె బాలవ్యాకరణం చదివారా? (3) "బ్రౌన్ లేఖలు" అనే పుస్తకం శ్రీ బంగోరె యూనివర్శిటీకి రాకపూర్వమే అచ్చుకు సిద్ధం కాలేదా? కాకపోతే, అట్లాని "మొదటి బ్రౌన్ జాబులు" అట్ట చివర ప్రచురించడం బోగస్ వ్యవహారం కాదా? అందులోని వ్యాసాలు కొన్ని 'జమీన్ రైతు — వారపత్రిక'లో కూడా వచ్చాయి కద? "అసలు పాయింటును పక్కదారి పట్టించి కాలక్షేపం చేయ జూడడం" నేనుగాదు, బంగోరెగారు చేస్తున్న పని! వారి తప్పుల్ని వొకరిమీద రుద్దడం వారికి అలవాటు.

5. చిన్నయసూరి బంగారు కడియముగూర్చి "వొట్టి గ్యాస్" అని వాదించారా శ్రీ బంగోరె? "ఆధారాలు చూపి,దాఖలాలు చెప్పి వ్రాసినమాటలుగా కనపడ్డంలేదని సవినయంగా మనవిచేస్తున్నాను" (బ్రౌన్ లేఖలు--21 పేజి) అని అక్కడ నంగితనం పట్టించి, యిక్కడ దబాయింపుసెక్షన్ ఉబ్బెపదకొండో క్లాజు ప్రకారం 'వాదించా' రట!

బ్రౌన్‌జాబులు, బ్రౌన్‌లేఖలు చూస్తే. "తెలుగుపండితుల రివాజు 'అట'ల విద్య" శ్రీ బంగోరెలోనే సవాలక్షరీతుల కనిపిస్తుంది కాకపోతే పెద్దలు మర్యాదగ్రాస్తే, ఈయనగారు మిడిసిపడుతున్నారు. బ్రౌన్ జాబులలోని విషయాలు అనేకం చర్విత చర్వణంగా బ్రౌన్ లేఖలలో గూడా చోటుచేసుకున్నాయి, మేటరు చాలకనేమొ!

6. 'బాంబు' అన్నమాటకు నేను సూచి చిన వాడుక అర్థం శ్రీ బంగోరె విషయంలో సరైందేనని ఆగన గబ్బువ్యాసం చూచినవారు గమనించేవుంటారు. ముక్కులు బిగబట్టుకొని వెదికినా అందులో విషయమేమున్నది? బండబూతులు తిట్టడం విమర్శ

కాదు; రిసెర్చి అసలుకాదు! 5-3-78 ఆం ధ దినపత్రికలో పునర్ముద్రితమైన కొమర్రాజు ''తుదివిన్నపం'' చివరిపేరా ఒకసారి శ్రీ బంగోరె వంటివారు ఒంటబట్టించుకొని మరీ పరిశోధనకు దిగడంమంచిది. ఎవడూ ''యిక్కాయి'' కాదు!

''వాక్య వసుచరిత్రకారుడిలోనే గాక బంగోరె మామూలు మాటలోకూడా శ్లేషార్థాన్ని గుర్తించి తనయోగ్యతకు తగ్గట్టు గ్రహించగల్గిన నాగరాజును మనసారా అభినందిస్తున్నాను.''— ఎవరియోగ్యత వారిది. వారిదృష్టిలో తన బాంబు మారణాస్త్రం, నా దృష్టి కది ముక్కులు పగలదీసే గుబ్బ. వసుచరిత్రకారుడితో తానై పోలిక కల్పించుకొని 'ఇచ్చుకోవడం' శ్రీ బంగోరెకు ఎంత గొప్ప ముచ్చటో! శ్లేష చమత్కృతులు చూపిన కవులు ఇంకా చాలా మంది వున్నారండీ!

మొత్తంమీద జి. ఎన్. రెడ్డిగారి ఆచార్యకంలో శ్రీ బంగోరె తిట్టుకవిత్వం ''బల్ పసందు'' స్థాయికి చేరుకొంటున్నది. యూనివర్సిటీవారు మంచి ''యమ్‌డన్'నే ఎన్నుకున్నారు!

—శ్రీ బండ నాగరాజు

[ఇంతటితో ఈ చర్చని నిలిపివేస్తున్నాము—సంపాదకుడు]

## బ్రౌను గురించి బంగోరె అవగాహన

చిన్నప్పుడు మనూరికి ఇంగ్లీషు వచ్చేరాదో తరవాత తెల్చుకొందాం. కాని ముందు బ్రౌను దొర రాసిన ఇంగ్లీషు ముక్కలికి బంగోరే అవగాహన ఎంత సొంపుగా ఉందో చూడండి :

(1) "This is one of those short cuts to lear - ning which end in a ditch. The book sheurs that a native who has been years teaching telugu in unabel to explain its grammar"అని మద్దాలిలక్ష్మీనరసయ్య తెలుగు గ్రామర్ పైన బ్రౌన్ రిమార్క్. దీనికి బంగోరే రాత

''మద్రాసు ఇంజనీరింగ్ కాలేజి తెలుగు మున్షీ మద్దాలి లక్ష్మీనరసయ్య ప్రచురించిన తెలుగు గ్రామర్‌ను బ్రౌన్‌కి పంపారు. ఇది చట్టి దగుల్బాజీ వ్యాకరణమని చెడదిడుతూ దానిపైన వ్రాసి పెట్టాడు''. పైవి చదివితే బ్రౌన్ ఎంత తిట్టాడో తెలుస్తుంది. (బ్రౌన్ లేఖలు పుట 148)

(2) ఇట్లాగే ఆర్డెన్ గ్రామర్‌పై ఆర్డెన్‌కురాసిన బ్రౌన్ సమాధానం.

"Two months ago I perused your Telugu Grammar... I have read it carefully but do not wish to write an opinion."

దీనికి బంగోరె అవగాహన

''మర్యాద కోసం ఏదో నాలుగు ముక్కలు వ్రాశారు గాని ఆర్డెన్ భావ ధోరణి గురించి కూడా విమర్శిస్తూ వ్రాసి పెట్టుకొన్నాడు''. బ్రౌన్‌ఆర్డెన్‌కు స్పష్టంగా తన అభిప్రాయం రాయనని చెబుతూ ఉంటే 'మర్యాద కోసం ఏదో నాలుగు ముక్కలు వ్రాశాడనటం ఏమిటి? ఇట్లా రాయవచ్చా'.

శ్రీ చంద్రశేఖర్

## శ్రీ వెణ్ణికుళం గోపాలకురుప్

నవలా రచనలో, కథానికా విశ్లేషణలో, కొత్తదనం కన్పించే కవిత్వంలో—ఏ ప్రక్రియలో చూసినా మలయాళ సాహిత్య గొప్పదనం కన్పిస్తూవుంటుంది—తెలుగులో వలె మలయాళంలో కూడా కవితారంగం బాగా అభివృద్ధి చెందింది. ఆ రంగంలో ప్రసిద్ధికెక్కిన కవులున్నారు, మహాకవులున్నారు.

ఇరవయ్యో శతాబ్దంలో తెలుగు మలయాళ సాహిత్యాలు వాకేరకమైన ప్రభావాల్ని కల్గివున్నాయి ఆంగ్ల రొమాంటిసిజం ప్రభావంవల్ల తెలుగులో 'భావకవిత్వం' విస్తరిస్తే, మలయాళంలో 'కాల్పనిక ప్రస్థానం' వచ్చింది తెలుగులో గురజాడ, రాయప్రోలు, దేవులపల్లివలెనే మలయాళంలో వళ్లతోళ్, కుమారన్ ఆశాన్, ఉళ్ళూరు ఎస్. పరమేశ్వరఅయ్యరు రొమాంటిక్ కవులు.

రొమాంటిసిజం తర్వాత శ్రీరంగం శ్రీ శ్రీ, ఆరుద్ర, దాశరథి తిలక్, కుందుర్తి, నారాయణరెడ్డి, మాదిరాజు రంగారావు, వేగుంట మోహనప్రసాదు, నిఖిలేశ్వర్, చెఱబండరాజు లాంటి కవులలాగ వెణ్ణికుళం; పాలానారాయణనాయర్, వయలార్ రామవర్మ (ఇటీవలనే కీర్తిశేషులు); పి. భాస్కరన్, ఓ. యన్. వి. కురుప్, ఒళప్పుముణ్ణా, అక్కితం; విష్ణునారాయణన్ నంబూద్రి; సుగదకుమారి; అయ్యప్ప ఫణికర్; బాలామణియమ్మలాంటివారు కన్పిస్తారు.

1972 సంవత్సరం కేంద్ర సాహిత్య అకాడమీ బహుమానం పొందినవారిలో శ్రీ వెణ్ణికుళం గోపాలకురుప్ వొకరు.అతని 'కామసురభి' అన్న కవితాసంపుటికి ఆ బహుమానం వచ్చింది అతన్నిగురించి తెలియపర్చటం ఈ వ్యాసోద్దేశం.

ప్రస్తుతం మలయాళ కవితారంగంలో మహాకవిగా ప్రసిద్ధికి వచ్చినవారు శ్రీ వెణ్ణికుళం గోపాలకురుప్. అతడు చేపట్టని కవితా ప్రక్రియ చేపట్టి సారవంతంగా తీర్చిదిద్దని విషయం లేదని చెప్పొచ్చు. స్వతంత్ర్య కావ్యాలూ భాషాంతరీకరణలూ, ఖండ కావ్యాలూ, గేయాలూ, వచన గేయాలూ, బాలసాహిత్యం ఇలా ప్రతిదాన్ని కదిలించి చైతన్యవంతం చేశాడితను. వటక్కంకూర్ రాజ రాజ వర్మ అన్న విమర్శకుడు ఇతన్ని గురించి ఇలా చెప్తాడు: 'ఆధునిక లోక నాగరికతా (భ్రాంతి) విలాసంలో వ్యామోహం లేనివాడు. నిరాడంబరం , నిశ్శబ్దంగా వాగ్దేవీ సముపాసనం అనుష్ఠించుతున్న కవులు నేడు చాలా తక్కువ. వారిలో అగ్రగణ్యుడు శ్రీ వెణ్ణికుళం గోపాలకురుప్. అతని అభిప్రాయంలో వెణ్ణికుళం ఒక మహాకవి.

గోపాలకురుప్ కమ్యూనిజం ప్రభావంగల పురోగమన కవిత్వోద్యమంలో కీలకపాత్ర వహించినా, అతన్ని లోకం గుర్తించింది వల్లత్తోళ్ అనుయాయిగానే. వల్లత్తోళ్ సంస్కృతభాషాప్రావీణ్యం కలవాడు. సదాచార సంపన్నుడు, సంప్రదాయాను సరణుడు 'కాల్పనిక ప్రస్థాన' అనుయాయి. ఈ లక్షణాలే వెణ్ణికుళంకి కూడా వచ్చాయి. సరళాలైన భావాలు, మాధుర్యమైన ప్రసాదగుణం, శయ్యాసౌష్ఠవం మొదలైన కవితా గుణాలుగల అతని కవిత్వం వల్లత్తోళ్ కవిత్వంతో తాదాత్మ్యం కల్గివుంటుంది.

కేరళరాష్ట్రం స్వతహాగానే ప్రకృతి దృశ్యాల్తో అలరారుతూ వుంటుంది. మధ్య తిరువితాంకూర్‌కు చెందిన తిరువల్లా తాలూకాలోని 'వెణ్ణికుళం' కూడా సస్యశ్యామలమైన వొక కుగ్రామం. చుట్టూ కొండల్తో కూడి ఆ గ్రామం ప్రకృతి విలాస రంగంగా పేరొందింది. అక్కణ్ణించి ఎటు చూసినా, పచ్చని ఆకుల్ని కట్టుకొని వున్న వనశ్రీ విలాస లాస్యంని చూస్తాం. ఇలాంటి ప్రకృతి వాతావరణమే, తర్వాత తర్వాత కవిని వొక సౌందర్యారాధకునిగా తీర్చిదిద్దిందని చెప్పకోవచ్చు.

ఇదపళ్లి రాజా పాలనలో వుండిన 'చెరుకాట్టు' మఠంలో 1902 మేనెల వుత్తరా నక్షత్రంలో గోపాల కురుప్ జన్మించాడు. ఆ మఠంలో కుఞ్ఞకణ్ణి కురుప్ అని పిలువబడే పద్మనాభ కురుప్ ఇతని తండ్రి. తల్లిపేరు లక్ష్మీకుఞ్ఞమ్మ. వీరికి సంతానం ఎనిమిది మంది. వారిలో రెండోవాడు గోపాలకురుప్. లక్ష్మీకుఞ్ఞమ్మ. వీరికి సంతానం ఎనిమిదిమంది. వారిలో రెండోవాడు గోపాలకురుప్. తన తండ్రి స్వతహాగా సంస్కృత పండితుడు కనుక అతనివద్దనే సంస్కృతంని నేర్చుకొన్నాడు. అయితే తండ్రి అకాల మరణం చెందటంతో అతడు 'కవియూర్ కృష్ణన్, మూస్సతు' మొదలైన వారి దగ్గర కూడా సంస్కృతాభ్యాసంని కొనసాగించాడు. అప్పటి ఏడో తరగతి పాసయి, వెణ్ణికుళం మిడిల్‌స్కూల్లో వుపాధ్యాయుడుగా చేరాడు. అప్పుడప్పుడు నాటకరంగ ప్రవేశం కూడా వుండేది.

పదహారో ఏటనించి కురుప్ కవితలు అల్ల ఆరంభించాడు. దయానందస్వామి ఆధిపత్యంలో 'అట్టూరి' నించి వెలువడుతూ వుండే 'యువజనమిత్రం' మాసపత్రికలో తొట్టతొల్త వెణ్ణికుళం గోపాలకురుప్ కవిత ప్రచురించబడ్డది. అన్ని మతాలవారు ప్రార్థనా గీతంగా పాడుకొనేటట్లు దాన్ని రచించాడు దేవీ వుపాసనా తన్మయత్వంవల్ల వచ్చిన గీతం అది.

అతనికి మలయాళ సాహిత్యంలోని ప్రాచీన కవిత్వంలోనూ, ఆధునికకవిత్వంలోను మంచి అభినివేశం వుంది. సంస్కృత ద్రావిడ వృత్తాల్ని సమంగా వాడుకొన్నా, ద్రావిడ వృత్తాలపై మొగ్గు కనబడుతూ వుంటుంది. రాజరాజవర్మ చెప్పినట్టు 'తాను మెచ్చిందే రంభ'అన్న మనస్తత్వం కలవాడుకాదు కురుప్. సాహిత్యప్రక్రియలు అన్నిటిలోనూ సమానమైన ఆదరం కలవాడు. అన్నిటినీ ఒకటిగా చూసే యీ గొప్ప గుణమే అతన్ని మహా కవిగా గుర్తించేందుకు పునాది అయింది.

స్వాతంత్ర్య సముపార్జనలో మహాత్ముడు నడిచిన దారి కవిని కూడా ఆకర్షించింది. మహాకవి ఠాగూర్, మలయాళ మహాకవి వల్లత్తోళ్‌ల దేశభక్తి గీతాలు కురుప్‌ని ప్రేరేపించాయి. ఆ ప్రేరణ ఫలంగా వచ్చిన 'లోకమాన్యన్', 'స్వదేశాభిమాని' మొదలైన వాటిలో అనేకములైన దేశీయాభిమాన కవితల్ని చూడగలం. అతనికి కవిత్వంలో ఆశయ సౌష్ఠవం ఏనా సౌకుమార్యం ఒకదాని కొకటి చాలా ఒద్దిక కల్గి వుంటాయని సహృదయ విమర్శకులు చెప్తూ వుంటారు. 'వైక్కంలో' సత్యాగ్రహం జరిగే రోజుల్లో ''స్వరాజ్య గీతం'' అన్న గ్రంథ ప్రతులన్నీ అమ్ముడు అయ్యాయి. అతనికి పేరు ప్రఖ్యాతులు సంపాదించిన పుస్తకాల్లో 'స్వరాజ్యగీతం' వొకటి.

'వెణ్ణికుళం' మిడిల్ స్కూలునించి, ఎం. జి. ఎం. హైస్కూలుకు మారాక అతనికి చాలామంది పండితుల్తో స్నేహం కుదిరింది. వారిలో విద్వాన్ శ్రీధర మణ్ణి. ఆదిచ్చ నెల్లూర్, ఎన్. కేశవపిళ్ళై, ఎం.ఎస్.కుమారన్ నాయర్, ఈ. యం. కోవూర్, తోండు మణ్ణిల్ రామన్ పిళ్లై, బాబూరావు, కేశవన్ నాయర్‌లు కొంతమంది. స్నేహితుల్తోబాటు ఆంగ్ల, హిందీభాషల్లో పరిజ్ఞానం సంపాదించుకొన్నాడు. 'హిందీలోని' రామచరిత మానసం (తులసీదాస రామాయణం)ని అనువదించాడు. అనువాదచ్ఛాయలు కన్పడనీయకుండ కవితాశిల్పం జోడించాడు. భక్తి, జ్ఞాన, తపోవన వైభవం మొదలైన విశేషాలన్నిటినీ ఎక్కడా విడమర్చి చెప్పాడు. ఆంగ సాహిత్యంలోని 'సానెట్' [(Sonnet) మలయాళంలో గీతకం అని పేరు] అన్న ప్రక్రియని ప్రవేశ పెట్టింది వెణ్ణికుళమే. హైస్కూల్లో వున్నప్పుడే 'సౌందర్యపూడు', 'వసంతోత్సవం' 'పుష్పవృష్టి' 'జగత్సమక్షం' 'సరోవరం' 'వెళ్లిత్తాళం' (వెండి తట్ట) 'మానసపుత్రి' అన్న కవితా సంకలనాన్ని ప్రచురించాడు. జవమూ జీవమూ రెండూ లోపించిన అనేక ద్రావిడ వృత్తాల్కి రెంటినీ ప్రసాదించాడు—తన రచనల్తో.

1949లో వెణ్ణికుళం ప్రభుత్వ సర్వీసులో చేరిన తర్వాత తన మకాం తిరువనంతపురానికి మార్చాడు. అక్కడ హస్తలిఖిత గ్రంథాలయం (Manuscript Library)లో పండిత హోదాలో ఆరేండ్లు పనిచేశాడు. తర్వాత లెక్సికన్ ఆఫీసులో సూపర్వైజరుగా మరో ఆరేండ్లు చూశాడు. ప్రాచీన గ్రంథాల్ని ప్రచురించటంలో లెక్సికన్ నిర్మాణంలో అతని కృషి గణనీయమైంది.

కావ్యకళా వ్యవసాయాన్ని విస్తారంగా అభివృద్ధి పర్చినవాడు వెణ్ణికుళం. గత ఏభై, ఏభైఅయిదేండ్లుగా ప్రచురించబడుతున్న ప్రసిద్ధ వారపత్రికల్లో, మాసపత్రికల్లో, ప్రత్యేక సంచికల్లో ఇతని కవిత్వం కన్పడుతూ వుంటుంది. లెక్కలేనన్ని ఖండకృతుల్కి ఇతడు కర్త. ధారాళంగా సాగిపొయ్యే కవితాగుణం అతని పాఠకుల్కి అనుభవమే. ఒకరకంగా చెప్పాలంటే అతన్ని కవిగా నిరూపించింది, మహాకవి స్థానం కల్పించిందీ లఘుకృతులే. కేరళలో ఎక్కువ ప్రచారం, సహృదయప్రీతి, బహుమానాలు పొందినవీ ఖండకృతులే. నిర్జీవమూ, శుష్కమూ అయిన కథావస్తువుల్ని కురుప్ కవితా గుణం తాకిన వెంటనే అవి విశ్వాకర్షణీని. చైతన్యవంతాన్ని, సారవంత

తనాన్ని పొందుతాయి. లోకధర్మాల్ని సూక్ష్మదృష్టితో పరిశీలించి సరసం, మధురం అయిన భాషలో రాయటం మహాకవుల గుణాల్లో ఒకటి. అవి కురుప్‌లో నిండుగా వున్నాయి. చదివిన వెంటనే అర్థం చేసుకోగలరు. ప్రసాద గుణాన్ని పరిపూర్ణంగా, అర్థభరితంగా వాడటం కురుప్ శైలిలోని ప్రత్యేకత.

శ్రీ వెణ్ణికుళం గోపాలకురుప్ షష్టిపూర్తి సందర్భాన్ని పురస్కరించుకొని ప్రచురించబడ్డ 'కదళీవనం' (కవితా సంపుటి) అతని పేరుని ఇనుమడింపజేసింది. తన సహజ ప్రతిభతో, నైపుణ్యంతో అలరారుతూ వుంటాయి—ఇందలి కవితా ఖండికలు. అర్జునన్ ఇలా అంటాడు: 'వెణ్ణికుళం గోపాలకురుప్ ఒక సౌందర్య గాయకుడు. అతడు జీవితంలోని రమ్యాన్ని, అరమ్యాన్ని ఒకటిగానే చూసేవాడు. హృదయాన్ని దోచే ప్రకృతి లావణ్యం, మధురమైన అనురాగం. మధువులాంటి వాత్సల్యభావం, పేశలమైన శైశవోల్లాసం—ఇవి అతని కవిత్వంలోని కొన్ని విశేష గుణాలు.' కెమెరాలాగ వస్తువుల్ని యథాతథంగా చిత్రించే రచనకాదు అతనిది, వాటి సౌందర్యాన్ని బోధించే రమణీయ రచన. ఇతని రచనల్లో ఎక్కడ చూసినా సౌందర్యారాధన కన్పడుతూ వుంటుంది. ప్రేమ, త్యాగం, ఆత్మజ్ఞానం, భారతభూమి, కేరళ, స్వాతంత్ర్యం, పూవు, నక్షత్రం, చంద్రుడు, యాచకుడు, ధనవంతుడు, దారిద్ర్యం, కర్షకుడు, వ్యవసాయం,విద్యాభ్యాసం—ఇవీ అతను తీసుకొన్న కవితా వస్తువుల్లో కొన్ని.

వెణ్ణికుళం బాలసాహిత్యంలో అందెవేసిన చెయ్యి. ఎన్నో పుస్తకాల్కి అతడు కర్త. పిల్లల చేష్టల్ని వర్ణించటంలో అతనికి పాటవం, కౌతుకం వున్నాయని ఏ రచన చూసినా మనకు అర్థం అవుతుంది. పిల్లల్ని వర్ణించేటప్పుడు వారి చేష్టల్ని చిత్రించేటప్పుడు, వారి వేషభాషల్ని వివరించేటప్పుడు వెణ్ణికుళం నిఘంటువులో అందమైన పదాల్ని మాత్రమే చూడగలం. పిల్లల ప్రతి కదలిక, ప్రతిఅవ్యక్త మధురమైన మాట, నిష్కళంకమూ, నిరుపమానమూ అయినవి. విరగబూసిన మొక్కలాగా నిర్మలమైనది బాలసాహిత్యం. ఆ రచనలో కురుప్ చాలా శ్రద్ధ తీసుకొన్నాడు.

కవికి తాను తీసుకోబోయే వస్తువు గురించి తప్పకుండా పరిచయం వుండాలి. లెనిన్ చెప్పిందీ, గోర్కీ చెప్పిందీ అదే. తాను కార్మికుల, కర్షకుల గురించి చెప్పేటప్పుడు వారి సాధక బాధకాల్ని క్షుణ్ణంగా తెల్సుకోవాలి. వారిలో ఒకడై పోవాలి. అప్పుడే ఆ కవిత్వం రాణిస్తుంది; కవితాసిద్ధి సిద్ధిస్తుంది. అలాగే వెణ్ణికుళం గోపాల కురుప్‌కి పిల్లల్తో మంచి పరిచయం వుంది. తన కుమారుని బాల్య చేష్టల్ని చూసి. ప్రేరితుడై 'బాలకౌతుకం' అన్న మనోహర కావ్యాన్ని రాశాడు. దీన్ని చాలా వుదాత్తమైన రచనగా భావిస్తుంటారు విమర్శకులు. ఇది 'పుష్పవృష్టి' అన్న కవితా సంకలనంలోంది.

తమిళంలో కూడా కురుప్‌కి మంచి పాండిత్యం వుంది. ''తిరుక్కురళ్''ని అనువదించాడు. మద్రాసులో 'Tamil writers Association' వారు ఈ అనువాదాన్ని అభినందించేందుకు, రాజాజీ హాల్లో ఒక సమావేశాన్ని ఏర్పాటుచేసి, అతనికి ''సువర్ణ ముద్ర''ని బహూకరించి సన్మానించారు. తమిళ జాతీయకవి సుబ్రహ్మణ్య భారతియొక్క 109 కవితలు కల్గిన ఒక పుస్తకాన్ని కేంద్ర సాహిత్య అకాడమీవారి కోరిక మేరకు మలయాళంలోకి తర్జుమా చేశాడు. 'సుందర కవితా సమాహారం' అన్న పేరుతో అది ప్రచురించబడ్డది.

డా. పి. కె. నారాయణపిళ్ల అతని అధ్యాపక జీవితాన్ని గురించి ఇలా అంటాడు: 'కురుప్ సార్ క్లాసుల్ని విద్యార్థులుగా మేం చాలా ఇష్టపడేవాళ్లం. అతని విపులమైన విజ్ఞానం, అధ్యాపక నైపుణ్యం మాత్రమేగాక అసాధారణమైన అతని వ్యక్తిత్వం, సౌమ్య మధురమైన స్వభావం మమ్మల్ని వశం చేసుకొన్నాయి. ఆకర్షణీయమైన ఆకారం, స్వచ్ఛమైన వస్త్రధారణం, స్నేహపూర్వకమైన పలుకు, మనసుకు హత్తే చదువు — ఇంకేం కావాలి వుపాధ్యాయుడు విద్యార్థిని ఆకర్షించేందుకు—ఇవిగాక ?

సాహిత్య జీవితం ఆరంభించినప్పటినించి 'భాషాచంద్రిక' అన్న మాసపత్రికకి 'చీఫ్ ఎడిటర్'గా వుండేవాడు. కేరళ సాహిత్య పరిషత్తుకి సమావేశాల్లో నాల్గయిదుసార్లు అతన్ని అధ్యక్షపీఠం వరించింది. అతనిలాగా, A. N. G. ఫణికర్ చెప్పినట్లు 'నిజమైన భాషాసేవ చేసేవారు, విశ్రమ రహితంగా కవితా రచన చేసేవాడు చాలా అరుదుగా వుంటారు—లోకంలో.

కొచ్చి మహారాజా 'సాహిత్య నిపుణ' మెడల్ గిట్టిన పండితుల్లో ఒకరు వెణ్ణికుళం గోపాలకురుప్. 1952 సంవత్సరం రిపబ్లిక్ డే నాటి మహోత్సవంలో భాగమైన కవితా సమ్మేళనంలో మలయాళ ప్రతినిధి అతను.

## ఉపకరించిన వ్యాసాలు : మలయాళం

1. శ్రీ వెణ్ణికుళత్తిన్టె కవిత – వటక్కుకూర్ రాజరాజ వర్మరాజా
2. జీవిత చరిత్ర సంగ్రహం – A.N.G. ఫణికర్
3. ఆదరాంజలి – డా. పి. కె. నారాయణ పిళ్ల
4. బాలలోకం – వెళ్లాయణి అర్జునన్

[''తంగత్తాలం'' అన్న వ్యాస సంకలనంలో పై వ్యాసాలు ప్రచురించబడ్డవి]

5. కదళీవనం (కవిత సంపుటి)–శ్రీ వెణ్ణికుళం గోపాల కురుప్.

— శ్రీ నా భక్తవత్సలరెడ్డి

## ''మేల్కొన్న మనిషి ఎవ్వడు?''

''భారతి'' డిసెంబర్ 77 సంచికలో దాశరథి కవిత అధివాస్తవిక చిత్రం శీర్షికతో డా. మాదిరాజు రంగారావుగారు, ''మేల్కొన్న మనిషిని చూడ్డానికి వెళ్ళుతున్నాను'' అనే డా. దాశరథి

కవిత గూర్చి చేసిన సమీక్ష చదివాను. ఆ వ్యాసం మూడవ (III) భాగంలో డా. రంగారావుగారు ఆ కవితకీ, భారత స్వాతంత్ర్యోదయానికీ ముడిపెట్టారు.

ఈ కవిత రచనాకాలం 1950. చైనాలో మావో నాయకత్వంలో ఎర్రసేన, చాంగ్ కై షేక్ కిరాయి సైనికులను పారద్రోలి "ముక్‌డెన్" పట్టణాన్ని ఆక్రమించుకుని కీలకమైన విజయం సాధించిన శుభసమయంలో సామ్యవాది ఐన మహాకవి స్పందించినతీరే ఈ కవిత. ఈ కవితమీద ఖమ్మంజిల్లా రచయితల సంఘం కార్యదర్శీ, నడి యవ్వనంలో మృత్యువు కబళించిన గొప్ప కవీ, కథకుడూ, స్వాతంత్ర్య యోధుడూ ఐన కీ. శే. ఉటుకూరు రంగారావు ఒక "కాంట్రావర్సీ" కూడా లేవతీసారు. (చూడుడు : అప్పటి "తెలుగు స్వతంత్ర" సంచికలు.) ఈ కవితలో మత్తు గురించి ఉండడం, చైనీయులు నల్లమందు బానిసలు కావడమే. కవితలో అధివాస్తవికత ఉందా లేక సింబాలిజం ఉందా? రెండూ ఒకటేనా? ఇది డా॥ మాదిరాజే నిర్ణయించగలరు. నావంటి సామాన్యమైన పాఠకుడికి మించినపని.

ఈ కవితకు ప్రేరణ చైనా ప్రజా పోరాటం విజయం కావడంవల్ల డా. దాశరథి గొప్పదనం పెరుగుతుందే కానీ తగ్గదు అని నా అభిప్రాయం.

యాదార్థ్య వివరణే ఈ లేఖ ఉద్దేశ్యం అని గమనింప ప్రార్థన.

—శ్రీ బి. రామచంద్రరావు

## "డాక్టర్ భీమరావ్ రామజీ అంబేద్కర్"

శ్రీ కాకుమాను తారానాథ్‌గారు 'భారతి' (డిసెంబరు 1977)లో వ్రాసిన "డాక్టర్ భీమారావ్ అంబేద్కర్" అనే వ్యాసం చదివాను. రచన బాగుంది. కానీ ఇందులో రెండు తప్పులున్నాయి.

ఒకటి—

భీమారావ్ అనడం సరికాదు. అంబేద్కర్ గురించి అంతగా పరిశ్రమించిన శ్రీ కాకుమానుగారు ఆయనపేరునే తప్పుగా వేయడం నా కాశ్చర్యం కల్గజేసింది. అంబేద్కర్‌ను బి. ఆర్. అంబేద్కర్ అని వ్రాస్తుంటారు. ఆంగ్లంలోని బి. ఆర్. అంటే భీమారావ్ అనుకొని శ్రీ కాకుమానుగా రట్లా వ్రాసి ఉండవచ్చు. బి అంటే భీమరావ్. ఆర్ అంటే రామజీ. ఈ రామజీ అంబేద్కర్‌గారి తండ్రి. ఈ విషయం వ్యాసంలోనే ఉంది. అందుకే భీమరావ్ రామజీ అంబేద్కర్ అని ఉండాలి. మహారాష్ట్రుల నామీకరణ పద్ధతి ఇది

రెండు—

భీమారావ్ అని మకారాన్ని దీర్ఘంగా వాడినారు. ఇదీ సరికాదు. రామారావు, సుబ్బారావు అని రెండవ అక్షరం దీర్ఘంగా ఆంధ్రదేశం సర్కారు జిల్లాల్లో మాత్రమే ఉచ్చరిస్తారు.

రాయలసీమలో రామరావు, సుబ్బరావు అని పలుకుతారు. కర్ణాటక, మహారాష్ట్ర, కొంకణ ప్రాంతాల్లో(అంబేద్కర్ కొంకణి), రాంరావ్, సుబ్రావ్ అని ఉచ్చరిస్తారు. వ్రాసేటప్పుడు రామరావ్, సుబ్బరావ్ అని వ్రాస్తారు. వ్యాసశీర్షిక "డాక్టర్ భీమరావ్ రామజీ అంబేద్కర్" అని ఉండవలెను. చారిత్రక పాత్రలపేర్లు మన ఇష్టం వచ్చినట్లు వ్రాయరాదు.

—శ్రీ సర్దేశాయి తిరుమలరావు.

సెప్టెంబరు 1977 'భారతి'లో డా. సి. ఆనందారామం గారు 'విశ్వనాథ—చలం' అనే వ్యాసం వ్రాశారు. అందులో విశ్వనాథని, చలాన్ని ఒకే గాటన కట్టివేశారు. అందులో నేర్పుగా విశ్వనాథ తత్వానికి నివాళిపట్టారు. శిల్పసౌందర్యంలో సామ్యమున్నట్లు సమీక్షించటానికి సమకట్టిన ఈ వ్యాసంలో వారి తత్వాలు, దృక్పథాలలోసైతం సామ్యమున్నట్లు చిత్రించబూనారు.

'ప్రాచ్యసంస్కృతికి పట్టుకొమ్మగా నిలచినవారు శ్రీ విశ్వనాథ అన్నారు. వారు ఏ సంస్కృతికి దాసులో వివరిస్తాను. 'చలం పాశ్చాత్య సంస్కృతి వెల్లువలో ఊగిపోయినవారు' అని వ్రాశారు. స్పష్టపడవలసింది చలానికి 'ప్రాచ్య' అనీ లేదు, 'పాశ్చాత్య' అనీ లేదు. సత్యం ఆయనకు కావలసింది. ఆయనొక సత్యాన్వేషకుడు. దానికి నిదర్శనం ఆయన జీవితమే.

విశ్వనాథను గూర్చి ప్రముఖ విమర్శకులు ఆర్. యస్. సుదర్శనంగారు వ్రాసిన విమర్శ మనకు వారి పాత్రలను, తత్వాన్ని అర్థం చేసుకోడానికి తోడ్పడుతుంది.

"ఆధ్యాత్మిక వాదాన్ని బాగా మెలిద్రిప్పి, దాన్ని సాంప్రదాయానికి ప్రతినిధిగా ఆధునిక సంస్కారానికి ప్రతిద్వంద్విగా రూపొందించిన నవలా రచయిత విశ్వనాథ సత్యనారాయణ."

"ఈ దృష్టి అధునాతన భావాన్ని పాశ్చాత్య సంస్కారం వాసనగల ఏ చిన్న విషయాన్ని సహించని తీవ్రవాది దృష్టి."

"తన అభౌతిక దర్శనాశక్తితో హైందవ వ్యవస్థాధర్మాన్నీ, దాని ప్రయోజనాన్నీ అవగాహన చేసుకొన్న విశ్వనాథ ఆ వ్యవస్థను ప్రేమించటమేకాదు, దాన్నిగూర్చి ఒక రొమాంటిక్ వ్యామోహంలో పడిపోయాడు. అందుకు బాగా దోహదంచేసింది ఆ వ్యవస్థయొక్క క్షీణ దశ. ఆ వ్యవస్థ కాలనిర్జితమౌతున్న ఒకానొక సాధనము మాత్రమేననీ, దాని గమ్యమైన తత్వము అంతకంటె ముఖ్యం కాబట్టి ప్రాతను వర్జించి క్రొత్తను నిర్మించటమే కర్తవ్యమనీ ఆయన ఆలోచించలేదు."

"సనాతన ధర్మాన్ని ప్రకాశం చెయ్యటంకంటె, స్వపక్ష సమర్థనమే, వ్యవస్థాధర్మ ప్రబోధమే సాహిత్యానికి ప్రయోజనంగా భావించాడు. సాహిత్యరంగాన్ని సమరరంగంగా దర్శించిన విశ్వనాథ ఈ అపోహకు అనుగుణంగా తన వ్యూహరచన సాగించాడు. అతనికి కొత్త ఒక రోత. పాత ఒక రీతి."

''తెలుగుదేశంలో ముఖ్యంగా సాహిత్యంలో అప్పుడు పొడ చూపిన హేతువాదము, భౌతికవాదము, పురాణాల అవహేళనా, వర్ణ విభేద నిరసనమూ మొదలైనవి విశ్వనాథలో ఆవేశం కలిగించాయి.''

చలం తాను కలం పట్టటానికి కారణం ఇలా చెపుతాడు: ''నేను చూస్తున్న అన్యాయాలవల్లా ఘోరంవల్లా మండిపోయాను. ఆ మంట నాలో ఇమడక కథ అయింది. నేను రాసిందానికి రస ప్రపంచంలో ఓ విలువ వుందనీ తెలీదు. ఎట్లాగైనా మనుషుల కళ్లు తెరుద్దామనే ఆవేశం ఉక్కిరి బిక్కిరి చేస్తుంది.

''ఏది ఎలా ఉన్నా వ్యవస్థను మన్నించి తీరాలంటారు విశ్వనాథ. వ్యవస్థ విచ్ఛిన్నం కావలసిందేనని వాదిస్తారు చలం. విశ్వనాథవారి 'చెలియలి కట్ట', చలంగారి 'మైదానం' నవలలు ఆయా దృక్పథాలను వివరిస్తాయి. రెండు నవలలలోను హద్దుల నతిక్రమించిన కథానాయికలకు మరణమే శరణ్యం కావటం గమనార్హం. అది అనివార్యమైన సాంఘిక సత్యం'' అంటున్నారు రచయిత్రి.

సంఘర్షణలో నలిగి రత్నావళి వైరాగ్యాన్ని పొంది మూఢ విశ్వాసానికి బలైపోయింది. ''నిగ్రహంలేక మూడోపెళ్ళి చేసుకున్న సీతారామయ్య, ధర్మం, లోకం తెలియకపోయినా సాంప్రదాయంలో ఉండి యాంత్రికంగా పిల్లల్నికనే రాజ్యలక్ష్మి తనకంటె అధికులని భావించే'' రోగమనం రత్నావళికి పట్టింది. పుణ్యలోకాలు జడ తుల్యులైన సీతారామయ్య, రాజ్యలక్ష్మి పెట్టవలసిన భిక్ష అయింది ఆమె గతి. పైగా ఆమె విజ్ఞానం సీతారామయ్య కొడుకులో ఆబ్దికాలు పెట్టించుకుంటే పుణ్యలోకాలు కలుగుతాయని నేర్పింది. తను పాపం చేశానని నమ్మే స్థితికి దిగజారింది. తన బ్రతుకులో కలిగిన ఘర్షణకు కారణం వ్యవస్థలోని లోపమని తెలియనంతవరకే ఆమెను పెరగనిచ్చాడు విశ్వనాథ ఈ వివాహ వ్యవస్థ ఎల్లకాలం ఇలాగేలేదు. ఇది ఎన్నో మార్పులకు లోనైంది. ఒకే స్త్రీకి అనేకులు భర్తలు, ఒకే పురుషుడికి అనేకులు భార్యలు సంఘసమ్మతమైన దశల నెన్నింటినో గడించిందీ వ్యవస్థ. ఇది అనివార్యంకాదు. ఏకోదరులు వివాహం చేసుకుంటేనే పుణ్యం అనుకునే కాలమూ వున్నాయనే చారిత్రక యదార్థం తెలియని అజ్ఞానమే చివరికి రత్నావళిలో విరిసిన విజ్ఞానమనుకుంటే చెప్పేదేముంది? ఆమెను చంపడంలో రచయిత ఉద్దేశమేమిటి? మూర్ఖమైన ఫ్యూడలిస్టు సనాతన బూజువ్యవస్థని నిలబెట్టాలనే.

ఇక చలంగారి మైదానంలోని రాజేశ్వరి ఒక బ్రాహ్మణ ప్లీడరు భార్య. ఒక మహమ్మదీయుని ప్రేమించి వెళ్లిపోతుంది. దీనిలోని రాజేశ్వరి తనను సమర్థించుకోవడానికి సంఘాన్ని హేళన చేస్తుంది. వాళ్ళ దొంగ నీతుల్ని కడిగి వేస్తుంది. తాను లేచిపోయి వచ్చినందుకు ఏమాత్రం విచారించదు. ఆమె సంఘానికి జడిసి చనిపోలేదు. ''ఈ సంఘర్షణ వ్యవస్థకూ, వ్యక్తి వాంఛకు నడుమ కాదు'' అని రచయిత కూడా అన్నారు. మరి అనివార్యమైన సాంఘిక సత్యమేముంది అందులో. ''ప్రేమించకండా నిలవలేని మహత్తర ప్రణయంతో స్వేచ్ఛగా ప్రేమించిన'' ఆమె ప్రేమకోసం, ప్రియుడికోసం మరణిస్తుంది. ప్రేమ ఎంత త్యాగాన్ని ప్రసాదిస్తుందో తెలపటానికి, మూర్ఖమైన సాంఘిక నీతిని కడగటానికి ఆమెను మరణింపజేస్తాడు రచయిత.

రత్నావళీ, రాజేశ్వరిల మరణాల ఉద్దేశ్యాలలో అంత తేడా వుండే సామ్యము ఒక్క మరణంలోనేనా? దానిని సామ్యంగా చిత్రించడమే చిత్రంగా వుంది.

ఏకవీర, పద్మావతి ఇద్దరూ అతిగాఢంగా ఒకరిని ప్రేమించి మరొకరిని వివాహం చేసుకున్నారు చివరికి ఇద్దరూ చనిపోయారు.

''ఏకవీర వివాహం కాగానే ధర్మబద్ధమైన ప్రణయాన్నే స్వీకరించాలనుకొని, అది అనుకూలించక తొలి ప్రణయంవైపు మళ్ళింది.'' కాని పరపురుషుడు ముట్టుకుంటే అధర్మం, పాపం అనే విషయము ఆమె అస్థిగతం చేశాడు రచయిత. అందుకనే వీర భూపతి పరిష్వంగం తర్వాత దానిని ''మహాఘము''గా భావించి ఏకవీర ఆహుతైపోయింది. కుట్టాన్‌కోసమా? వీరభూపతికోసమా? తాను ఆహుతి అయింది. కాదు. వ్యవస్థకోసం.

చలంగారి పద్మావతి తాను ప్రేమించిన రాధాకృష్ణ కోసం భర్తను ధిక్కరిస్తుంది. పద్మావతికి రాధాకృష్ణులకు సంబంధ మున్నట్టు భర్తకు ఉత్తరం దొరుకుతుంది. అందుకని ఆమెని విడిచిపెడ్తానని, రాధాకృష్ణనిపై దావా వేస్తానని అంటాడు.

''రాధాకృష్ణనిమీద ప్రేమచేత, అతను ఇరకాటంలో పడ్తాడని, పిల్లలకు కష్టం కలుగుతుందని తలచి ప్రాణత్యాగం చేయడానికి సిద్ధపడుతుంది పద్మావతి.'' ప్రేమ త్యాగానికి దోవతీస్తుంది. సంఘం అంటే ఆమెకు ఖాతరులేదు. ఆమె చావువల్ల మనలో ప్రస్తుత వివాహ వ్యవస్థలోని లొసుగు, సంఘమంటే జుగుప్స కలుగుతాయి. కాని వ్యవస్థ అంటే అభిమానం కలగదు.

పాతసంతతినీ తిట్టిన చలం, కొత్తసంతతినీ మెచ్చుకోలేదు. 'కొత్త'లోని తప్పులను చూపడానికి ఏమాత్రం వెనుదీయలేదు. వ్యవస్థని రక్షించటానికి విశ్వనాథ పాత్రలు. వ్యవస్థలోని కుళ్ళును అసహ్యించుకొనేలా చేసేవి చలం పాత్రలు. మరి వారిద్దరూ సామ్యం చదకడంలో స్వారస్యమేముంది? విశ్వనాథ వెనుకచూపును విమర్శించకండా చలం పక్కన కూచోబెట్టడంలో కుట్రలేకపోలేదు.

సంఘపు దొంగనీతిని తూర్పారపట్టినవారొకరు.

దొంగనీతిని, తమ వర్గనీతిని బోధించేవారు మరొకరు.

''భగవంతుణ్ణికూడా వర్ణాశ్రమ ధర్మపక్షపాతిగా, బ్రాహ్మణీకపు అంగరక్షకునిగా మార్చిన వైశ్వనాథీయ ఛాందస మౌఢ్యానికి అస్పృశ్యత కల్పిస్తాను'' అంటారు నవీనులు శ్రీ సోమసుందర్. చలాన్ని, ఆయన సూనృతాన్ని సూటిగా విమర్శించే ధైర్యంలేదు ఎవరికీ.

—'వ్యోమ'

# గ్రంథ విమర్శలు

## వక్రోక్తి జీవితము

[బాలానందిని అను తెలుగు వ్యాఖ్యతో కూడినది. వ్యాఖ్యాత : డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, డెమ్మీ సైజు - 34+15 పేజీలు వెల 30 రూపాయలు. ప్రకాశకులు : సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ. ప్రాప్తిస్థానం: సాహిత్య అకాడమీ, మద్రాసు-6.]

కుంతలకుడు, కుంతకుడు అనే నామాంతరాలుగల రాజానక కుంతకుడు రచించిన 'వక్రోక్తి జీవితం' అలంకార శాస్త్ర గ్రంథాలలో పేరు పడినది. వక్రోక్తిని కావ్య జీవితంగా గ్రహించి దానిని సమర్థించినందువల్లనే దీనికి ఈ పేరు వచ్చియున్నది. ఇతనికి పూర్వం కావ్యజీవితాన్ని గురించిన భిన్నాభిప్రాయాలున్నవి. అందులో ధ్వనివాదం ఒకటి. దానిని ధ్వన్యాలోక కర్త ఆనందవర్ధనుడు ప్రచారానికి తెచ్చి, దానికొక స్థిరత్వాన్ని చేకూర్చాడు. అతనికి పూర్వమే ఆ ధ్వని వాదం ఉన్నట్లు "కావ్య స్యాత్మా ధ్వనిరితి బుధైర్యః సమామ్నాత పూర్వః" అనే తొలి కారిక వల్లనే తెలుస్తున్నది. ధ్వని గ్రంథానికి లోచన వ్యాఖ్యను రచించిన అభినవ గుప్తుడు ధ్వని వాదానికి విస్తృతమైన ప్రచారం కలిగించాడు. కావ్య ప్రకాశకారుడైన మమ్మటుని దగ్గరనుంచీ తర్వాతి ఆలంకారికులందరు ఆనంద వర్ధనుని మతాన్నే అనుసరించారు. వ్యక్తివివేకాన్ని రచించిన మహిమ భట్టు ధ్వనిని అనుమానంలోనే అంతర్భవింపజేస్తూ, ఆనందవర్ధనుని మతాన్ని ఖండించి అనుమతి వాదాన్ని స్థాపించాడు. కాని, ఆ వాదం అతనితోనే నిలచిపోయినట్లున్నది. మహిమభట్టు కంటె ప్రాచీనుడైన కుంతకుడు ధ్వని వాదాన్ని ఖండించకపోయినా వక్రోక్తివాదాన్ని నెలకొల్పాడు. భామహుడు, దండి మున్నగు ప్రాచీనాలంకారికులు వక్రోక్తిని అతిశయోక్తిగా తీసికొని దానికి కొంత ప్రాధాన్యం ఇచ్చారు. నవీనులు శత సంఖ్యలో ఉన్న అలంకారాలలో వక్రోక్తిని ఒక అలంకారంగా గ్రహించి, శ్లేషవలనగాని, కాకుస్వరం వల్లగాని అర్థాంతరం వస్తున్నప్పుడు వక్రోక్తి అవుతుందని లక్షణం చెప్పారు. కుంతకుని వాదాన్ని చాలామంది ఆమోదించకపోవడంచేతనే కాబోలు వక్రోక్తి జీవితానికి ప్రచారం లేకపోయింది. ఆ గ్రంథం దుర్లభమై పోయింది.

గ్రంథారంభంలో "కావ్య స్యాయ మలంకారః కోఽప్యపూర్వో విధీయతే" అని చెప్పటవల్ల దీనికి కావ్యాలంకారమనే పేరుండినట్లు కొందరు భావించవచ్చును. కాని కుంతకుని తర్వాతి వారందరూ దీనిని వక్రోక్తి జీవితంగానే పేర్కొన్నారు. కావ్యాలంకార మన్నది అలంకార గ్రంథమనే విషయానికే సూచకం. ఇతనికి ముందున్న వారూ, తర్వాత వారూ కొందరు ఈ అభిప్రాయాన్నే వెల్లడించారు విద్యానాథుడు తన 'ప్రతాపరుద్ర యశోభూషణం' (ప్రతాపరుద్రీయం) లో "చిరేణ చరితార్థోఽభూత్ కావ్యాలంకార సంగ్రహః" అని తన గ్రంథాన్ని 'కావ్యాలంకార సంగ్రహం, గానే చెప్పియున్నాడు. కుంతకుడు 'కావ్యస్యాయ మలంకారః' అని అన్నాడు గాని 'కావ్యాలంకారః' మని చెప్పలేదు. అందువల్ల దీనికి కావ్యాలంకార మనే పేరున్నదని చెప్పలేము. ఇది ఆలంకార గ్రంథమైనందున కావ్యాలంకారమనే పేరు వచ్చినట్లు 'కావ్యస్యాయ మలంకారః' అనేదే తెలియజేస్తున్నది. ఇది "వక్రోక్తి జీవితం" గానే ప్రసిద్ధిని పొంది ఉన్నది.

ఈ గ్రంథంలో నాలుగు ఉన్మేషాలు (అధ్యాయాలు) ఉన్నవి. మొదటి ఉన్మేషంలో తొలుత కావ్య లక్షణం, శబ్దార్థ స్వరూపం వివరించబడినవి. తర్వాత గ్రంథకర్త, కవివ్యాపార వక్రతయే కావ్య జీవితమని చెపుతూ—ఆ వక్రత—వర్ణ విన్యాస వక్రత, పదపూర్వార్థ వక్రత, ప్రత్యయ వక్రత, వాక్య వక్రత, ప్రకరణ వక్రత, ప్రబంధ వక్రత అని ఆరు విధాలని తెలిపాడు. వాటి స్వరూపాన్ని, ఉదాహరణలనూ సంక్షేపంగా చూపాడు తర్వాతి ఉన్మేషాల్లో వాటిని గురించిన వివరాలున్నవి. ద్వితీయోన్మేషంలో వర్ణ విన్యాస వక్రత, పద పూర్వార్థ వక్రత, ప్రత్యయ వక్రత వివరింపబడినవి. తృతీయోన్మేషంలో వాక్య వక్రతను గురించి వివరంగా ఉన్నది. చివరి ఉన్మేషంలో ప్రకరణ, ప్రబంధ వక్రతలు వివరించబడినవి. ప్రసంగవశాత్తు పూర్వాలంకారికుల మతాలను పరామర్శిస్తూ కొన్ని అలంకారాల స్వరూపం కూడా తెలుపబడింది.

చాలాకాలం వరకూ ఈ గ్రంథం అజ్ఞాతంగానే ఉండినది. 1922లో అలంకార శాస్త్రంలో ప్రత్యేక కృషి చేసిన శ్రీ సుశీల కుమారడే (ఎస్. కే. డే)గారు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో ఉపలబ్ధమైన రెండు ఉన్మేషాల గ్రంథాన్ని మాత్రం ప్రకటించారు. అది అప పాఠాలతోనూ, గ్రంథపాతాలతోనూ నిండిఉన్నది. తర్వాత మరొక వ్రాతప్రతి కొంతభాగం దొరకగా, 1926లో మరొకసారి వెనకటిదానికన్న మెరుగుగా అసమగ్రంగానే ఆయనే ప్రకటించారు. ఆయన ఎడిట్ చేసిన తృతీయ ముద్రణలో గ్రంథం ఇంచుమించుగా పరిసమాప్తమైనది. ఏమంటే ఇందులోకూడా చాలాచోట్ల గ్రంథం లోపించే ఉన్నది. ఆంధ్రవ్యాఖ్యానంతో కూడిన ఈ వక్రోక్తి జీవితం డే పండితుని చివరి ముద్రణ ననుసరించినది.

సంస్కృతాలంకార శాస్త్ర గ్రంథాలలో పేరుపడినా దీనిని ఎవ్వరూ ఇంతవరకూ అనువదించడం గాని, దీనికి వ్యాఖ్యను రచించడంగాని జరగలేదు. ధ్వన్యాలోకం, రసగంగాధరం, ప్రతాపరుద్రీయం కావ్యాలంకార సూత్రవృత్తి మొదలైనవాటికి ఎన్నడో అనువాదాలు వచ్చాయి. అపపాఠాలు, గ్రంథపాతాలు మెండుగా ఉన్నందున—అర్థం కావడం కష్టమగుటవల్ల దీని జోలికి ఎవ్వరూ పోలేదు. దీనికి ప్రతిభా పాండిత్యాలు మిక్కిలి అవసరం. దీని వ్యాఖ్యాత డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు సంస్కృత-ఆంధ్ర-ఆంగ్ల భాషలలోనేకాక పాళీ మున్నగు ప్రాకృత భాషలలోకూడా గట్టి పండితులు; చక్కని కవులు; ఉత్తమ విమర్శకులు. అందువల్లనే

అసితర సాధ్యమైన వ్యాఖ్యా రచన వారికి సాధ్యమైనది. ఏతద్రచనలో తనకు ఆచార్య విశ్వేశ్వరులు ఈ గ్రంథానికి వ్రాసిన హిందీ వ్యాఖ్యను సంప్రతించినట్లు చెప్పుకున్నారు. చాలాచోట్ల విశ్వేశ్వరుల అభిప్రాయాలు సరిపోలేనందున వీరు తమకు ఉచితమని తోచిన రీతిని వ్యాఖ్యానించాడు. కొన్నిచోట్ల లోపించిన గ్రంథభాగాలను ఊహించి సర్దుబాటు చేసుకోవలసి వచ్చింది. మూలం సరిగా లేనప్పుడు చేయవలసిన పని అదే!

ప్రసిద్ధవ్యాఖ్యాతలు వ్యాఖ్యానాలు వ్రాసేటప్పుడు ''నామూలం లిఖ్యతే కించిత్ నా నపేక్షిత ముచ్యతే'' అని ప్రతిజ్ఞ పట్టి రచనకనుగుణంగానే వ్యాఖ్యలు వ్రాస్తారు. అవే చాలామందికి ఉపయోగించి కలలం ఉండగలవు. ఈ వ్యాఖ్య కూడా ఆ పద్ధతిలోనే నడచింది. అలంకార శాస్త్రంలో ఎక్కువ ప్రవేశం లేనివారు కూడా సులభంగా అర్థంచేసుకొనే రీతిలో ఉన్నది యీ వ్యాఖ్య.

వక్రోక్తి జీవితంలో మూలకారికలూ, వాటికి విపులమైన వృత్తి ఉన్నవి. వృత్తిలో ఆ యా విషయాలకు ఉదాహరణములుగా సుప్రసిద్ధకవుల గ్రంథాలనుండి శ్లోకాలు గ్రహింపబడినవి. ఈ గ్రంథంలో మూలకారికలూ, వృత్తిలోని ఉదాహరణలూ మూలంలో ఉన్నట్లుగానే గ్రహింపబడి వాటికి వ్యాఖ్యలు వ్రాయబడినవి. మూలంలోని వృత్తిభాగానికి మూలరహితంగా అనువాదం మాత్రమే ఉన్నది. వృత్తిమూలంకూడా వుంటే గ్రంథానికి సమగ్రత ఉండేది. మొదట, వృత్తిమూలాన్ని కూడా వ్యాఖ్యా సహితంగ ప్రకటించదలచి, దానిని కూడా వ్రాతప్రతిలో చేర్చినట్లూ, కారణాంతరాలవల్ల కారికా—ఉదాహరణములను మాత్రం ఉంచి, మిగిలిన మూలం తీసివేసినట్లూ వ్యాఖ్యాత తెలుపుతున్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు రసగంగాధరంవంటి పెద్దగ్రంథాల వ్యాఖ్యలను మూలంతోకూడా ప్రకటించి, తక్కువ వెల పెట్టినప్పుడు, కేంద్ర సాహిత్య అకాడమీవారు వృత్తిమూలాన్ని కూడా చేర్చి ప్రకటిస్తే పాఠకులకు ఇతోధికంగా ఉపయోగంగా ఉండేది.

లమూల్యమైన యీ గ్రంథాన్ని వ్యాఖ్యాన సహితంగా ఆంధ్రుల కందజేసిన సాహిత్య అకాడమీవారినీ, సమర్థంగా వ్యాఖ్యను రచించిన డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారినీ అందరూ అభినందించవలసి ఉన్నది.

—శ్రీ బులుసు వేంకటరమణయ్య

## 1 వా ల్మీ కి

[పద్యకావ్యము. రచన : శనగన నరసింహస్వామి, ప్రతులకు: న్యూ స్టూడెంట్సు బుక్ సెంటర్, ఏలూరురోడ్, విజయవాడ—2. మూల్యము : రూ.3–00; 62 పుటలు.]

## 2 భా గ మ తి

[(హైదరాబాదు చరిత్ర) పద్యకావ్యము రచన: భాషాప్రవీణ పాతకోట రాధాకృష్ణమూర్తి. ప్రధానాంధ్ర పండితుడు, ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయము, లాడికొండ, గుంటూరుజిల్లా. వెల : రెండురూపాయలు. 52 పుటలు. ప్రతులకు : రచయిత—లేక నవోదయ పబ్లిషర్సు, అరండల్ పేట, 5వ లైను, గుంటూరు—2]

62 పుటల ఈ పద్యకావ్యం ''సందర్శనము, మంత్రోపదేశము, తపస్సమాధి, ఆశాసనము, ఛందోవాణి'' అనే అయిదు సర్గలలో విభజింపబడి 127 పద్యాలలో, ఆదికవి వాల్మీకి జీవిత గాథను శనగన నరసింహస్వామిగారు చక్కగా వర్ణించినారు. శైలిలో సరళత ఉన్నది. రసం కుంటుబడకుండా ధారాళంగా సాగిపోయింది. కీ. శే. తన తల్లిగారికి కృతి సమర్పణచేసి ధన్యులైనారు కవిగారు.

ఈ 'వాల్మీకి' పద్యకావ్యం ఈ తరుణంలో—అంటె ఎన్నికలు జరుగుతున్నప్పుడు — వెలువడటం సమయానుకూలంగా ఉన్నదని చెప్పక తప్పదు. ఎందుకంటె నిషాదుడైన వాల్మీకియొక్క వృత్తి వేట, దారిదోపిడి. ఒకనాడు ఋషులు తటస్థపడతారు. వారిని నిలదీసి మీ దగ్గరున్నదంతా ఇచ్చివేయుడని గర్జిస్తాడు. అప్పుడు వారు, అట్లే ఇచ్చివేస్తాము కాని ఒక్కమాట......... నీ వొనర్చిన ధనంజయ పాపము నీకు మాత్రమే అనుభవ యోగ్యమౌనో, భవదంగనయున్ సుతులందు భాగముఁన్—గొనుదురో(34) అడిగి తెలిసికొని రమ్మంటారు. వెంటనే వాల్మీకి తన బోయపల్లెకుపోయి భార్యను పిలచి, ''నా పాపమునందు నికు నొక భాగము గల్గునో లేదో చెప్పుమా''[42] అని అడుగుతాడు. అందుకతని భార్య ''పెనిమిటి చేసిన పాపంబున భాగములేదు చిగురు బోణికి బుణ్యంబున సగము పాలు గలదని—వినమే చెవులార! ధర్మవేత్తలు నుడువన్'' అని శాస్త్రరీత్యా సందేహ నివృత్తి చేస్తుంది. ఈ సంఘటన వాల్మీకి జీవితంలో మహత్తరమైన పరివర్తన కలుగచేసింది. అతడు వెంటనే తిరిగివచ్చి భార్యతో జరిగిన సంభాషణ సారాంశం ఋషులతో చెప్తాడు.వారు తారకమంత్రం ఉపదేశిస్తారు. అతను ఘోర తపస్సు చేస్తాడు. ఇంతలో ఒకనాడు క్రౌంచపక్షి జంటలో, మగపక్షి బోయవాని బాణానికి గురి అయింది. ఆడపక్షి విరహవేదన భరించలేక శోకంతో తల్లడిల్లసాగింది. ఈ హృదయ విదారకమైన సంఘటన చూచిన వాల్మీకి' నోట ఆశువుగా ఈ కింది శ్లోకం వెలువడింది.

> ''మానిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతః సమాః
> యత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్.''

అంతే. అతను ఆదికవియై రామాయణాన్ని రచిస్తాడు. ఇది వాల్మీకి జీవిత గాథ.

ప్రజాస్వామిక వ్యవస్థ ప్రతి 5 ఏండ్లకోసారి సాధారణ ఎన్నికలు జరుగుతవి. ప్రస్తుతం 5 రాష్ట్రాల్లో శాసనసభ ఎన్నికలు జరుగుతున్నవి. ఒక్కొక్క నియోజకవర్గంలో ఎందరో అభ్యర్థులు లక్షలాది తెల్ల ధనం, నల్ల ధనం, అన్యాయార్జితం వానజల్లువలె కురిపించబడుతున్నది. సామ, దాన, భేదదండోపాయాలన్నీ ప్రయోగింప బడుతున్నవి. కాబోయే శాసన సభ్యులు కావలసినన్ని శాంతి వ్యతిరేక చర్యలు 'ప్రేమలోను యుద్ధంలోను అన్నీ చెల్లు'' అనే

ఇంగ్లీషు సామెత ప్రకారం చేస్తున్నారు. ఇంతకు అభ్యర్థు లందరిలో ఒక్కరికే ఫలితం దక్కుతుంది. తక్కినవారు "మున్నూరు రూపాయలు, మూతిమీది మీసం పోగొట్టుకుని" సోమయాజులనే పేరుకు గూడా నోచుకోకుండా పోతారు. యిక కొందరు యిన్ని ఘోరాలు చేసి గెలిచినా, వందేమాతరం రామచంద్రరావు వంటి ఘటికుడైన ప్రత్యర్థి తటస్థపడితే రచ్చకీడ్చి, కోర్టుద్వారా ఎన్నికలను రద్దు చేయించటం కద్దు.

అథవా గెలిచినా దివాలా తీసేటంత పని జరుగుతుంది! కాబట్టి నష్ట పరిహారం చేసికోటానికీ, రాబోయే ఎన్నికలకు తగినంత నిధి సమకూర్చి పెట్టుకోటానికి అవలంబించే అన్యాయాలలో తమ భార్యా పుత్రులు పాలు పంచుకుంటారా? లాభపడే బంధు మిత్రులు పాప ఫలాన్ని పంచుకుంటారా? వాల్మీకివలె అడిగి తెలిసికుంటె జ్ఞానోదయం కలుగుతుందని ఆశించవచ్చు.

ఈ దృష్టితో చూస్తె ఈ కావ్యం, ఈ రోజుల్లో బలవత్తరమైన గుణపాఠం నేర్పేదిగ ఉన్నదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

## 'భాగమతి' [హైదరాబాదు చరిత్ర]

ఈ ప్రణయ కావ్యానికి మొదటి పద్యం తన కలానికి బలమిచ్చిన అర్ధాంగిని గూర్చి వ్రాయటం అర్థవంతంగా ఉన్నది. కాని మున్నుడిలో "కవుల గౌరవించి యందలా లెక్కించు కాలము గతించినది" అన్నారు. రాచరికంలో ముఖస్తుతి పరులకే అందలాలు. అది గతించుటే మంచిది, పురోగతికి తార్కాణము. పద్యాల శైలి రచయిత భాషా ప్రావీణ్యాన్ని చాటుతున్నది. ఇది గోలకొండ నవాబు జనానా చరిత్రకాబట్టి, అక్కడక్కడ, హుషారు ఖరీదు, షమ్యానా, పరదాలు, బజారు, జాగీరు, ఖుషి, ఆఖరో ఖుదా, ఆలంపనా, తుఫాను, నాజూకు వంటి ఉర్దు పదాలు సందర్భోచితంగా వాడి పద్యాలకు సొంపు ఒనగూర్చినారు మూర్తిగారు.

ఒక సంఘటన మాత్రము వాస్తవానికి విరుద్ధంగా చిత్రించినారు. కామాతురుడైన ఖులీ ఖుతుబ్షా ప్రియురాలైన భాగమతిని కలవటానికి పొంగిపొరుతున్న మూసా నదిలో దూకినాడని తెలిపినారు. యువరాజుకు వాహనాలు కొదువగాదు. ఖులీకుతుబ్షా గుర్రమెక్కి నదిని దాటినాడని, "తారీఖె ఖుతుబ్ షాహి" లోను, "గుల్జాం ఆసఫీ"లోను పచలంకి రబ్బాసా (పచలంయొక్క నర్తకి) అనే శీర్షికతో "సైరె గోల్కొండ" అనే గ్రంథంలోను ఖుతుబ్షా గుర్రమెక్కి నదిని దాటినాడనే రాయబడ్డది

కావ్యాలలో అతిశయోక్తి ఉంటుంది కాని అతి సర్వత్రవర్జయేత్ అని గదా ఆర్యోక్తి. "రాసక్రీడ సల్పిన రాధకృష్ణులేమి చేసినారు? అని ప్రశ్నిస్తు పడతి పేరుతో పట్నం నిర్మించిన ఖుతుబ్

షాయే ఘనుడు'' అని రచయిత అనుట ఔచిత్యానికి భంగం. ఒక సామాన్యుడైన రాజు, భోగలాలసుడై అనేక ప్రియురాండ్రతో కేళీ విలాసాలు జరిపిన వానిని అవతార పురుషుడైన కృష్ణపరమాత్మని కన్న మిన్న అనుటలో అర్థము లేదు. ''కుల్యాతె మహమ్మద్ ఖులీ ఖుతుబ్షా'' అనే ఉద్గ్రంథంలో ఈ విధంగా ఉన్నది.

ఖుతుబ్షాకు ప్రియురాండ్రు అనేకులు. అందులో ఒకతి భాగమతి. అతను తన ప్రియురాండ్రను గూర్చి అనేక కవిత అల్లినాడు. వాటిలో భాగమతి ప్రశంస కానరాదు. అయితే ఈ కింద ఉదహరింపబడిన వాటిలో భాగమతినిగూర్చి పేర్కొనటం జరిగింది:

1 తన ప్రియురాలు తన కొలువులో నర్తకిగా నున్నందుకు ఖుతుబ్షా తాను అదృష్టవంతుడని గర్విస్తున్నాడు.

2 ఖుతుబ్షాకు ఒక వెల లేని మౌక్తికము దొరికినది. అది నాట్యకళా ప్రపూర్ణ.

3 ఓ ప్రియురాలా! నీ ప్రేమకు చిహ్నంగా నిర్మింపబడ్డ నగరంలోనే నేనుంటున్నాను ...

ఇక 48వ పుటలో ''మన ప్రేమ శిలాక్షరముగ కట్టింతు చక్కని యారంమను'' పాట యిచ్చె అని రాస్తు... ''రాజుల్ దలపోయ దెబ్బలకు లోటున్నదే ధరా మండలిన్'' అనే సామెత వాడినారు రచయిత. ఈ సామెత సందర్భోచితంగా లేదు. ఈ సామెత బాధలు, కష్టాలు కలిగించే సమయంలో వాడతారేగాని, నగర నిర్మాణ సందర్భంలో ఉచిత మనిపించుకోదు. అచ్చు తప్పులు అక్కడక్కడ కనబడుతూనే వుంటవి.

—శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు

## గుఱ్ఱం జాషువా

[ప్రచురణ : మహాకవి జాషువా జయంతి సమితి, మిషన్ హైస్కూలురోడ్డు, నర్సాపురం, పశ్చిమగోదావరి జిల్లా. మూల్యం: రూ. 5–00]

నర్సాపురంలో శ్రీ సంజీవరావు, శ్రీ థియడోర్ సారథ్యం వహించి నిర్వహిస్తున్న మహాకవి జాషువా జయంతి సమితి పలువురి ఆదరణ పొందింది. పలు సారస్వత ప్రయత్నాలు నిర్వహించింది. అందులో ఒకటి ఈ గ్రంథం.

ఇందులో జాషువా జీవిత సాహిత్యాలమీద తమకున్న అభిమానం పద్యాల రూపంలో, వ్యాసాల రూపంలో, అనేకులు వ్యక్తం చేశారు. జాషువా విశ్వకవి అనీ, జాషువా కవిత్వం విశ్వకవిత్వం అనీ భావించే పద్య వ్యాస సంకలనమీ గ్రంథం.

డా. మల్లిబాబు, జాషువాను నేతాజీగా చూస్తే, శ్రీ బొడ్డు ప్రకాశం వేమనగా తలిస్తే, శ్రీ థియడోర్ ఫిరదౌసీగా భావిస్తే, శ్రీ నీలం వెంకటేశ్వర్లు జాషువా వాదం వేదంగా గ్రహించటం ఈ సంకలనంలో చూడవచ్చు.

ఈ గ్రంథంలోని కవితాభినందనంలో ఆంగ్ల కవిత్వమూ ఉంది. ఆంధ్ర కవిత్వమూ ఉంది. అంతేకాదు. జాషువా కవిత్వానికి ఆంగ్లానువాదం కూడా వుంది.

శ్రీ యస్. వి. ఎ. ఆర్. శాస్త్రి జాషువా జీవిత సాహిత్యాల దర్శనం చేసుకొని, 'an impossibility made possible' అనటం; జాషువా కవితోన్నతిని చూచి 'higher than the highest' అనటం చూడవచ్చు.

ఆంధ్ర కవిత్వంలో శ్రీ యం. యస్. ప్రభాకరరావు 'స్వార్థ రహితపు కవితకు చావులేదు' అనీ, 'నీ విశాల భావము లెప్డు నెగడు భువిని' అనీ భావించటం ఉంది.

ఫిరదౌసిలోని కొన్ని పద్యాల ఆంగ్లానువాదం ఈ గ్రంథంలో ఉంది. ఈ అనువాదం సమర్థంగా నిర్వహించింది శ్రీ బి. థియడోర్.

> "Each of the couplets a drop of blood
> Consumed from me; in vain I have written:
> Will the noblest king thus utter lies?
> Will be not pay my gold he owes?
> Alas! this fact I knew not before,
> O Sultan of Ghazni! Mahmud the Great"

జాషువాను విశ్వకవిగా భావించేవాళ్ళు ఆ కవిత్వాన్ని ఆంగ్లంలోకి తర్జుమా చేయటంవల్ల ఆ లోపం తీరటం ఆరంభమవుతుంది.

వ్యాసాలు జాషువా సారస్వతంలోని విభిన్న విషయ విన్యస్తంగా ఉన్నాయి. ఒకరు జాషువా కవిత్వంలో ఫిరదౌసి ఉత్తమకావ్యం అంటే, మరొకరు ముంటాజమహల్ అత్యుత్తమ కావ్యం అంటే, ఇంకొకరు గబ్బిలం మహోత్కృష్ట కావ్యం అనటం కంఠోక్తిగా ఉంది. ఎందుకో ఖండకావ్యాలు ఉత్తమ కవితారూపం అని పట్టు పట్టకుండా ఊరుకోవటం?

శ్రీ బొడ్డు ప్రకాశం జాషువా శిష్యుడు. వేమనకూ జాషువాకు తేడా లేదన్న భావం, వేమనయే జాషువాగా పుట్టాడన్నటు వంటి భావం తెలపటం చూచిన వెంటనే 'జాషువా కవిలాంటి కవి యింతవఱకు జన్మించి యుండడు' అనటం కూడా చూడవలసి వస్తుంది. అంతేకాదు 'దశావతారమెత్తిన బ్రహ్మ' అనటం కూడా ఆ కళ్ళతోనే చూడవలసి వస్తుంది. అయితే గురుశిష్యుల ఆత్మీయతా ప్రభావం, ఆ కవిత్వాన్ని శిష్యుడర్థం చేసుకోవటానికి ఈ వ్యాసంగా అందించటానికి బాగా ఉపయోగపడింది.

శ్రీ బి. థియడోర్, ఫిరదౌసి కావ్యం, 'రసవత్తరమైన కావ్యం' అనీ 'సామాన్య ప్రజానీకం, కవులు, పండితులు' సమానంగా ఆస్వాదించే కవిత్వం కలదనీ, సముచితంగా తెలపటం చూడవచ్చు.

శ్రీ జోశ్యుల ప్రసాదరావు 'ఆంధ్ర సాహిత్యాకాశమున తళుక్కుమని మెరయుచున్న ధ్రువతార శ్రీ జాషువా' అనటంతో ఆరంభమయిన ముంటాజమహలు కావ్యకథా పరామర్శ, 'వీరి సాంద్రదయ గోసాంద్రికలు సాహిత్య భూములను' ఫలవంతం చేయాలని ఆకాంక్షించటంతో ముగిసింది.

కవితలు, వ్యాసాలు తత్కర్తలకు జాషువామీద ఉన్న మమ కారం, భక్తి తెలుపుతూ ఉన్నాయి. నాలుగయిదు వ్యాసాలు ఉత్తమ విమర్శన గుణాలు కొన్ని పుణికి పుచ్చుకొన్నాయి. కవిత్వం భక్తి భావ ప్రేరకంగా ఉంది.

సామాన్యమయిన ఈ సంకలనం చూచి సామాన్యులు జాషువాను ఎంతగా ప్రేమిస్తున్నారో, గౌరవిస్తున్నారో తెలుసుకోవచ్చు. భాసిలోనూ, రాశిలోను మరింత పకడ్బందీగా ఉన్న విమర్శన వాఙ్మయం జాషువా జయంతి సమితివాళ్ళు ముమ్ముందు ప్రకటిస్తారని ఎదురుచూడవచ్చు.

— 'మనోరాణి'

## మృత్యువుపై సైన్సు దండయాత్ర

[(వ్యాస సంకలనం) రచయితలు : హేతువాద మిత్రులు, వెల: 50పైసలు, ప్రతులకు: వి.చెంచయ్య, రీసర్చిస్కాలర్ శాఖ, ఎస్.వి.యూనివర్శిటీ కాలేజి, తిరుపతి 517502.]

ఈ సంకలనంలో 22 పేజీలు, ఎనిమిది వ్యాసాలు వున్నయ్. వ్యాసాలు చాలా ప్రాథమికంగా వున్నయ్. సంకలనానికి అంత బరువయిన పేరు పెట్టినప్పుడు యింకా వివరణాత్మకమయిన, విశ్లేషణతో కూడిన వ్యాసాలను ఇందులో చేర్చితే బాగుండేది. అంత మాత్రాన ఈ వ్యాసాలను కించె పరుస్తున్నట్టు భావించనక్కరలేదు. శ్రీ కె. వాసుదేవరావు వ్రాసిన కొంచెం వివరంగా వున్నది. అయితే శాస్త్ర విజ్ఞానం ఎంత అభివృద్ధి చెందినా, మానవ స్వభావం మారకపోవడానికి కారణం యేమిటనే జిజ్ఞాస ఈ వ్యాసంలో కూడా కనిపించలేదు. నిజమే; అమెరికా, రష్యావంటి దేశాలలో వృద్ధాప్యాన్ని నిరోధించే పరిశోధనలు జరుగుతున్నయ్. GYRONICS అనేశాస్త్రం ప్రకారం ప్రయోగాలు జరుగుతున్నాయ్. కాని వీటి లక్ష్యం యేమి అని ప్రశ్నించడం కూడా హేతువాదమే. అందులో భాగమే ఈ వ్యాసాలు దైనందిన సమస్యలతో . చావలేక బ్రతుకుతున్నసామాన్యులకు యే విధంగా ఉపయోగపడబోతున్నవనే ప్రశ్న.

హేతుకత్వం చాలా గొప్పదే కాని, దాన్ని అవగాహన చేసుకొని నిత్య జీవితంలో ఆచరణలో పెట్టే ఉపాయమేమిటో? శాస్త్ర జ్ఞానం సూచించే పద్ధతి ప్రకారం జీవించడమేనని సులభంగా సమాధానం చెప్పవచ్చు. కాని. నిర్మాణాత్మకమయిన శాస్త్రీయ పంథాలో మానవమేధస్సును ఎలా ఉపయోగించాలో సామాన్యులకు తెలిసేదెలా? శాస్త్రీయ దృక్పథం, హేతుకత్వం అనే మాటలను ఉపయోగించితే కూడూ గుడ్డా అమరుతవా? సామాన్యులకు వచ్చే జబ్బు నయమవుతవా ? నిరుద్యోగికి ఉద్యోగం దొరుకుతుందా ? ఇవన్నీ అవసరమని చెప్పేవారు కరవై ఈనాడు మనం ఇన్ని సమస్యలను ఎదుర్కొంటున్నామా ?

నిజమే, మానవుని పురోగతికి సైన్సు ప్రధాన సాధనమే. ఆ సైన్సు కొంతమంది చేతులలో బందీ అయిపోతే యేమవుతుంది? రోగాలకు కారణం భూతాల ఆగ్రహం కాదు. దానికి విశ్లేషణ చాలా కాలంగా అన్ని దేశాలలోనూ చెబుతూనే వున్నారు. కాని చికిత్సా సౌకర్యాలను నిరుపేదలకు అందని పరిస్థితులలో వారేమి చేయాలి ? నాయనా నీకు జబ్బు రావడానికి నీలో హేతుతత్త్వం లోపించడం కారణం అని చెపితే జబ్బు తగ్గుతుందా ? విశ్లేషణ హేతుకత్వంలో ఒక భాగమే. నిర్మాణం అందులో ప్రధానభాగం. పోతే చిత్త వృత్తులలో మార్పు రావాలనే సూచన ఒకటి వున్నది. చిత్తవృత్తి అంటే యేమిటో ? అందులో మార్పు రావడానికి హేతువాదులు ఏమి చేయాలి ? ఏమి చేయగలరూ ? ఏమి చేస్తున్నారు?అని ప్రశ్నించడంకూడా హేతువాదమే. శాస్త్రజ్ఞుల విద్యకూ వారి విశ్వాసాలకూ పొత్తుండదని అంగీకరించే హేతువాదులు సామాన్యులకు శాస్త్రీయ దృక్పథం అలవడాలని ఉద్బోధించటం కేవలం ఒక ప్రబోధం మాత్రమే కాదా ?

ఒక్క మాటలో ఈ వ్యాసాలు వ్రాసిన వారి ఉద్దేశం చాలా గొప్పదే. కాని హేతుకత్వం కూడా ఒక రకం విశ్వాసం కాకుండా జాగ్రత్త పడడం అవసరం.

మృత్యువుపై సైన్సు దాడి సాగించుచున్నట్టే, ఆధ్యాత్మిక వాదులు కూడా దాడి ప్రారంభించారని గమనించడం అవసరంకాదా?

హేతుకత్వం జోడించిన 'నాస్తికుల'కు ఈ వ్యాసాలు చాలా చిన్నవిగా కనిపిస్తవి. ఆస్తికులు ఈ వ్యాసాలు చదవరు. చదివి ఖండించితే మంచిదే గదా ?

— శ్రీ వి. ఎస్. అవధాని

## సూక్తిముక్తావళీ

[కృష్ణదాస ప్రాచ్య విద్యాగ్రంథమాల–4, సంస్కృత మూల రచయిత శ్రీ భీమరాజు సత్యనారాయణ, ఎం. ఏ. హిందీ వ్యాఖ్యా సహితం, వ్యాఖ్యాత శ్రీ కృష్ణమోహన్ ఠాకూర్, ఎం. ఏ. డెమ్మీ 208 పుటలు. వెల 16 రూ. ప్రకాశకులు–చౌఖంబా సంస్కృత సీరీస్ ఆఫీస్, గోపాల్ మందిర్ లేన్, వారణాసి–16.]

ఈ 'సూక్తిముక్తావళి' సుభాషితాలను తెలియజేసే గ్రంథం రెండువందల ఒక్క సుభాషితాలు సులభంగా ఉండే సంస్కృత శ్లోకాలలో ఇవ్వబడినవి. ఇట్టి గ్రంథాలు ప్రాచీనమైనవి. సుభాషిత రత్న భాండాగారం, సూక్తిరత్నాకరం, భర్తృహరి సుభాషితత్రిశతి మున్నగునవి ఉన్నవి. అయినా ఇవి వాటికంటె కొంత విలక్షణమైనవి. తెలుగులో ఉన్న భాస్కరశతకం రీతిని ఇందులో ప్రతి సుభాషితానికీ అనురూపమైన దృష్టాంతం కూడా ఇవ్వబడుతుంది.

ఇది సంస్కృతభాష తెలిసినవారి కందరికీ ఆమోదాన్ని కలిగిస్తుంది. సంస్కృతం తెలియకపోయినా హిందీ తెలిసినవారికి కూడా ఉపయోగించడానికి అనువుగా హిందీవ్యాఖ్య చేర్చబడింది.

సంస్కృత మూలకర్త సత్యనారాయణగారు ఎం. ఏ. ఉపాధిధారులు. అనుభవజ్ఞులు. ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటులో పని చేసి, రిటైరయి ప్రస్తుతం పశ్చిమ గోదావరి జిల్లా తణుకులోని ఎస్. బి. ఎస్. ఓరియంటల్ మహిళా కళాశాలకు ప్రిన్సిపలుగా

ఉంటున్నారు. హిందీ వ్యాఖ్యాత కృష్ణమోహన్ ఠాకూరుగారున్నూ ఎం ఏ. పట్టభద్రులే. కాశీ హిందూవిశ్వవిద్యాలయానికి చేరిన రణవీర సంస్కృత విద్యాలయానికి ప్రిన్సిపలుగా ఉంటున్నారు. సమర్థులైన ఈ ఉభయుల చేతుల్లోనూ తయారైన యీ గ్రంథం ప్రశస్తంగ ఉండడంలో ఆశ్చర్యంలేదు.

ఉదా—

'అల్పజ్ఞ ఏవ పురుషః ప్రలపత్యజస్రం
పాండిత్య సంభృతమతిస్తు మిత ప్రభాషీ,
కాంస్యం యథాహికురుతేఽతితరాం నినాదం
తద్వత్సు వర్ణమిహనైవ కరోతి నాదమ్'.
[శ్లో 12. పుట 14]

ఈ శ్లోకం వేమన రచించిన

"అల్పుడెపుడుం బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కు చల్లగాను,
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా
విశ్వదాభిరామ వినుర వేమ"

అనే పద్యాన్ని అనుసరించినది. శ్లోకం సులభంగా అర్థమవుతున్నది.

'కేనాపి గూఢ రచితం యది దుష్టకార్యం
కాలాంతరేణ భవతి ప్రకట స్వరూపమ్,
స్వర్ణద్రవేణ కలితః ఖలు తామ్ర లోహః
హేమ్ని చ్యుతే ప్రకట మేన్నిజ తామ్ర రూపమ్'
[శ్లో. 112. పుట. 114]

"ఎవరైనా ఒక చెడ్డపని చేస్తే, అది రహస్యంగా చేసినా, అప్పుడు కాకున్నా మరి ఒకప్పుడయినా బయటపడక మానదు. రాగి బంగారంతో కలిసిపోయిఉన్నా, ఆ బంగారం కరిగిపోతే రాగి బయట పడుతుంది" అని అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని వ్యాఖ్యాత పులి తోలు కప్పుకున్న గాడిద అనే మరొక దృష్టాంతాన్ని చేర్చి విపులీకరించారు. వ్యాఖ్యలో మూలానికి సరిపోయే సంస్కృత శ్లోకాలు కూడా అక్కడక్కడ ఇయ్యబడినవి.

ఈ పుస్తకాన్ని సుప్రసిద్ధ సంస్కృత గ్రంథ ప్రకాశకులు కాశీ చౌఖంబా సంస్కృత పుస్తక శాలవారు ఎంతో అందంగా ముద్రించి ప్రకటించారు.

దీనికి, మద్రాస్ స్టేట్ ఆస్థాన కవిగా ఉండిన మహా మహోపాధ్యాయ, పండితరాజ కే. ఎస్. కృష్ణమూర్తిశాస్త్రిగారు కూర్చిన ప్రస్తావన ఉన్నది.

సంస్కృత భాషాభిమానుల ఆదరాన్ని పొందవలసిన ఉత్తమ గ్రంథం యిది.

—"అంగీరస"

# స్నేహలత

[గౌరవ సంపాదకులు: సంజీవదేవ్, ప్రచురణ, ప్రాప్తిస్థానం:లోహియా విజ్ఞానసమితి, గుంటూరు. మూల్యం:15–00]

స్నేహలత చనిపోయి చరిత్ర సృష్టించింది. స్నేహలతా రెడ్డిని తెలిసిన ప్రతివాళ్ళు ఆమె మరణవార్త విని అవాక్కయిన వాళ్ళే. ఎవరేనా అంతేనేమో. సజీవంగా, సరస చతురోక్తులతో మూర్తీభవించిన చైతన్యంలాగా సంచరించిన వ్యక్తి హఠాత్తుగా యిక లేదన్నప్పుడు కల్గే విభ్రాంతి అదేనేమో.

స్నేహలత స్నేహానికి చిహ్నంగా జీవించింది ఆమె కళారాధకురాలిగా, నాటకరంగంపై అతి మక్కువగల నట రాలిగా తెలిసిన వారికి స్నేహలత లేమి ఎంతటి కొరతనో క్షణం తెలుస్తూనే వుంటుంది.

స్నేహలత సాధారణ పరిస్థితులలో మరణించలేదు. కనే ఆ వ్యక్తి జ్ఞాపక చిహ్నంగా యీ స్నేహల సం లోహియా విజ్ఞాన సమితి వెలువరించింది. అసాధారణ పరి బలి అయిపోయిన స్నేహలత అనేక విధాలుగా సంస్మరణీయురాలి సంగతి యీ సంచికలోని పలువురి వ్యాసాలు తెలియచేస్తున్నా స్నేహలత వ్యక్తిత్వంపై మక్కువ, మానసాయమైన గౌరవా శయాలతో రాసినవీ, ఆమె నమ్మిన సిద్ధాంతాలిక నవ మకాలను బ పరచేవీ, ఆమె కోమల వ్యక్తిత్వాన్ని జ్ఞప్తికి తెచ్చేవీ చాలా వ్యాసా వున్నాయి. వాటితోబాటు యీ సంచికలో చారిత్రక సత్యాలను, ప డలను చాటిచెప్పే వ్యాసాలు వుండడం గమనార్హం. హర్షింప ద విషయం కూడా. కాలం చేసిన వ్యక్తి ఘనత చాటగానే సరిపో ఆ వ్యక్తి నమ్మిన విశ్వాసాలను, సిద్ధాంతాలను ఉటంకించి చ చెప్పే వ్యాసాలున్నాయి. అవి వ్రాసిన వాళ్ళు సామాన్యులు కా వ్యాసకర్తలు అందరు. బహుముఖ ప్రజ్ఞావంతులు కావడంవ వారి వ్యాసాలకి, అవి రేకెత్తించే ఆలోచన సరళికి అంతటి విల యివ్వవలసి వుంటుంది. స్త్రీపురుష సమానత్వంపైన, స్త్రీజా సంఘంలో ఉంటూ వచ్చిన స్థానంపైన, మహిళోద్యమం పై అనేక విషయాలపై వ్యాసాలు ఈ సంపుటిలో చోటుచేసుకున్నా జిజ్ఞాసువులైన స్త్రీ పురుషులు, ముఖ్యంగా యువత చదివితీరవ సంకలన గ్రంథమిది. స్నేహలత సృష్టి 'సీత' నాటిక ఈ వుండడం ఒక ప్రత్యేకత.

వెల కాస్త ఎక్కువే అనిపించినా, సకారణంగనే వెల నిర్ణయించారేమో అనిపిస్తుంది. తానునమ్మిన విజ్ఞానవి కార్యక్రమాలకి మూల్యం వెచ్చింపబడుతుందని అనుకుం రాంగోపాల్ వేసిన స్నేహలత పెన్‌స్కెచ్ ముఖపత్రంగా వె ఈ 'స్నేహలత' సంచిక — ఔత్సాహికులందరు చదివి సంచిక.

— శ్రీమతి క

Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 7

